# పీఠిక A

విద్యార్థులారా! దేశాభిమానులారా!

గాయకసంఘసంస్కరణాభిలాషినై 1909 వ సంవత్సరమున మ దభిప్రాయముల నాయాజిల్లాలయం దుపన్యసించు సందర్భమున వివిధవిషయసంస్కరణముం గూర్చి కూడ ముచ్చటింపవలసినవాఁడ నైతి. అందు గాయకసంఘసంస్కరణాభిప్రాయములు మాత్రము తత్పూర్వము నేను బ్రచురించిన గానసారమందుఁ జాలవఱకుఁ బ్రకటింపఁ బడి త దితరములు గ్రంథస్థములు కాకపోవుటచే వానిని (వివిధవిషయ సంస్కరణ పద్యములు అను పేర నొక చిన్నపొత్తమున మిక్కిలి సంగ్రహముగ 1910 వ సంవత్సరమునఁ బ్రచురించియుంటి. నేను చిరకాల ముపన్యాసకుఁడుగ దేశసంచారం బొనరించుట దుర్ఘటం బని తోఁచుటచేతను, ఉపన్యాసక కార్యంబునకంటెఁ గవికార్యం బధికప్రయోజకం బని యెఱింగియుండుటచేతను ద దభిప్రాయముల నిపు డుపన్యాస మంజరి యనుపేర నీగ్రంథరూపముగఁ బ్రచురించుచున్నాఁడ.

ఇందలి భాష భావిసహోజను లనఁదగిన పైతరగతుల విద్యార్థులకుఁ దగియుండు నుగాక యనెడి సంకల్పముతో వ్రాసినాఁడ. విద్యార్థిజనగ్రహణ సౌకర్యార్థము కొన్ని వివాదాంశములను, లక్ష్యములనుండి గ్రహించిన లక్షణములను, ఉపన్యాససారములను బద్యరూపమ[illegible] నొనర్చినాఁడ; మఱియు నచ్చటచ్చట సంధుల విడఁదీసి వ్రాసినాఁడ.

ఈ గ్రంథమును [illegible] పుటవఱకును మద్రాసునందలి వైజయంతీ ముద్రాక్షరశాలవారును, 105 వ పుటనుండి తక్కినభాగములనన్నిటిని గుంటూరునందలి చంద్రికా ముద్రాక్షరశాలవారును ముద్రించిరి. ఇందలి విశేషభాగమును కుమారసంభవనాటక గ్రంథకర్తలగు బ్రహ్మశ్రీ వురుగంటి సూర్యనారాయణశాస్త్రిగారును, కొదవభాగమును బ్రహ్మశ్రీ కొల్లపూడి లక్ష్మణశాస్త్రిగారును సవరించి యొసఁగినందుకు వారికి నా వందనంబు లర్పించుచున్నాఁడ.

పెద్దలు సాదరులగుచు నిందలి దోషముల మన్నింతురుగాక.

బెజవాడ
1—7—13

ఇట్లు
బుధజనవిధేయుఁడు
చేతపూడి భగవంతరావు.

B

# విషయసూచిక



# రుక్మాంగద (నాటకము) రు. 1



నీతులకు పెన్నిధి. నవ్వులతో కడు పుబ్బును.

స్త్రీలకును విద్యార్థులకును గూడఁ దెలియును.

పండితాభిప్రాయములు.

ఉ. పెల్లుగ నాటకంబు లని ♦ పేరిడి యిప్పటికొండ లెన్నియో
యల్లిరికాని యందొకటి ♦ యానిడియించును మోసపోయి నే
నెల్లమిఁ బూని వింటిఁ దొలి ♦ నో భగవత్కవి! నీదునాటక
మ్ముల్లమునం బ్రమోదము న ♦ నూనముగా నొనఁగూర్చె నద్దిరా!

మ. మొగమోటంబునఁ జెంతనున్నతటి మె ♦ ప్పుల్ వల్కుఁగా నిందు నా
కగులాభం బొకయింత లేదుకద; స ♦ త్యంబుగ్ వచింపన్ దగున్;
భగవద్రావుకవిత [illegible] నస్సి, రసా ♦ స్వాదతనుముం డైనచోఁ
బగవాఁడైనను మె[illegible]ప్పడఁ గలఁడే? ♦ పంతంబుఁ జేపట్టినన్.

శొంఠి భద్రాద్రిరామశాస్త్రి.

చ. పలువురు నాటకంబు లని ♦ పద్దెము గద్దెముఁ గూర్చి యల్లినన్
వెలసెను గబ్బముల్ జగతి ♦ వేలు రసం బొకయింతలేక; నీ
యలఘు కవిత్వధారయుఁ, స ♦ మంచితమౌ ప్రతిభావిశేషముల్
లలిత పదార్థసౌషవము ♦ లభ్యములౌ టరుదీ దినంబులన్.

క. రసపుష్టియు, శబ్దార్థ
ప్రసన్నత, కథావిచిత్ర ♦ రచనయు, సంద
ర్భ సమగ్రశుద్ధి యొండఁ
బొసఁగుట నీ పూర్వపుణ్య ♦ పూర్ణఫలంబౌ.

చెన్నాప్రగడ భానుమూర్తి.

బి. ఏ., యల్. టి.

గీ. ఎంతో శ్రమచేసి చగివి • పరీక్షలిచ్చి । మిన్నలై నీఁడు జదువఁగ • నున్న మీరు
పరమ కవిమిత్ర వరదుఁడౌ • నవ్యమూర్తి । యఖిల శుభము లొసంగు వి • ద్యార్థులార!

**200** PAGES.) **కవిమిత్రము రు 0—8—0** (**1600** WORDS.

దృష్టాంతసహితముగ వ్రాయఁబడినది. భాషను సంరక్షించునది. విద్యార్థులకుఁ దోడగునది.
ఈ క్రిందివాక్యములందలి యర్థభేదములచేత దీని యుపయోగంబును, దీనిం దెలియకపోవుటచేఁ గలుగు ననర్థకంబు నేని జదువరులు! సులభముగ గ్రహింపవచ్చును.

| | | |
|---|---|---|
| 1 | *a* నేను మీబోఁటుల సాంగత్యము గోరి వచ్చితి. | నేను మీవంటివారి స్నేహమును గోరి వచ్చితి. |
| | *b*.........బోటుల......... | నేను మీ యాఁడువాండ్ర నీఁదుఁ గోరి వచ్చితి. |
| 2 | *a* వారి వాకిట వెలుఁగుఁ బెట్టుము | వారి వాకిట నేదైన దీపమును బెట్టుము. |
| | *b*...........వెలుగు......... | వారి వాకిట కంపఁ గొట్టుము. |
| 3 | *a* వాని పని తీరినది. | వాని వ్యవహారము చక్కఁబడినది. |
| | *b*.........తీటినది. | వాఁడు నశించెను. |
| 4 | *a* నీ వీ పుస్తకములఁ గాచుచుండుము. | నీ వీ పుస్తకములయొద్దఁ గావలియుండుము. |
| | *b*................గాఁచు...... | నీ వీ పుస్తకముల గాల్చుచుండుము |
| 5 | *a* నీవు భోగమునకు వలతివై యుంటివి. | నీవు భోగమునకు స్థానమై యుంటివి. |
| | *b*..............వలఁతి... | నీవు భోగమునకు స్త్రీవై యుంటివి. |

# ఉపన్యాసమంజరి

## 1. ప్రార్థన.

శ్రీమ దఖిలభువన కారణుం డగు పరమేశ్వరుం డొక్కఁడు గలఁడనియుఁ, నాతఁ డెల్లరకును సర్వదా సేవనీయుఁడును భజనీయుఁడును నై యుండుననియు సర్వమతంబులవారును సర్వకాలములయందును విశ్వసించుచున్నారు. మఱియు,

### సృష్టివైచిత్ర్యము.

"సీ. రవి శశి తారలఁ ♦ గ్రమవర్తనులఁ జేసి - యెండవెన్నెలలఁ గా♦యించె నెవఁడు?
ఫల పుష్ప కిసలయం♦బుల నొప్పు తరుల సృ - జించి జగ మలంక♦రించె నెవఁడు?
అల్లనల్లన వీచి ♦ హాయి నొసంగెడి - పిల్లవాయువులఁ గ♦ల్పించె నెవఁడు?
అఖిలజీవుల జీవ♦నాధారములు కాఁగ - మధురోదకముల న♦మర్చె నెవఁడు?

గీ. ఎవఁడు జగముల సృజియించు? ♦ నెవఁడు పెంచు?
నెవఁడు పాలియించు? జగముల ♦ కెవఁడు కర్త?
అణువుమొదలుగఁ గల్గు బ్ర♦హ్మాండ మెల్లఁ
జేసె నెవ్వఁడు బళి! సృష్టి♦చిత్ర మహహా!" మనుసంభవము, పంచమాంకము.

అనునట్లు సృష్టివైచిత్ర్యముయొక్క యాధిక్యముం బట్టి యాతని సర్వశక్తత్వమును, కరుణామయత్వమును గ్రహించుచున్నారు. కరచరణాద్యవయవవిశిష్టమగుచు, సుఖదుఃఖానుభవజ్ఞానముఁ గలిగి, యుక్తాయుక్త విచారజ్ఞానసంపన్నమైన యీ శరీరము నొసంగుటయకాక యీ శరీరధారుల సౌఖ్యముకొఱకుఁ బైపద్యమున వివరింపఁబడిన సౌకర్యాదుల నకారణకరుణాయుతుండగుచు నొసంగుటచేత నాతనియెడఁ గృతజ్ఞులగుచు నాతఁడు కరుణామయరూపుఁ డని యెఱింగి తత్కృతజ్ఞతాప్రేరణంబున నాతని గుణనామకీర్తనంబును, నిరంతరసుఖప్రాప్త్యర్థ మాతని ప్రార్థనంబును దినదినమును భక్తియుక్తులగుచు సర్వజనులు నొనరించుచున్నవారు. ఈ కీర్తనప్రార్థనంబులు సంఘప్రార్థన, కుటుంబప్రార్థన, ఏకాంతప్రార్థన యను పేళ్లతోఁ ద్రివిధంబులఁ బరఁగుచుండును. ఇంత మాత్రముచేఁ దృప్తిఁజెందక కొందఱు పరమభక్తులు శ్లో. శ్రవణం కీర్తనం విష్ణో -

స్మరణం పాదసేవనం । అర్చనం వందనం దాస్యం - సఖ్య మాత్మనివేదనం. అనునట్టు లా పరమేశ్వరుని గుణ విశేషంబులఁ దఱచుగా వినుచుండుట, వానిని బొగడుచుండుట, వానినే మఱిమఱల స్మరణకుఁ దెచ్చుకొనుచుండుట, ఆ పరమేశ్వరుని సేవయందే తన కాలమును గడపుచుండుట, బహిఃపూజావిధానంబునఁ గాని మానసపూజావిధానంబునఁ గాని యాతనిఁ బూజించుచుండుట, ఆతనికిఁ గృతజ్ఞతాపూర్వకంబుగను భక్తిపూర్వకంబుగను నమస్కరించుచుండుట, స్వాభిమానరహితంబుగ నాతనికిఁ బరిచర్య లొనరించుచుండుట, విషయసంగంబుల నిరసించి చిత్తంబు నెల్లప్పు డాతనియందే సంధించియుండుట, చిత్తం బాతని కర్పించి తాను బరవశత్వమునొందియుండుట అను నీ తొమ్మిది విధంబుల నాతని సర్వదా సేవించి తృప్తులగుచున్నారు. ఇట్లు సేవించిన పరమభక్తుల యందు మనుజాతీతములగు నీశ్వరశక్తు లగపడుచున్నవి. అనఁగా నిర్జీవపదార్థమును సజీవపదార్థముగ నొనరించుట; సజీవపదార్థమును నిర్జీవపదార్థముగ నొనరించుట; ఒక్కని యాఁకలినైనను దీర్పఁజాలని రొట్టెతోడఁ బెక్కండ్రకు విందుచేసి తృప్తినొందించుట; ఒక్కఁడే యేకకాలమున ననేకస్థలంబులఁ గన్పట్టుట; 'ఆడినది యాట పాడినది పాట' యగుట; ఇత్యాద్యద్భుతకార్యంబు లొనరింప సమర్థులగుచున్నారు. ఇట్టి యద్భుతకార్యాచరణసామర్థ్యం బీశ్వరదత్తంబు కాదనియు, జగత్కారణుండగుచు నీశ్వరుఁ డొక్కఁడు కలఁడనుట యనావశ్యకంబనియు, సృష్టి యంతయు స్వభావాధీనంబనియుఁ బై యద్భుతకార్యాచరణము కేవలముగ మనోబలకార్యంబనియు, ధ్యాననిష్ఠయం దొనరించు చిత్తైకాగ్రతచే మనోబలప్రాప్తిం గాంచి తద్బలసాహాయ్యంబునఁ గొంద అద్భుతకార్యంబుల నొనరించుచుందురనియు, మనోబలసంపాదనమార్గముల నెఱింగినవారికీ కార్యములు కరతలామలకముగ నుండుననియుఁ జెప్పెడి నిరీశ్వరవాదులు ను గొందఱు కలరు. వారు చేయునది కేవల హేతువాదము. వారును గొన్ని యద్భుతకార్యములఁ జేయఁజాలియున్నారు. కాని యట్టివా రత్యల్పసంఖ్యాకు లయియున్నారు. వారి యత్నములు భక్తివిశ్వాసశూన్యము లైయున్నవి. కేవలహేతువాద మధికయుక్త్యపధికంబుగ నుండును. కావున వారి విషయ మిచట గణనీయము కాదు. ఈశ్వరుని భక్తివిశ్వాసములతో నారాధించి, తదనుగ్రహకారణమున నీశ్వరశక్తులఁ బడసి, మహాకార్యముల నొనరించిన మహనీయులు సర్వమతములయందును, సర్వకాలములందును, సర్వదేశములందును నచ్చటచ్చటఁ గన్పట్టుచునేయున్నారు. అట్టివారి నీశ్వరసమానులని కొందఱును, ఈశ్వరావతారములని మఱికొందఱును, ఈశ్వరుఁడేయని యింకఁ గొందఱును గౌరవించి పూజించుచున్నారు.

అట్టి యీశ్వరభక్తుల చరిత్రములు నిర్దుష్టములైయుండును. వారల సంకల్పంబు లీశ్వరప్రీతికరములైయుండును. వారల వ్యాపారంబులు సర్వజనాదరణీయములై యుండును. వారల తేజం బెల్లప్పుడును స్ఫటికమువలె నిర్మలమైయుండును. వారల ప్రసంగంబు లమృతతుల్యంబులైయుండును. వారల హృదయంబు లానందమయములై యుండును. వారలి బోధలు మోక్షదాయకములై యుండును. వారల యాకారంబులు శాంతరూపములైయుండును. వారల దర్శనంబులు పావనంబులైయుండును.

ఇట్టి మహనీయులలోఁ బెక్కండ్రయం దొక్క లోపంబు తఱచుగాఁ గనవచ్చుచున్నది. అదెద్దియనఁ బరమతద్వేషము. ఈ ద్వేషమునకు స్వమతమందలి యభిమానమును భక్తివిశ్వాసములునే కారణములుకాని వేఱొండు దుష్టగుణం బెద్దియుఁ గారణము కాదు. పరులను నష్టపఱుపవలయునని కాని, అవమానపఱుపవలయుననికాని, హింసింపవలయుననికాని సంకల్పము వీరికి లేశమాత్రము నుండదు. తా రవలంబించిన మతము సర్వోత్కృష్టమయినదనియు, తద్ధర్మంబు లచిరమోక్షదాయకంబులనియు, అన్యమతంబు లట్టి ఫలం బొసంగ నసమర్థంబులనియు, అట్టిమతంబుల నాశ్రయించుట భ్రమప్రమాదజనిత దోషంబనియు, అట్టి దోషంబునుండి ప్రజలఁ గాచుట తమ విధియనియుఁ దమ మనంబుల దృఢంబుగ నమ్మి పరోపకారసంకల్పప్రేరిత హృదయులగుచు నన్యమతస్థులకుఁ గూడ స్వధర్మములను బోధింపఁ గడఁగుచున్నారు. అట్లు స్వమతౌత్కృష్ట్యము నుగ్గడించు సందర్భమునఁ బరమతధర్మనిరసనమును గూడ విధిగాఁ గావింపవలసినవార లగుచున్నారు. అట్టి నిరసనమును సహింపక యాయా మతస్థులు వీరి బోధల నుల్లంఘించునపుడు వీరు వారియెడ ద్వేషముం బూనుచున్నారు. ఇదియే పరమతద్వేషము. ఈ ద్వేషకారణమున వీరిలోఁ గొంద అన్యమతస్థుల నష్టపఱుచుటయు, అవమానపఱుచుటయు హింసించుటయుఁ గూడఁ గటస్థించుచున్నది. ఈ మహనీయుల నిర్మలచరిత్రయం దీవిషయ మొక కళంకముగ నిలుచుచున్నది. నిష్కల్మషహృదయులును, పరోపకారచింతనాయత్తసంకల్పులును, మఱియు మతాధికారులును నగు నిట్టి మహనీయుల చిత్తములనే పరమతద్వేష మింతగఁ గలవరపఱుచుచుండ నిఁక భక్తిమాత్రప్రయోజకులును బుద్ధిస్వాతంత్ర్య రహితులును నగు కేవలమతస్థులఁ గూర్చి వచింపనేల? రక్తము వెల్లువలై పాఱునట్టు లీ భక్తసమూహములచేత నప్పుడప్పుడు యుద్ధములను గూడఁ జేయించిన దీ పరమతద్వేషమే.

ఈ పరమతద్వేషము సహేతుకమా నిర్హేతుకమా యని విచారించినయెడ నిది మిక్కిలిగ నిర్హేతుక మని వేయినోళ్లఁ జాటి చెప్పఁదగియున్నది. ఏలయనఁగా:—

ఒక్కొక్క మతము ఒక్కొక్క దేవుని నామముతో అవినాభావసంబంధమును గలిగియున్నది. చిత్తగింపుఁడు. విష్ణుభక్తులు వైష్ణవులు; వారి మతము వైష్ణవము. శివుని భక్తులు శైవులు; వారి మతము శైవము. క్రీస్తుభక్తులు క్రైస్తవులు; వారి మతము క్రైస్తవము. మహమ్మదు భక్తులు మహమ్మదీయులే; వారిది మహమ్మదీయమతము. ఇట్లే యితర మతములును ఆయా వేల్పుల నామములతో నవినాభావసంబంధమును గలిగియున్నవి. కావునఁ బరమతద్వేషమనినను పరదైవద్వేషమనినను ఒక్కటే. దీనిచేత స్వపరదైవ భేదము నశించినఁగాని తద్ద్వేషము వీడదనియు, పరదైవ ద్వేషము వీడినఁగాని పర మత ద్వేషము వీడదనియు స్పష్టమగుచున్నది. కావున నీ ద్వేషమున కెల్ల మూలకందమగు స్వపర దైవభేదజ్ఞాన మెంతదనుక సహేతుకమో యిచట విమర్శింపఁ బడవలసియున్నది. ఎవ్వరెవ్వ రేయేపేళ్లతో నేయేదైవముల సేవించుచుండినను వా రెల్లరు నాయా దైవములందు సమానధర్మములనే యారోపించుచున్నారు. వారువారు వారివారి దైవములను సర్వమయుఁడు, సర్వేశుఁడు, సర్వకర్త యనియే చెప్పుచున్నారు. దీనిచేత వా రేయేపేళ్లతో వేఱువేఱుగ సేవించినను వారందఱు దైవమును నొక్కఁడే యని స్థిరపడుచున్నది.

తన దేవుఁడు సర్వమయుఁడు అని చెప్పుటచేత నింకొక దేవుఁ డుండ నేయుండఁడు అని దానియందే కన్పట్టుచున్నది. ఏలయన సర్వమయుఁడు అనఁగా సర్వమును దానుగ నున్నవాఁడు అని కదా యర్థము చెప్పవలయు? తనదేవుఁడే సర్వము నై యున్నయెడ మఱియొక దేవుఁ డెవఁడు? అతఁ డెచ్చటనుండును? అతఁడు మఱికొంత ప్రదేశములో నుండె నని చెప్పునెడ నతఁడు తనదేవుఁడుకాని భిన్నపురుషుఁ డనియే చెప్పవలయుఁ గదా. అట్లు భిన్నపదార్థము నంగీకరించునెడఁ దన దేవుని సర్వమయత్వమునకు భంగము కలుగుట లేదా? సర్వమయుఁడు కానివాఁడు దేవుఁ డగునా? ఒకవేళఁ దనదేవుఁడు సర్వమయుఁడే యనియు, నితరుల దేవుఁడు సామాన్యుఁడగుటచేఁ దనదేవునిలోఁ గొంతభాగ మందు మాత్రమే వ్యాపించియుండుననియు, నిట్లే లాఁతి దేవ ళ్లందఱును దన దేవునిలో భాగములుమాత్రమే యైయుందురనియుఁ, గావునఁ దమదేవుని సర్వమయత్వమునకు భంగము కలుగుటలేదనియుఁ జెప్పెడివారును గొంద ఱుండవచ్చు నని సంశయింపవలసి వచ్చుచున్నది. కానిండు; వీరు చెప్పెడుదానిని వాదసౌకర్యార్థము క్షణకాల మంగీకరించెదము. అట్లయినను బరదైవద్వేషమునకు లేశమాత్రమైన నవకాశము లేకపోవుచున్నది. ఎట్లనఁగా దన దేవుని మొత్తముగఁ జేకొని భూషించుచు 'ఇతరదైవములు' అను పేరితో నాతనిలోని భాగములనే వేఱుచేసి ద్వేషించునెడ నది మొత్తమును

ద్వేషించుటయే కాదా? శరీరమును మొత్తముగఁ జేకొని పూజించి దాని యవయవములను వేఱు చేసి విఱుగఁ గొట్టిన ట్లుండదా?

ఏకేశ్వరోపాసనము.

గీ. స్వామి! దాసోహము; నమస్కరోమి; యనుచుఁ
జందనాదులఁ బూజించి శరణు చేసి
కాలు విఱిచి, జుట్టును బీఁకి కన్ను పొడిచి
యగడు చేసిన పూజనం బగునె? బళిర!

ఎచ్చటనైన మొత్త మొకటిగను దానిలోని భాగములు వేఱొకటిగను నుండునా? అట్టిది యసంభవము కాదా? ఆతని సర్వేశ్వరత్వము ను సర్వకర్తృత్వము ను గూడ నిట్టి వియే కావా? కావునఁ దన దైవమనియుఁ బరదైవమనియు భేదభావమును వహించుట కవకాశము నుంతయు లేదు. పరదైవమే లేనియపుడు పరదైవద్వేష మప్పుడే లేకపోవును. పరదైవద్వేషమున కవకాశము లేనపుడు తద్దైవనామము నాశ్రయించిన పరమతమును ద్వేషించుట నిర్హేతుక మని వేఱుగఁ జెప్పనేల?

ఇట్టి నిర్హేతుక మగు పరమత ద్వేషము దేశమం దేల యచ్చటచ్చటఁ గన్పట్టఁగలయు నని యేరైన శంకింపవచ్చును. దానికి సమాధాన మిటఁ దెలుపఁబడును. వేఱు వేఱు కాలములందు వేఱువేఱగు దేశములయందు వేఱు వేఱగు మహనీయు లుద్భవించి మనుష్యాతీత ప్రజ్ఞాధురంధరులగుచు నాయా సంఘములవారికి తరణోపాయంబులుగ నుండునట్లు కొన్ని ధర్మంబుల నుపదేశించుచు నొక్కొక్క మతమును స్థాపించిరి. అవి భిన్న కాలములయందు భిన్న సంఘోపయోగార్థము భిన్న పురుష బోధితంబులగుటంజేసి యాయాధర్మసూక్ష్మము లీషన్మాత్రము పరస్పర భేదసహితము లయ్యు మానవుల కెల్లరకును బ్రధానతరణోపాయం బగు హృదయపారిశుద్ధ్యము నొసంగుటయందు మాత్ర మేకీభావమును వహించుచున్నవి.

చిత్తశుద్ధి.

"చ. పుడమి జనింప నేమి? బహుభోగములందుచుఁ బొంగ నేమి? తా
నడు గటు వెట్టకుండఁగ మహాధనధాన్యము లుండ నేమి? యం
ధుఁడు కొను దివ్వెయుర్, మఱియు దూలిని బోసిన యాజ్యముర్, కటా
యడవిని గాయు వెన్నెలయు నొంజుమి చిత్తవిశుద్ధి లేనిచోర్."

రుక్మాంగద నాటకము.

కొందఱు సామాన్యజను లట్టి మత సామరస్యము ను గ్రహింపఁజాలక తదీషన్మాత్ర భేదంబులఁ బురస్కరించుకొని యాయా మతంబుల ద్వేషించుచుందురు. ఇదియే పరమత ద్వేష కారణము.

# ఉపన్యాసమంజరి.

ఈ ద్వేషము మనుజునకు సర్వానర్థదాయక మనుటకు సంశయ మేమైన నుండునా? ఇది మనుజుని రాగద్వేషాది త్రయోదశాంతశ్శత్రువర్గములోని దగుట రహస్య విషయము కాదుకదా. ఈ శత్రుగుణంబులలో నొక్కదానికి మానవుఁడు తన హృదయంబునఁ జోటిచ్చినయెడ నది క్రమక్రమంబుగఁ దన సహచరవర్గంబున కెల్ల నచ్చట నవకాశముఁ గలిగించును. వీనిలో నెల్ల ద్వేషం బత్యధికక్రూరస్వభావము కలది. సర్వదా పరమేశ్వరధ్యానపరాయణు లగు భక్తవరుల హృదయగేహంబుల నిట్టి మహా క్రూరశత్రువునకుఁ జోటిచ్చుట పుష్పవనంబునందు బెబ్బులిం బ్రవేశపెట్టుటవంటిదే యగును గదా. నిరంతరధ్యానకారణంబున వారి హృదయగేహము లెప్పుడును పారిశుద్ధ్యము, తృప్తి, శాంతి, ఆనందము, భూతదయ అను పంచమహాగుణంబుల కాటపట్టులై యొప్పును. అట్టిచోట నీ ద్వేషవ్యాఘ్రంబే చేరినయెడఁ దన్మహాగుణపంచకంబున కెల్లఁ బంచత్వంబు గల్పించి రూపు మాపుననుటకు సంశయముకలదా? కావుననే యీ ద్వేషము సర్వానర్థదాయకమని నుడువఁదగియున్నది.

ఇట్లు నిర్హేతుకమును అనర్థదాయకమును నగు పరమతద్వేషమునకు హృదయంబునఁ జోటీయక, సర్వమయుఁడు సర్వేశుఁడు సర్వకర్తయు నగు పరమేశ్వరుండు సర్వజీవులకును ఒక్కఁడుమాత్రమే కలఁడనియు, నాతఁడు సమస్తకల్యాణగుణ పరిపూర్ణుఁడనియు, నాతఁడు మన కొనరించిన మహోపకారంబులకెల్లఁ గృతజ్ఞతాపూర్వకంబుగ నమస్కరించుటకన్న వేఱొద్దియుఁ జేయఁజాలమనియు నెఱింగి వినయపూర్వకంబుగ నమస్కరించుచు, నవవిధభక్తివిధానములచే నాతని సేవించుచు, సుఖదుఃఖభాజనం బగు జీవయాత్రయందుఁ దా మొనర్చిన మంచిచెడ్డల నాతనికి దినదినమును విన్నవించి 'నలయు సాహాయ్య మొసంగుచుఁ దోడునీడయై యుండు' మని దయామయుండగు నా పరమేశ్వరు ననుదినంబును బరిశుద్ధచిత్తంబున భక్తిపూర్వకంబుగఁ బ్రార్థించుట సర్వజనులకు నవశ్యకర్తవ్య మని మనవిచేయుచున్నాఁడను.

ఉపన్యాససారము.

సీ. శ్రీశుఁడే దైవంబు ♦ శివుఁడు వ్యర్థుఁడటంచు - దోఁచి తోఁచని రీతి♦దూటి దూటి
శివుఁడు సర్వవ్యాపి ♦ చిల్లర దైవాల - తెరువు పోనరుఁడంచుఁ ♦ దిట్టి తిట్టి
యేసునాథుఁడు తక్క♦నితరదైవము లెన్ని - యైన వ్యర్థములంచు ♦ నఱచి యఱచి
అల్లాను సేవింప ♦ నడ్డు చెప్పినవాని నడపఁ జెల్లు నటంచు ♦ నాడి యాడి

గీ. పరమతద్వేషములు పూనఁ ♦ బాడి యౌనె?
సర్వమయుఁడు సర్వేశుఁడు ♦ సర్వకర్త

యగుచు నొక్కనికన్న వే ♦ యమర నగునె?
కాన సర్వేశ! మొక్కెదఁ ♦ గరుణఁ గొనుమీ.

---

## 2. దేశోద్ధారకులు.

ఏ దేశమునందుఁగాని, యే కాలమునందుఁగాని, యే సంఘముగాని కవులు, పత్రికాధిపతులు, ఉపన్యాసకులు, హరికథకులు నను నాలుగు తరగతులవారిచే జ్ఞానవిద్యానాగరికతాదులయం దభివృద్ధి నొందవలసియున్నది. ఈ ప్రపంచమున నేసంఘమం దీ జ్ఞానవిద్యానాగరికతలు లేక యుండునో యది యధమసంఘముగను మూఢసంఘముగను ప్రజాసామాన్యముచేఁ బరిగణింపఁబడుట సుప్రసిద్ధవిషయమే కదా. అట్టి దుస్థితినుండి యా సంఘమును గాపాడి యా దేశము నుద్ధరించువార లెవరు? కవులు, పత్రికాధిపతులు, ఉపన్యాసకులు, హరికథకులు నే. కావుననే యీ నాల్గుతరగతులవారిని దేశోద్ధారకు లని చెప్పఁదగియున్నది.

వీరు నలువురును దేశము నుద్ధరించుట యటుండఁగా వీరిలోఁ బ్రతివారును దక్కిన మూడుతరగతులవారికిని గూడ జ్ఞానదాయకులును మార్గదర్శకులును నగుచున్నారు. వీర లెప్పుడుచూచినను నూతనపాఠములను బ్రజలకు బోధించుచునే యుందురు. వీరు తమ యావజ్జీవితకాలమును బ్రపంచమనెడి మహాపాఠశాలయందు విద్యార్థులయి వర్తించుచు, నెప్పటికప్పుడు నూతనపాఠముల దానినుండి యభ్యసించుచు, అభ్యసించినదాని నాచరణ యందుఁ బెట్టుకొనుచు, నట్టి నూతనపాఠములనే ప్రజలకుఁ గఱపుచుందురు. తా మభ్యసించుటయందుఁగాని యితరులకు బోధించుటయందుఁ గాని వారి కెప్పుడును విసువు జనింపదు. వారు ధనముకొఱకుఁ బనిచేయువారు కారు. ఈశ్వరప్రేరణమున దేశోద్ధరణ కార్యదీక్షాపరవశులగుచు నట్లొనరించుచుందురు. వా రొకరి యాజ్ఞాబద్ధులగుచు గంటలను నిమిషములను లెక్కించుచుఁ బనిచేయువారుగ నుండరు. రేయియని పవలని భేదములేక వారి చిత్తము లెప్పుడును దేశోద్ధరణకార్యపరతంత్రములై యుండును.

‘ప్రపంచపాఠశాలయందు సర్వజనులకును స్వాతంత్ర్యము కలదుకదా; దానినుండి వీరుమాత్రమే నేర్చుకొనుట యితరులకు నేర్పుట యనెడి యీ మధ్యవర్తిత్వముతోఁ బనియేమి? ఆపాఠశాలనుండియే సర్వజనులును నేర్చుకొనఁగూడదా?’ అను సంశయ మిచట నెవరికేఁగాని కలుగక మానదు. కాని యా పాఠశాల తదితర పాఠశాలలవంటిది కాదు. దానియందు బోధకులు లేరు. బోధించుట లేదు. వివిధవిషయములందు వివిధము

లగు పాఠములు మాత్రము చిత్రింపఁబడిన ట్లగపడుచుండును. విద్యార్థులగువారు వారి వారికి తలయు పాఠములను వారివారి యధికారానుసరణంబుగ గ్రహించుకొని యల పలుచుకొనవలసియున్నారు. అట్లు బోధలేకయే పాఠమును గ్రహించుకొనుట కడిఁది. సులభకార్యము కాదు. మిక్కిలి సులభములైన పాఠములను మాత్రము సర్వజనులును గ్రహింపఁగలుగుదురు. గ్రహణశక్తి యెల్లరకును నలయునంత యుండు నని చెప్ప వలను పడదుకదా. కావునఁ గఠినములైన పాఠములు బోధలేకయే వీరికి స్వాధీనములు కావు. పై దేశోద్ధారక చతుష్కంబునకో అపరిమితమైన గ్రహణశక్తి సహజముగ నుండును. వారి చిత్తము లేవిషయమును జూచినను దివ్యదృష్టితోనే చూచుచుండును. గుణదోష విమర్శనముం జేసి తత్సారమును లోకమునకు వెల్లడించుచునే యుండును. అంజనాంచిత నేత్రునకు గుప్తద్రవ్యంబులెల్లఁ బ్రత్యక్షములైనట్లు వీరల దివ్యదృష్టికి ధర్మసూక్ష్మములును వాని గుప్తార్థంబులును గూడఁ బ్రత్యక్షములగుచుఁ గన్పట్టుచుండును.

ఇట్టివారి యాదర్శముల (ideals) ను గ్రహింపఁజాలక కొన్ని సమయములందుఁ బ్రజలు వారియెడ విపరీతాభిప్రాయులగుదురు. వారల నలక్ష్యముచేయుచుందురు. మఱొకప్పుడు నిరసించుచుందురు. వేఱొకప్పుడు ద్వేషించుచుందురు. మఱికొందఱు సామాన్యులు వారల బాధించుటకును గమకింతురు. కాని యీ మహనీయులు తమ యనన్య సామాన్యబుద్ధిబలముచే వారల గుణగ్రహణ సామర్థ్య లోపమును గనిపెట్టి, వారల మన్నించి, శాంతము వహించి, యెట్టులేని బునఃపునఃప్రయత్నములచే విషయతత్త్వమును వారి చిత్తముల కెక్కింపఁ బ్రయత్నింతురు.

ఏదేశంబునఁగాని యీ దేశోద్ధారకచతుష్కంబున నెవ్వరు లేకయుండినను ఆ లోప మా సంఘమునందుఁ బ్రత్యక్షముగఁ గన్పట్టుచునేయుండును. ఈ నల్వురును లేక యుండినయెడ నట్టి దేశ మంధకారనిమగ్నమై యుండినదనుటకు సంశయ ముండునా? ఉండదు. అచటి వారికి విద్యలా పూజ్యము; నాగరికతయా హుళిక్కి; జ్ఞానమా సున్న. తనకుఁ గల ప్రాదేశమాత్రజ్ఞానమునే సర్వజ్ఞత్వముగా భ్రమసి యొజ్జిటలూఁగు కూపస్థ మండుకమువలెనే వారును మాఢ్యమునం బడియుందురు. అట్టి దుస్థితి యే దేశమునకును గలుగకయుండుఁగాత.

ఒకప్పుడు దేశంబున నొక దురాచారము కాలక్రమంబునఁ బ్రబలి దేశభాధక మగు చుండును. వేఱొక సదాచారమే యించుక పెడత్రోవం బట్టి వ్యర్థమగుచుండును. ఒక విద్వాంసుఁడు ప్రమాదవశంబునఁ దప్పుత్రోవం బడి ప్రజలను దన త్రోవకై యాకర్షించు చుండును. అట్టి సమయములందెల్లఁ బ్రజల నాయా ప్రమాదములనుండి మరలించి

కాపాడు భారము నీ యుద్ధారకచతుష్కము మీఁదనే యుండును. మఱియు సంఘాభివృద్ధ్యర్థ మొక్కొక్క ఘనకార్యమును బహుజనసాహాయ్యంబునఁ జేయవలసియుండును. దేశకాలపాత్రానుకూలంబుగ నొక్కొక్క నూతనాచారమును బ్రజ లెల్ల రవలంబింప వలసియుండును. ఆకాశగమన తంత్రీరహితదూరవార్తాశ్రవణాద్యపూర్వమహాకార్యంబుల ప్రాముఖ్యతను గౌరవమును గ్రహించి ప్రజ లెల్లరు వాని నాదరించి ప్రోత్సాహపఱుప వలసియుండును. ఒక్కొక్క ప్రజ్ఞావంతుఁడు తన యసామాన్యప్రతిభావిశేషంబున నొక్కొక్క విద్యయం దద్భుతకార్యంబు లొనరించి బహుజనవంద్యుఁ డగుచుండుటను గాంచినపు డట్టి ప్రతిభాశాలులఁ బెక్కండ్రను సంఘమందు వెలువడఁజేయవలసియుండును. అట్టి సమయములం దెల్ల నాయా దేశోద్ధరణకార్యబీజంబులఁ బ్రజాహృదయభూములందు వెదచల్లి, మొలకెత్తఁజేసి, వానిని దత్తత్సమయానుకూల వచనరచనా దోహదంబుల నభివృద్ధి నొందించి, ఫలదంబులగున ట్లొనరించు సమర్థత యీ మహాజనచతుష్కంబునకే కలదని ఘంటాపథంబుగఁ జెప్పనగును.

అయినను 'ప్రమాదో ధీమతామపి' అనఁగా 'నెంతటి బుద్ధిశాలులకయినను బొరపాటు కలదు' అను నార్యోక్తి యొకటి కలదు. కావున నట్టి ప్రమాదము లీ దేశోద్ధారక చతుష్కంబునందు ను గలుగుననుటలో శంకావకాశ మేమియు నుండదు. అట్టిది సంభవించినపుడు వారలే యొండొరుల దోషంబుల సవరించుకొనవలసి యున్నారు. అట్టి సమయములందు నాగరికులగు ప్రజలు ను దోడ్పడవలసియున్నారు.

దేశోద్ధారకు లగు నల్వురిలో నొక్కొకరి ప్రత్యేకయోగ్యతలును, వారి ప్రత్యేక నిర్వచనములును, వారువా రొనరింపవలసిన విధులును, వారి ప్రకృతకాలస్థితిగతులును, వారియం దావశ్యకముగ నిపుడు జరుగవలసియున్న మార్పులును తదర్థమై ప్రజ లెఱుఁగ వలసియున్న విషయములును వారివారింగూర్చిన ప్రత్యేకోపన్యాసములలోఁ గ్రమంబుగఁ దెలుపఁబడును. నిష్కల్మషహృదయులును, పరోపకారతత్పరులును, సమర్థులును నగు దేశోద్ధారకు లీ యాంధ్రదేశంబునకు లభించునట్లు ను, బ్రజలు వారి యోగ్యతల నెఱిఁగి వారివలని ప్రయోజనము నందునట్లు ను బరమేశ్వరుఁ డాశీర్వదించుఁగావుత మని కోరుచు నీ విషయము నింతటితో ముగించుచున్నాఁడను.

గీ. కవులు పత్రికాధిపతులు ♦ క్రమముతోడ
నల యుపన్యాసకులు మఱి ♦ హరికథకులు
దేశమును నుద్ధరించెడి ♦ ధీరు లగుట
వారి నల్వురిఁ బడయంగ ♦ వలయుఁ బ్రజలు.

## 3. కవులు.

దేశోద్ధారకచతుష్కర్తృకంబునందుఁ గవులు ప్రథమగణ్యులగుచు నగ్రస్థానము నలంకరింపఁదగియున్నవారు. వారివలన మానవసంఘమునకుఁ గలుగు ప్రయోజనము గణనాతీతమైయుండును. ఎట్లనఁగా:— పరమేశ్వరదత్తమైన బుద్ధిబలముచేతను, నిరంతర లభ్యమైన లోకానుభవముచేతను, నిరతవిధిగా నొనరించిన యభ్యాసముచేతను, అప్రయత్నపూర్వకమైన చిరపరిచయముచేతను ప్రతిమానవుఁడును ఆయా విద్యలందును, ఆయా ధర్మములందును, ఆయా వృత్తులందును, ఆయా వస్తుసామగ్రులయందును విశేషాంశములను గనిపెట్టుచునేయున్నాఁడు. అట్టి విశేషములు కవులు కానివారి హృదయములందు వారి జీవితకాలముదనుక మాత్ర ముండి యనంతరము వారితో నంతరించిపోవుచున్నవి. కానిచో వారి సన్నిహితబంధుమిత్రులకు మాత్రము లభించుచున్నవి. తద్విశేషాంశములే కవిహృదయగోచరంబు లయినపుడాశ్రయవిశేషంబున నవి భ్రమరకీటకన్యాయంబున కవిత్వరూపముం గాంచి, గ్రంథరాజములం బ్రవేశించి, శాశ్వతత్వము వహించి, బహుదేశములందు బహుకాలములందు బహుతరములవారికి మహోపకారదక్షంబు లగుచున్నవి. గ్రంథమూలంబున వీనిని గ్రహించిన యనంతరబుద్ధిశాలులు మఱల వీని పైవిశేషంబులఁ గనిపెట్టుచుందురు. కవులు వానిని మరల గ్రంథములందుఁ జేర్చుచుందురు. ఈ ప్రకారముగ దేశమందలి విద్యలు, ధర్మములు, వృత్తులు, వస్తుసామగ్రులు లోనగు నాగరికతాసూచకము లగు విశేషము లన్నియు నానాఁటికిఁ గ్రమక్రమంబుగఁ గవుల సాహాయ్యంబుననే యభివృద్ధి గాంచుచున్నవి. అయినను దేశమం దెన్నియోవిద్యలం దెందఱో బుద్ధిశాలులు వెలువడి మహోపకారము గావించుచుండఁగాఁ బైఁజెప్పఁబడిన నాగరికతాభివృద్ధికిఁ గవులే మూలకారణ లనుట సహేతుకముగ నుండునా యని కొందఱు సంశయింపవచ్చును. కాని యిట్టి సంశయ మనావశ్యకము. దేశమందుఁ గవులే లేనియెడ నప్పటప్పటికి బుద్ధిశాలులు వెలువడి యాయా విషయములం దొనరించు యత్నములకుఁ దత్పూర్వమహనీయుల యభిప్రాయములను మూలబంధము (పునాది) గఁ జేకొను భాగ్యము లభింపదు. ఆయా మహనీయు లొనరించిన యత్నము లన్యుల కుపబలముగాక చిల్లికుండలోని నీటివలె నెప్పటినప్పు డంతరించిపోవుచుండును. ఎప్పటికప్పుడు ఎవరికి వారు ఏవిషయమందుఁజూచినను మొట్టమొదటినుండి ప్రయత్నింపవలసినవారలే యగుదురు. "ఎంతగ మేపినను గొఱ్ఱెకు బెత్తెఁడే తోఁక" యనినట్లు లెందఱు ప్రయత్నించినను ఎప్పటికప్పుడే మొదలగుటచేత విషయజ్ఞానము మితముగనే యుండునుగాని యభివృద్ధి కానేరదు. కాఁబట్టి కవులే దేశమందలి వివిధవిషయాభివృద్ధికి మూలకారణ లని యొప్పుకొనక తీరదు.

చంపకమాల. కవులు.

భువిఁగలవారి కెల్లరకు ♦ బుద్ధియు విద్యయు జ్ఞానవృద్ధియున్
గవివలనన్ లభించుఁ గవి ♦ కంటె గుణుం డొరు డుండఁబోఁడు డా
కవికృతపుస్తకగ్రహణ ♦ కారణ మొక్కటికాదె యేరికిన్
వివిధములైన విద్యలఁ బ్ర ♦ వీణతఁ గూరుచు; నింతెకాక యా
వివిధకలాభివృద్ధికిఁ గ ♦ విత్వమె కారణ; మెట్టులన్న నెం
దెవరెవ రెట్టి విద్దియల ♦ నెంత పరిశ్రమముం బొనర్చినన్
దవిలి వినూత్నమార్గములఁ ♦ దామె స్వతంత్రముగా గ్రహించినన్
గవి యొకఁ డుండి వారియెడఁ ♦ గల్గు విశేషము లప్పుడప్పుడే
ప్రవిమలరీతిఁ గబ్బముల ♦ వ్రాసి స్థిరంబుగ నిల్పకున్నచో
నవి యడుగంటి లాఁతులకు ♦ నబ్బక వారలతోనె పోవుఁ; బై
నెవరెవ రట్టి విద్యలకు ♦ నేగిన నెప్పటికప్డె క్రొత్తయై
తవులదు వృద్ధి సుంతయుఁ బ ♦ దంపడి యెంతప్రయాసఁగొన్న మ
క్కువపడి యెంత మేపినను ♦ గొడ్డుకు బెత్తెఁడె తోఁక రీతిగన్;
జవులు జనింపఁ దేనియలఁ ♦ జల్లినరీతి మృదూక్తిసంపదన్
జెవులకు విందొనర్చుచు వి ♦ చించెడి సత్కవివాక్కు లేనిచో
భువిఁ బ్రజ లొందు లోప మది ♦ పూడదు మార్గశతాంతరంబులన్.

కవు లని చెప్పినమాత్రంబున గ్రంథములను వ్రాసి ప్రకటించిన వారందఱును గవు లని భ్రమఁజెందఁ జనదు. అట్టులయినచో దేశమం దెన్నియోవిధములైన కవులు కలరు. ఒకరు పద్యములుగా వ్రాసినదాని నింకొకరు వచనముగా వ్రాయుదురు. ఒకరు వచనముగా వ్రాసినదానిని వేఱొకరు పాటలుగ వ్రాయుదురు. ఇట్లే పద్యకావ్యమును వచనకావ్యముగను, వచనకావ్యమును నాటకముగను, నాటకమును శ్రవ్యప్రబంధముగను, ప్రబంధమును హరికథగను మార్చుచు వ్రాసి గ్రంథములను బ్రకటించువారలు కొందఱు కలరు. వీరి హృదయమునుండి వచ్చునది కేవలభాషమాత్రమే. గ్రంథవిషయము జోలికి, బోవుటకు వీరు సాహసింపరు. కావున వీరి కా విషయానుభవమేమైనఁ గలదా లేదా యను విచారణకూడ ననావశ్యకము. (ఒక చరిత్రనుండి కథనుమాత్రము చేకొని (స్వేచ్ఛగా) స్వతంత్రముగా గ్రంథములను వ్రాయువారీ తరగతిలోఁ జేరరు.) 2 సంస్కృతభాష నుండి యాంగ్లేయభాషలోనికి, ఆంగ్లేయభాషనుండి తెలుఁగుభాషలోనికి, తెలుఁగునుండి

ఉరుదులోనికి నిట్లొకభాషనుండి మఱియొకభాషలోనికి భాషాంతరీకరణమును మాత్రము చేసి గ్రంథములఁ బ్రచురించువారలు రెండవతరగతివారు. వీరును పైవారివలెఁ గేవల భాషాభిజ్ఞులే. ఇంకను మొదటితరగతివారు రాజు అనుటకు భూపాలుఁడనియైనను వ్రాయుదురు. వీర లామాత్రమైనను లేక బుద్ధిస్వాతంత్ర్యమును బూర్తిగ నంతరింపఁజేసి కొని యుండినదుండినట్లు వ్రాయవలసియున్నారు. 3 ఒకరు వ్రాసిన గ్రంథమును జేకొని వాని కర్థమును, దాత్పర్యమును, నందలి విశేషాంశములను వ్రాసి గ్రంథములను బ్రచురించువారు కొందఱు కలరు. వీరు మూడవతరగతివారు. వీరును పై రెండుతరగతుల వారివలనే కేవలభాషాభిజ్ఞులే యగుచున్నారు. కాని వారియందు కవివేషధారణమైనను గలదు. వీరియందుఁ గవిలక్షణ మంతమాత్రమును లేదు. వీరి గ్రంథప్రకటనము కేవల పండితకార్యము కాని కవికార్యము కానేకాదు. 4 పూర్వకవులచేత చాటుధారను రచియింపఁబడి ముద్రింపఁబడకయున్న పద్యములు, పాటలు లోనగువానిని, పుక్కిటి పురాణములుగఁగాని గురుశిష్యపరంపరగాఁగాని యరుదెంచుచున్న పూర్వగాథలను, వ్రతవిధానాదులను, శ్రుతివాక్యములను సేకరించి యొకటిగాఁ జేర్చి ప్రకటించు గ్రంథ కర్తలు నాల్గవతరగతివారు. వీరు కవులు కాకపోవుట యటుండఁగా భాషాజ్ఞానమైనను వీరి కందఱకును గలదనుట కవకాశము లేదు. వారివారియొద్దనుండి యాయావిషయము లను సంపాదించుటయే యీ గ్రంథకర్తలు పడిన శ్రమ. 5 పూర్వ మీ దేశమున ముద్రా యంత్రములు లేనికాలములో రచియింపఁబడిన వ్రాతగ్రంథ మేదైన లభించినపుడు దానిం జేకొని దానియందలి లేఖకప్రమాదజనితదోషంబులను సాధ్యమగునంతవఱకు సవ రించి గ్రంథములఁ బ్రకటించువార లయిదవతరగతివారు. స్థూలదృష్టికి గ్రంథకర్తలవలె నగపడినను వీరిని గ్రంథప్రకటనకర్త లనఁదగునుగాని గ్రంథకర్తలనుట యుక్తముకాదు. 6 తొలుతముద్రింపఁబడిన గ్రంథములనే ధనార్జనాద్యపేక్షా పూర్వకంబుగఁగాని విద్యా వ్యాపనోద్దేశ పూర్వకంబుగఁగాని మఱలమఱల ముద్రించి ప్రకటించుచుండెడి ముద్రా శాలాధిపతులు దేశాధిపతులు లోనగువారు ఆఱవతరగతివారు. వీరి శక్తియుక్తులను గూర్చి యిచట వ్రాయుట యనావశ్యకమగును. ఈ చెప్పఁబడిన యాఱుతరగతుల వారిని కవులని చెప్పుటకంటె 'కావ్యప్రకాశకులు' అని చెప్పినయెడ సమంజసముగ నుండును.

సీసమాలిక. కావ్యప్రకాశకులు.

విషయతత్వముజోలి ♦ విడిచి భాషాప్రౌఢి - రూపభేద మొనర్చు ♦ రూపదాత
తనదు స్వాతంత్ర్య మం ♦ తయును దొల్తనె వీడి - భాషను మార్చు ద్వి ♦ భాషివరుఁడు

అర్థతాత్పర్యంబు ♦ లనుకూలముగ వ్రాసి - ప్రకటించు కేవల ♦ పండితుండు
అందందుఁగల గాథ ♦ లన్నియుఁ - గొనివచ్చి రహి నచ్చుగూర్చు సం ♦ గ్రాహకుండు
మును ముద్రితముకాని ♦ పాత్తముఁ గ్రహియించి - చక్కఁగాఁ బ్రచురించు ♦ సరసబుద్ధి
అధిపతికనరాని ♦ యన్యులపొత్తంబు - లరసి ముద్రించు భా ♦ షాభిమాని
తే. గీ. యనెడి యీర్వురు కవికృతి ♦ నలరజేయు
కతనఁ గావ్యప్రకాశకా ♦ ఖ్యకుఁ దగుదురు;
స్థూలదృష్టిని బయిపయిం ♦ జూచునపుడు
కవులవలె నుండుదురు కాని ♦ కవులు కారు. (ద్విభాషి = Translator.)

అట్లయినచోఁ గవియని యెట్టివానిని జెప్పనగును? వీరిని గావ్యప్రకాశకులని మాత్రమే యేల చెప్పవలయును? అను సంశయములు రెండును నిచట నెట్టివారికిఁగాని కలుగక మానవు. అవి యిటఁ దెలుపఁబడును.———— సృష్టివైచిత్ర్యములను, ప్రాపంచిక విశేషములను మహాపురుషుల, జీవితములను, విద్యాధికుల ప్రజ్ఞను, బుద్ధిశాలుల ప్రతిభను, ధీరుల శౌర్యగాంభీర్యాదులను గన్నులారఁ జూచికాని, చెవులార వినికాని, యందలి గుణదోషములను స్వచ్ఛందముగ విమర్శించి, గుణమునకు వన్నెఁ గల్పించుచు, దోషమును నిరసించుచు, స్వప్రయోజకత్వప్రకటనాపేక్షావిముఁడుగాక, సంఘోపయోగార్థము స్వతంత్రముగ నెవఁడు పాటలుఁగఁగాని పద్యములుగఁగాని వచనముగఁగాని గ్రంథమును వ్రాయునో యాతఁడు కవి యనఁబడఁదగును. ఆ కవి వ్రాసినవిశేషములనే చేకొని యందలి పద్యగద్యగీతాదుల నొకటి నింకొకటిగా మార్చియు ఆగ్రంథమునకే భాషాంతరీకరణము నొనర్చియు, దానికే యర్థతాత్పర్యంబుల వ్రాసియు, మఱి యేమేమో యుపకృతుల నొనరించియు నాకావ్యమును బరిపరివిధంబులఁ బ్రకాశింపజేయుదురు కావునఁ బై యీయుతరగతులవారిని గావ్యప్రకాశకులని చెప్పఁబడినది—కవులు కారనిన మాత్రమున నిటఁ గావ్యప్రకాశకుల కొక న్యూనత కలిగె నని మాత్రము చదువరులు భ్రమయకుందురుగాక. ఏలయనఁ గవులును గావ్యప్రకాశకులును అన్యోన్యాశ్రయవిశేషంబున బ్రకాశింపవలసినవార లైయున్నారు. ఉభయులును దాదాపుగ సమానప్రతిపత్తిఁ గలవారు. కాని వీరిలో మొదటివారే కవు లని చెప్పక తీరదు. దేశోద్ధరణకార్యభారమును వహింపవలసిన వా రిట్టి కవులే.

క వి.

తే. గీ. కవి యనఁగ లోకమును దానె ♦ కన్నులారఁ
గనుచు గుణదోషవిభజన ♦ మును బొనర్చి

గుణము నలరింప దోషముఁ ♦ గూలఁ ద్రోయ
గబ్బము స్వతంత్రముగఁగూర్చు ♦ ఘనుఁడ చుండి.

ఇట్టి నిజమైనకవులు తఱచుగ లభింపరు. మిక్కిలి యరుదుగ నుందురు. వీరల కార్యమగు కవిత్వమునకు శాస్త్రకారులచేత నేర్పఱుపఁబడిన నియమము లెన్నియో కలవు. ఆ నియమములను గూర్చి ప్రకృతకాలపుఁ గావ్యప్రకాశకు లనేకులు విపరీతాభిప్రాయు లగుచున్నారు. ఆ నియమములు భాషావధూటిని నిర్బంధించి యామెయొక్క స్వేచ్ఛావిహారమునకు భంగము కలిగించుచుండె నని తలఁచుచున్నారు. మఱియు వానిని దొలఁగించుటకును బ్రయత్నించుచున్నారు. ఇది మిక్కిలి పొరపాటు. ఏలయన నియమరహితమైన కార్య మేదియును రాణింపదు. అది త్రాడు తెగిన గాలిపటమువలె సమున్నతిం గోలుపోయి యధోగతిం జెందును. నియమములు రెండు విధములు; ఐచ్ఛికములు ప్రధానములు. ఆ యా విద్యాధికులు స్వప్రయోజకత్వ ప్రకటనార్థముగను స్వసామర్థ్యానుకూలంబుగను దమతమకొఱకు వేఱుగ స్వేచ్ఛాధీనముగా నేర్పఱుచుకొను నియమములు ఐచ్ఛికనియమములు. ఇవి ప్రతివిద్యయందును గలవు. నెత్తిపై నిమ్మకాయను బెట్టుకొని యది దొరలిపోకయుండునట్లు అనఁగా లేశమాత్రమును శిరఃకంపము లేకయుండునట్లు సంగీతమును బాడుట, విల్లు నంబును దీసికొని దిగువనుండిన యద్దములోఁ జూచుచుఁ బైనుండిన నిర్దిష్టపదార్థమును అర్జునుఁడు మత్స్యయంత్రమును గొట్టినట్లు కొట్టుట, అచ్చతెనుఁగు నిరోష్ఠ్య బంధాది నియమములతోఁ గవనముం జెప్పుట మొదలగునవి యిందు కుదాహరణంబులు. ఇట్టి యత్నంబులు కేవల ప్రజ్ఞాప్రకటనమాత్ర ప్రయోజనకరంబులయి యనంతరకార్యవిరహితంబు లయినయెడ నవి సంఘోపయోగకరంబులు కాకపోవుటంజేసి విమర్శకులు వానిని నిరసించుచునే యుందురు. ఇందు మోఁకాళ్లతో ముప్పది యామడ దూరము నడిచెదననియు కడుపుతో నలుబది యామడల దూరము దేఁకెదననియు నిట్టి వెఱ్ఱియత్నములను ప్రజ్ఞాసూచకము లనుకొనుచుఁ జేయువారు హాస్యాస్పదు లగుచున్నారు. కావున నీ యైచ్ఛికనియమములం దెవరును శ్రమపడి తొలఁగింపవలసినవి యుండవు.

ఇకఁ బ్రధాననియమములను గూర్చి విచారింతము. ఈ నియమముల నెవరుగాని ప్రజల నందఱను దన యిష్టానుసారముగ నడిపించుటకు స్వతంత్రించి స్వేచ్ఛగా వ్రాయలేదు. అట్లు వ్రాయుట సమంజసము కాదు. ఇట్టి నియమనిర్ధారణమం దేశాస్త్రమునకుఁగాని ప్రథమసూత్రముల నొసఁగునది లోకమే (Nature). అనఁగా లోకము

నందు విద్యాధికులగువారును పెద్దలగువారును నొనరించిన కృతులందలి లక్ష్యముల నాధారముగఁ జేకొని యవి సూచించు ధర్మమునే గ్రంథకరణసామర్థ్యముఁ గలవారు లక్షణముగ వ్రాసి సంఘోపయోగార్థము ప్రకటింతురు. ఈ లక్షణములే యనంతరమందుఁ దత్తచ్ఛాస్త్రాభ్యాసకులకు నియమములుగఁ బరిణమించును. అందు గుణదోషవిమర్శనలేక విధిగామాత్రము వాని ననలంబింపఁజూచువారి కా నియమములు ప్రతిబంధకములై కన్పట్టును. తావన్మాత్రముచే వానిం దొలఁగింపఁ జూచుచుందురు. అట్లు యత్నించుట యుక్తియుక్తము కాదు. ఏలయన నియమము లాయా విద్యలందు గుణాధిక్యమును, సౌకర్యమును, రసపుష్టిని, ఆనందమును గల్పించుట కేర్పఱుపఁబడినవి కాని యొకరిని నిర్బంధించి శ్రమపెట్టుటకుఁ గాదు. కావున వానిం దొలఁగించుట తగవు కాదు.

నియమములు.

తే.గీ. బహుళతరపండితాచార ♦ పద్ధతులనె
యరసి కూర్పఁగ నియమము ♦ లయ్యె జగతిఁ;
గాని యెల్లర బాధింపఁ ♦ గతినుఁ డొకఁడు
సంతరించిన నిర్బంధ ♦ సమితి కాదు.

తే.గీ. ఇట్టి నియతులు విద్యార్థు ♦ లెల్లరకును
గార్యసిద్ధిప్రదంబులై ♦ క్రాలుఁ గాన
వాని నేరును దొలఁగింపఁ ♦ బూను టనఁగ
గొట్టి కాఁపరిపోత్తును ♦ గోర నట్లు.

ఇట్టిప్రయోజనముల నపేక్షించియే కవిత్వమునకును నియమము లేర్పఱుపఁబడినవి. నిర్మలాంతఃకరణమును సత్సాంగత్యమును యుక్తాయుక్తపరిజ్ఞానంబును గలవానికీ నియమసాహాయ్య మక్కఱలేకయే లోకానుభవజ్ఞానవశంబున సన్మార్గము లలవడును. తదితరు లీ నియమసాహాయ్యంబుననైన సన్మార్గముల నలవఱుచుకొనవలయుఁ గాని తోఁచినట్లు ప్రసంగింతుమనినచోఁ దప్పక రసాభాస మేర్పడును. మొత్తమున నీ రెండు తరగతులవారును గూడ నియమంబు లెఱిఁగియుంట యావశ్యకము.

‘పై యుక్తాయుక్త విచారజ్ఞానసంపన్నతచేఁ గాని, లక్షణజ్ఞానసంపన్నతచేఁ గాని జనసామాన్య మెఱుఁగవలసిన యంశములు ప్రకృతవిషయమగు భాషయం దేమికలవు? వాని నెఱుఁగకుండుటచేఁ గలుగు దోషములేవి?’ అను రెండు సంశయము లిట నెవ్వారికైనఁ గలుగఁదగియున్నవి. తత్సంశయనివృత్తికై యిటఁ గొన్ని (5) దృష్టాంతము లీయఁబడుచున్నవి.

| ఒప్పు. | తప్పు. |
| --- | --- |
| 1. నీ జబ్బు నిమ్మళించినదా? | నీ రోగము కుదిరినదా? |
| 2. నీ తండ్రి పే రేమి? | నీ యమ్మ మగని పే రేమి? |
| 3. మీలో నెవరిసంపాదన వారిదేనా? | మీలో నెవరిది వారే తిందురా? |
| 4. మాకు నీ కృప కన్న వే ఱేమి కలదు? | మాకు నీ కృప కన్న వే ఱేముండఁ గలదు? |
| 5. ఈతఁడు పుష్పబాణుఁడగు మదనునివలె నున్నాఁడు. | ఈతఁడు మండిపోయిన మన్మథునివలె నున్నాఁడు. |

ఈ వాక్యముల జంటలు ఏకార్థబోధకములే యైనను ప్రతిజంటయందలి రెండవ వాక్యమును దోషాస్పదమై యుండినట్లు ఎల్లరకును బ్రత్యక్షముగఁ గన్పట్టుచునే యున్నది. ఇట్టిదోషములకే శ్రుతికటువు, అశ్లీలము, పరుషము మొదలైనపేర్లను బెట్టి నిషేధించుచు శాస్త్రకారులు నియమముల వ్రాసియుండిరి. ఇట్లే మఱికొంతశ్రద్ధతోఁ జూచినయెడ నీచోపమ, అధికోపమ, భిన్నలింగము, అక్రమము, అపుష్టార్థము లోనగు దోషములును బ్రత్యక్షములై కన్పట్టును. వాని నెఱుఁగకయున్నచో రసాభాస మేర్పడును.

భాష నభివృద్ధిచేయుట యనఁగా దేశకాలపాత్రముల ననుసరించి మహాజనాభిప్రాయానుకూలంబుగ వలయు మార్పులఁ జేయుట యగును. కాని స్వేచ్ఛగా నియమముల నతిక్రమించుచు, నంతటితో నిలువక పైవిధముగ దోషములఁ జేర్చి కబ్బముల వ్రాయుచుఁ, బెద్ద లెవరైన దోషములఁ జూపినపుడు 'భాష ముందు పెట్టెనా శాస్త్రము ముందుపుట్టెనా' యని వాదించుచు, మఱికొంత పాండిత్యము ముదిరినవెనుక 'భాషను అనుసరించి శాస్త్రముపుట్టెఁగావున నాగ్రంథముననుసరించి మీసూత్రముల సవరించుకొనుఁడు' అని ప్రత్యుత్తరమిచ్చుచు, నిట్టి పద్ధతుల నవలంబించుటచేత మేము భాషావధూటిని బంధవిముక్తం జేసి యభివృద్ధిపఱుచుచుంటి మని ఱొమ్ములఁ జఱచుకొనుచుఁ బ్రగల్భములాడుట యెంతయు హాస్యాస్పదంబుగ నుండును.

కావున నెల్లప్పుడు నొకరువ్రాసినదానిని మూలాధారముగఁ జేకొని దానివలనఁ దాను బేరొందుటకుఁ బెనఁగులాడక కలోకమునే చూచి తత్తత్కాలోచితములగు గ్రంథములను స్వతంత్రముగఁ బ్రచురింపఁగల కవులు కొల్లలుగ నీయాంధ్రదేశమందు లభించునట్లును, ఆంధ్రభాషావధూటి నియమరహిత యను నపఖ్యాతిం బడక దేశకాలపాత్రోచితములగు మార్పులఁ జెంది దినదినాభివృద్ధిఁ గాంచునట్లును బరమేశ్వరుం డనుగ్రహించుఁగాత.

నూతనకవులు.

సీ. సరసాంగి 'పిఱ్ఱలు' ♦ సైకతంబు లటంచు - గజ్జెలంటఁగఁ జీరఁ ♦ గట్టె నంచు
రామాయణమున 'క ♦ రణ్యారోదన' మంచు ♦ వెన్నుని 'సిగఁ బట్టి - తన్నె'నంచు
ఘనబలుఁడైయును ♦ 'కానిడబ్బీఁడం' చుఁ-గడు నోర్పున కితండు ♦ 'గాడ్దె'యంచు
'మండిపోయిన యల్ల ♦ మదనుఁడే యితఁడంచు-మాను 'నాచరణంబు ♦ లాన'యంచు
గీ. నిట్టి దుర్ఘోషముల నెల్లఁ ♦ జుట్టఁ బెట్టి
కబ్బములఁగూర్చి నూతన ♦ కవుల మంచు
భాష కిది వృద్ధిపథ మంచుఁ ♦ బలుకు చుందు
రహహ యేమందు నిట్టివి ♦ ద్యాధి కులను!

## 4. నాటకప్రదర్శకులు.

కవి రచియించు కావ్యములకు వన్నెలు పెట్టి ప్రకాశింపఁజేయు కావ్యప్రకాశకు లెన్నియో తరగతులవారు కలరు. వారిలోఁ గవిసంకల్ప నిర్వహణమందు మహోన్నత ప్రజ్ఞాధురంధరులగుచు రమ్య కావ్య ప్రకాశకు లనఁబడఁదగిన నాటకప్రదర్శకు లను మఱియొక తెగవారు తదితరప్రకాశకులకంటె ననేకమడుంగు లెక్కుడుగ సంఘోపకారమును జేయఁజాలియున్నారు. ఎట్లనఁగా.— కవి రచియించు కావ్యములు రెండు విధములు. శ్రావ్యములు (వినఁదగినవి), దృశ్యములు (చూడఁదగినవి). పురాణములు చరిత్రలు లోనగునవి శ్రావ్యములు. నాటకములు దృశ్యములు. కావ్యములలో నెల్ల నాటకములు రంజకములనుటను 'కావ్యేషు నాటకా రమ్యాః' అను నార్యోక్తి విశదీకరించుచున్నది. అట్టి మనోహరములగు నాటకముల రచియించుటయుఁ బఠియించుటయుఁ గూడఁ గష్టతరము లగుటను 'నాటకాంతంహి సాహిత్యం' అను నార్యవాక్యము తెలుపుచున్నది. లోకోపకారార్థము కవి తాను బోధింపఁదలంచిన ధర్మసూక్ష్మములను బండిత పామర జనానుభవయోగ్యములుగ నొనరింప నెంచి, వానిని సర్వజనమనోహరము లగు నాటకములం దిముడ్చును. ప్రదర్శకు లా నాటకములఁ జేకొని తమ యప్రత్యక్షవస్తు ప్రత్యక్షీకరణ సామర్థ్య మాహాత్మ్యంబునఁ దత్తత్కథాభాగంబులఁ గన్నులఁ గట్టిన ట్లగపఱుచుటచేఁ బ్రజాహృదయభూముల నన్యపదార్థవిరహితంబులుగ నొనర్చి, సకాలవర్షప్రాయమైన తమ సమయోచిత గానరసవశంబున వానిని మెత్తఁబఱిచి, తత్కథాంతర్గత ధర్మబీజంబుల నట వెదచల్లి నాటుకొనున ట్లొనర్తురు.

నాటకమున కిట్టి సర్వజనరంజకత్వసామర్థ్యం బెట్లు కలిగె నని యేరికైన నిట సంశయమ్ము వొడమవచ్చును. కావునే దద్విషయ మిచటఁ దెలుపఁబడును. నాటకమునకుఁ దదితరగ్రంథములకు లేని రంజకత్వము రెండు కారణములచేఁ గలుగుచున్నది. అందు మొదటిది కవిప్రజ్ఞ. నాటకేతరగ్రంథములం దనుకరణములు గాక తక్కినవాక్యము లన్నియుఁ గవివాక్యములే. ఎందటిప్రసంగములనైనను ఎంతచరిత్రనైనను గవి తనవాక్యములతోడనే వ్రాయును. తనపాండితికిఁ దగినభాషనే వానియం దుపయోగించును. నాటకములయందు మాత్ర మట్లు కాదు. ఆయా కథలయందు వచ్చు పాత్రములకెల్ల వారివారి వాక్యములను వారివారి మాటలుగనే వారివారి కుచితమగు భాషయందు వ్రాయవలసియున్నాఁడు. ఉచితభాషయం దనఁగా రాజు, మంత్రి, సేవకుఁడు, రాణి, చెలికత్తె దాసి, విదూషకుఁడు, పురోహితుఁడు, ఆటవికుఁడు, వృద్ధుఁడు, యౌవనుఁడు, బాలుఁడు లోనగువారి కెల్లరకు వారివారికిఁ దగిన వేఱువేఱు తరగతుల భాషయందు స్వభావసిద్ధముగ నుండునట్లు వ్రాయవలసియున్నాఁడు. ఎవరిమాటలనువారే పలికినట్లు వ్రాయఁబడుటచే దీనికి రంజకత్వ మెక్కుడుగఁ గలుగుచున్నది. ఇఁక రెండవకారణము నాటకప్రదర్శకుల ప్రజ్ఞ. తత్తత్పాత్రోచిత వేషధారణముచేతను, విషయానుకూల మార్దవకాఠిన్యసహిత కంఠధ్వనిచేతను, రసానుకూల ముఖవిలాసముచేతను, భావానుకూల కరచరణాద్యవయవ విశిష్టాభినయముచేతను దన ప్రసంగమునకును, చిత్రలేఖనవిద్యాసాహాయ్యంబున నగ రారామనదీతటాకారణ్యాదులఁ బ్రత్యక్షముగ నగపఱుచుటచేఁ దన రంగస్థలమునకును నైసర్గికత్వమును గల్పించి ప్రదర్శకుఁడు సభ్యుల రంజించుచున్నాఁడు. మఱియు వేదశాస్త్రపురాణకావ్యనాటకాదులతో నిండియున్న సాహిత్యవిద్య కంతకును వన్నెవెట్టఁగలిగి, కఠినశిలలనైనఁ గరఁగింపఁజాలి, నిరంతర నిరవధికమాధుర్యయుతమై, వక్తృశ్రోతల కితర విషయసంగరహితచిత్తైకాగ్రత నొసంగ సమర్థమై, యాబాలవృద్ధంబుగ సర్వజనహృదయానందకరమగు సంగీతవిద్యను నాటకప్రదర్శకుఁడు ప్రజారంజనకార్యమందుఁ దన కూఁతకోలగాఁ గొనుచున్నాఁడు. ఇంకఁ గొద వేమికలదు? ఇట్లు నాటకప్రదర్శనము సర్వథా సర్వజనరంజనసమర్థ మగుచున్నది.

నాటకములు.

గీ. కావ్యములలోన బహురంజ ♦ కములు కాఁగ
నాటకములకుఁ గల కార ♦ ణములు రెండు
ప్రస్ఫుటమగు పాత్రోచిత ♦ భాష యొకటి
రక్తి నించు ప్రదర్శక ♦ ప్రజ్ఞ యొకటి.

రంగస్థలమందు నిలిచి యిట్టి ప్రదర్శనసాహాయ్యంబున నాటకప్రదర్శకుఁడు సంఘమున కొనరింపఁదగు నుపకార మింత యని వివరింప నలవికాకయున్నది. అచట నాతని ప్రజ్ఞయు నప్రతిహతమైయున్నది. అతఁడు చిత్రవిచిత్రవేషధారణ కారణంబున భానుసమతేజుండగుచు రంగస్థలంబున నిల్చి మందహాసముతోడ నొక్క వాక్కిరణముం బ్రసరింపఁజేసినమాత్రన సభ్యముఖారవిందమ్ములెల్ల నొక్కుమ్మడి వికసించి నూతనవిలాసభరితము లగున ట్లొనరించును. దమయంతి కరణ్యమునఁ గలిగిన పతివియోగదుఃఖమును గాని, దారవిక్రయకాలంబున హరిశ్చంద్రునకుఁ గలిగిన పత్నీవియోగదుఃఖమును గాని కనఁబఱుచునపుడు సభ్యుల నెల్లర శోకసాగరంబున ముంచివేయును. ద్రౌపదీపరాభవకార్యోత్సాహుండగు దుశ్శాసను రూపుమాపు భీమభూమిక నభినయించునపుడు సభాసదులఁ గ్రోధావేశవివశులఁ జేయును. యముని బారినుండి మార్కండేయుని గాచుటకు శివుండును, హిరణ్యకశిపుని క్రూరదండననుండి ప్రహ్లాదుని రక్షించుటకు నృసింహరూపంబున శ్రీవిష్ణువును నవతరించి రను భాగముల నభినయించునపుడు సభ్యుల హృదయతటాకంబులందు భక్తిరసం బుద్భవించి, పొంగి, పొరలి, మేరలుమీఱున ట్లొనర్చుటయ కాక వారిలోఁ గొందఱను భక్తిపారవశ్యంబున సివాలాడునట్లు నొనర్చును. ఇంతయేల? తాను రంగస్థలంబున నిల్చి యభినయించుచుండు నంతసేపును సభాజనంబుల నెల్లరను దా నాడించునట్లెల్ల నాడెడి కీలుబొమ్మలరీతి నొనరించును. ఇట్లు సభ్యులెల్లరుఁ దనకు వశవర్తులై యున్న సమయంబున నా ప్రదర్శకుఁడు వారి హృదయసీమలం దే మహాకార్యబీజంబుల వెదచల్లఁ జనదు? వారి మనంబుల నే దేశోద్ధరణకార్యంబున కున్ముఖంబు లగున ట్లొనరింపఁ గూడదు? వారి చిత్తవృత్తుల నే నూతనోద్యమంబుల కభిముఖంబు లగున ట్లొనర్ప నలవికాకయుండును?

నాటకప్రదర్శకుఁడు.

ఉ. ఓ రసికాగ్రగణ్యమహి ♦ మోన్నతులార! ప్రవీణుఁడౌ మహో
దారుఁడు నాటకంబులప్ర ♦ దర్శకుఁ డెట్టిఁడొ చిత్తగించుఁడీ
సారెకు వేషధారణవ ♦ శంబున సొంపులుగుల్క రంగముం
జేరుచు, నృత్యగీతములఁ ♦ జెల్వము నింపుచు, హాస్య వీర శృం
గార భయానకాది రస ♦ గర్భ మృదూక్తివిశక్రియాళి వి
స్తారముచే మహాపరవ ♦ శత్వముఁ గూర్పఁగ, సభ్యులెల్లరుం
వ్వారె! వవారె! యంచు బహు ♦ భంగుల నాతనిరీతి నాడుచుం
గేరినఁ గేరుచుం బగల ♦ నించిన నించుచు నవ్వ నవ్వుచుం

దారును భృంగకీటక వి ♦ ధంబున మాఱినయట్టివేళ నా
ధీరుఁడు సంఘరంజకుఁడు ♦ దివ్యతరాద్భుతశక్తియుక్తి వి
స్తారుఁడు తత్ప్రదర్శకుఁడు ♦ ధర్మసుబోధకుఁడౌచు నెట్టి సం
సారమహాంధకారరవి ♦ సన్నిభబోధలఁ జేయరా దిఁకే
తారకమంత్రసిద్ధికిఁ బ ♦ ధంబులఁ జూపఁగరాదు? మీఱి యు
య్యారె! స్వసంఘకార్యపర ♦ మార్థము లెన్నిటిఁ దెల్పరాదు? వే
సారక యే మహాకృతి క ♦ జస్రము వారలఁ బూన్పరాదు? వి
స్తార మిఁకేల? యాతని క ♦ సాధ్యము కానఁగనౌనె? చూడుఁడీ.

ఇట్టి మహోన్నతకార్యాచరణ సాధనంబగు నాటకప్రదర్శనంబును గొందఱు వేలు వేలువిధంబులుగ దుర్వినియోగము చేయుచున్నారు. ఎట్లనఁగా:—కేవలధనాకర్షణాయత్తచిత్తులగుచు నే దుర్నీతిబోధకనాటకంబునైనను బ్రదర్శించి సామాన్యజనచిత్తరంజనము నొనర్చుటచేఁ గొందఱు రంగోపజీవులు తమ రంగస్థలంబును కల్లుదుకాణమునకు సాటి యగున ట్లొనరించుచున్నారు. "నీవు తారవేషము ధరించుము; నేను చంద్రవేషముం దాల్తును; నీవు ఆకులును వక్కలును దెమ్ము; నేను పంచదారలడ్డులను దెచ్చెదను; మన మిరువురమును రంగస్థలమందు వానిని పోఁకుగ భక్షించి తాంబూలమును వేసికొందము." అని యి ట్లాలోచనలు చేసికొనుచుఁ దత్తత్కార్యములు రంగస్థలగర్హితము లయినను వాని నొనరించి తమ ముచ్చటఁ దీర్చుకొనుటకుఁ గొందఱు వేషధారు లగుచున్నారు. వారిలోఁ గొందఱు తమ కా భూమికల నొసఁగనిచోఁ గలహించుచున్నారు. మఱికొందఱు చంకీదుస్తులులోనగు నలంకారముల ధరియించి తెల్లని దీపముల యెదుట నిలిచినపుడు తాము నిజంబగు రాజువలెనే రాణివలెనే యుందుమని యట్టి మిథ్యావినోదముకొఱకు వెఱ్ఱులగుచు వేషముల ధరించుచున్నారు. ఇంకఁగొందఱు గానాభినయములందుఁ దమకుఁ గల ప్రజ్ఞను రంగస్థలమందుఁ జూపి ప్రఖ్యాతిఁ గాంచు తలంపున వేషధారులగుచున్నారు. ఇట్టి చపలచిత్తులు వేషధారు లగుటచే వీర లన్యోన్యసహవాసకారణంబున నీతిబాహ్యవర్తనులగుచుఁ, దమ చెంతఁ జేరువారిని గూడఁ దమబోంట్లగాఁ జేసి చెఱచుచు దమవలని యపకీర్తిని నాటకసంఘములకే చుట్టఁబెట్టుచున్నారు.

ఇట్టి వీరల ప్రదర్శనంబులు కేవలధనార్జనసాధనంబులును, వినోదమాత్ర ప్రయోజకంబులును నగుటచే విద్యాధికులు వాని దర్శింపఁబోవుట మానుకొనుచున్నారు. కేవల వినోదంబు నపేక్షించువారలు మాత్రమే యచటికిఁ జేరుచున్నారు. దానంజేసి వీరల

నాటకసంఘము లిపుడు దివానక్షత్రములవలెఁ గ్రమక్రమంబుగఁ బ్రకాశహీనంబు లగుచున్నవి. వీరి స్థితిగతులను సంస్కరించి, వీరలను సన్మార్గములందు నడపించి, వీరి ప్రదర్శనములవలన సంఘమునకుఁ గలుగఁదగిన మహోపకారము లభించున ట్లొనర్చు బాధ్యత విద్యాధికులది. కావున నట్టి విద్యాధికు లీ విషయమున సంబంధమును గలిగించుకొని, తమ బుద్ధిబలము నించుక వినియోగించి యీ నాటకప్రదర్శకాభిప్రాయముల సంస్కరించి, వారి ప్రయోజనమును బ్రజల కెఱింగించి, ప్రదర్శకులకు ను బ్రజలకు ను మేలొనగూర్తురు గాక.

### చపలప్రదర్శకులు.

సీ. నీవు తారవు కమ్ము ♦ నేను చంద్రుఁడ నౌదుఁ-గూడి యాడెదమంచుఁ ♦ గోరి కోరి
తళుకు చంకీ డ్రెస్సు ♦ దాలిచి గ్యాస్ లైట్లు-ముందు నిల్చెదమంచు ♦ మురిసి మురిసి
చీర రైక నగలు ♦ సింగారముగఁ దాల్చి-యొప్పఁ జూపెద మంచు ♦ నూరి యూరి
ఆటపాటలయందు ♦ నాధిక్యమును జూపి-పేరుఁ గాంచెదమంచుఁ ♦ బెనఁగి పెనఁగి
గీ. వేషధారణకౌతుక ♦ వివశు లగుచు
నాటకము లాడ మేలు క ♦ నంగనౌనె?
పట్టి ధర్మముల్ కన్నులఁ ♦ గట్టి నట్లు
ప్రజకుఁ జూపుటయే ప్రద ♦ ర్శకుల నియతి.

---

## ౫. పత్రికాధిపతులు.

దేశోద్ధారకచతుష్కంబునందు రెండవవారు పత్రికాధిపతులు. వీరివలన దేశము సర్వదా మహోపకారము నందుచున్నది. దేశోద్ధారకు లగు నల్వురిలో వీరివలె నింత వేగముగ దేశమందు జ్ఞానాభివృద్ధిని మఱియెవ్వరు నొనరింపఁ జాలరు. సుషుప్తిస్వప్నావస్థలులేక సదా జాగ్రదవస్థలోనే యుందురేమో యని భ్రమయఁదగినట్లు వీర లెల్లప్పుడు ను జాగరూకులైయుండి స్వగ్రామాన్యగ్రామసమాచారముల నెప్పటివప్పుడొక్క త్రుటియైన జాగుసేయక తెలిసికొనుచు, దూరదేశ వృత్తాంతములను గూడ గడియలలోను నిముసములలోను దెప్పించుకొనుచుఁ గవిదత్తములైన శాస్త్రగుప్తార్థంబుల సంగ్రహించుచుఁ దమ పత్రికాముఖంబున వాని నచిరకాలములోఁ బ్రజలకుఁ దెలుపుచున్నారు. ప్రభుత్వపువారియందుఁ గాని, ప్రజలయందుఁ గాని, ప్రమాదవశముగఁ గాని, బుద్ధిపూర్వకముగఁ గాని యెప్పు డేదోషము సంభవించు నప్పు డద్దానిం బట్టి నిరాతంకంబుగ ఖండించుచు, నిరసించుచు, దానివలనఁ దమకు గలుగు కష్టనిష్ఠురముల

నెల్ల సహించి యెట్టకేని నద్దోషంబుల దొలఁగింప సర్వప్రయత్నముల నొనరింతురు. ఏ మహాపురుషుఁడుగాని యొక్క- దేశోపకారకార్యము నొనర్చినపుడు పత్రికాముఖంబున నాతని సుగుణసంపదను వేనోళ్ల శ్లాఘించుచు, నాతని రూపపటమును బ్రచురించుచు నట్టి సత్కా-ర్యాచరణోత్సాహమును మఱి నూర్వురియం దుద్భవింపఁజేయఁ బ్రయత్నింతురు. ఏ మాయికుఁడుగాని బయలువెడలి ప్రజలఁ గొందఱ మోసగించుచుండుటను గనిపట్టినపు డా మోసగాని రూపరేఖాదులను, నాతఁడు మోసగించు పద్ధతులను బట్ట బయలుగ వెల్లడించి యా మోసమునఁ బడకుండునట్లు తోడనే ప్రజల మేలుకొలుపుదురు. విద్యాభ్యాసనమందుఁ గాని, కృష్యాది వృత్తులందుఁ గాని, వ్యాపారమందుఁ గాని, మఱియే యితరవిషయమందుఁ గాని యే యితర దేశస్థులైన నే నూతన పద్ధతులనైన నవలంబించి మేలొందుచున్నట్లు తెలియవచ్చినయెడఁ దత్క్షణమందే వానినెల్లఁ దమదేశస్థులకుఁ దెలిపి యాయా పద్ధతులవలని ప్రయోజనమును వారికి లభింపఁజేయుదురు. ఇంతయేల? ప్రజాక్షేమమును గోరుచు వీరు జోక్యముఁ గలిగించుకొనని విషయము దేశమందు లేదు. వీరి పత్రికలను జదివినయెడఁ బ్రయోజనమును బొందని మనుజుఁడును లేఁడు.

పత్రికలఁ జదువుటవలనఁ బ్రయోజనము లెన్నికలవో వానిం జదువకుండుటవలన నష్టములును నన్నికలవు. వార్తాపత్రికలఁ జదువకుండినచో నే యే దేశస్థు లేయేకార్యములకై కృషి చేయుచుండిరో తెలియదు. తన దేశమందలి యేయే భాగములందలి ప్రజ లేయే కష్టసుఖము లనుభవించుచుండిరో తెలియదు. తన యూరి వెలుపల నేమి జరుగుచున్నదో తెలియదు. తన యూరియందైనను బ్రక్క-వీధిలో నే యపూర్వకార్యము జరుగుచున్నదో యది కూడఁ గొన్నిసమయములందుఁ దెలియదు. తాను నిత్యవిధిగాఁ జేయుచున్న విషయము తప్ప మఱియొక విషయము తెలియనే తెలియదు. కడకు స్వోదర పోషణకార్యము వినా లోకమునం దేవియుఁ దెలియక కూపస్థమండూకమువలె నుండవలసి వచ్చును. పత్రికాధిపతులకో అట్లు కాదు. ఏ దేశమందు, ఏ భాగమందు, ఏ గ్రామమందు, ఎప్పుడు, ఏ యపూర్వకార్యము జరుగునో యది వారి కతిత్వరితగతిం దెలియుటకు వలయు సౌకర్యముల నన్నింటిని వా రేర్పఱుచుకొందురు. ఆయాప్రదేశములందెల్లను దమ పత్రికల కుపవిలేఖకుల నియమించుకొందురు. ఆ యుపవిలేఖకులలోఁ గొందఱు వేతనాపేక్షచేతను, గొందఱు దేశాభిమానముచేతను బనిచేయువారుగ నుందురు. వార లచ్చటచ్చటఁ జరుగు సమాచారముల నెప్పటికప్పుడే పత్రికాధిపతులకుఁ దెలుపుచుందురు. వారి కాయా వృత్తాంతముల నందిచ్చు సహాయులును మఱికొంద ఱుందురు. ఈప్రకారముగ వీరి వృత్తాంత సంగ్రహణ వ్యాపారము దేశమందంతట నల్లుకొని మహా

వృక్షమువలె నేర్పడి ఫలకారి యగుచుండును. ఇట్టి మహావృక్షఫలము ననుభవింపఁజాలని వాని దుర్దశ నేమని చెప్పవచ్చును! ప్రభువువలెఁ దన యింటిలోఁ గూర్చుండి ప్రపంచమం దన్నిభాగములలోను దినదినమును జరుగుచున్న వ్యాపారాతిశయముల నెల్ల నెప్పటి వప్పుడు తెలిసికొని తన వ్యాపారమును సమర్థముగ నడపించుకొను నవకాశములఁ దెచ్చి యఱచేతఁబెట్టెడి యీ పత్రికలఁ బఠించు నభ్యాసము నుపేక్షించెడి యీ దురదృష్ట వంతుని నష్టము నింతయని యెవరు వర్ణింపఁగలరు? ఇట్టి మహానష్టమును దొలగించుటకుఁ గాని సవరించుటకుఁగాని యే యితరసాహాయ్యము సమర్థమై యుండఁగలదు? ఏదియు లేదు. నష్టము నష్టమే. పత్రికాపఠనము నుపేక్షించువా రనుభవింపఁలసినదే.

ప త్రి కా ధి ప తు లు.

చ. అనయము పత్రికాధిపతు ♦ లద్భుతజాగ్రదవస్థఁ దాల్చుచున్
బనిగొని పట్టణంబులను ♦ బల్లెల గ్రామములందు నెల్లెడన్
జను లొనరించు వృత్తముల ♦ సంగతి నెప్పటిదప్డె సూటిగన్
వినుకలిమీఁదఁ గొంతయు వి ♦ వేచనమీఁద నొకింత మిత్రయో
జనపయిఁ గొంతయున్ నియత ♦ చారముఖంబునఁ గొంత చేర్చి, యే
దునఁ గడు శ్రద్ధతోడ గుణ ♦ దోషవిమర్శనముం బొనర్చి, మే
లనఁదగుదాని సంఘవిహి ♦ తార్థము కైకొని సేకరించుచున్,
మును గవి వ్రాసియుంచిన య ♦ మూల్యపుఁ గబ్బములందు గుప్తమై
తనరెడి ధర్మసూక్ష్మములఁ ♦ దద్దయు సంగ్రహణం బొనర్చుచున్,
జనహితకాంక్షి వాని నని ♦ శంబును బత్రికలందుఁ దేటగన్
వినుతు లొనర్చి, పీనులకు ♦ విందగురీతిని దెల్పి, యింపుగన్
మనముల కెక్కఁజేసి, బుధ ♦ మాన్యుల నెల్లరఁ జేయుచుందు; రిం
కను వివిధాన్యదేశకవి ♦ గాయక శిల్ప విశిష్ట మర్మముల్
గొనకొని వెల్లడింత్రు; మఱి ♦ కోట్లకొలంది నవీన మార్గముల్
వినుతురు; దేశదేశముల ♦ వింతల నెంతయు వ్రాసి తెచ్చి మీ
కనువుగఁ జేతికిత్తురు; మ ♦ హాప్రభుచంద్రగృహాంతరంబునన్
దనరు విశేషమైనను య ♦ థావిధి నారసి వ్రాసిపుత్తు; రీ
ఘను లొనరించు సంఘహిత ♦ కార్యము లిన్నియటంచుఁ దెల్ప నె
వ్వని కగుఁ; బత్రికాపఠన ♦ భాగ్య మెఱుంగనివాని కిట్టి మే
లొనరక యుంటగాక తన ♦ యుండిన గ్రామమునందె ప్రక్కవీ



ధిని గల మంచిచెడ్డలు ను ♦ దీర నెఱుఁగకయుంట కల్గు; నిం
కను బరదేశవృత్తములు ♦ గాథలు స్వప్నపువార్త లౌను; బైఁ
గనుఁగొన నేఁటియావలను ♦ గ్రామమె లేదని తోఁచుఁ; గాన ధీ
జనులును బండితోత్తములు ♦ శాస్త్రులు రైతులు శిల్పులున్ వణి
గ్జనములు కూలినాలిగొని ♦ కాలము పుచ్చెడివారు నెల్లరున్
బనిగొని పత్రికాపఠనే ♦ భాగ్యఫలంబును గాంత్రు గావుతన్.

చదువరుల కిట నొక్క సంశయము కలుగఁదగియున్నది. ‘సలహాలిచ్చుట సులభమే కాని సమర్థించుట కష్టముగ నుండును. నిఱుపేదలుగ నుండిన హిందువుల కందఱకును జందాల నిచ్చి వార్తాపత్రికలఁ దెప్పించుకొని చదువునంతటి సమర్థతయు నవకాశమును గలుగునా?’ అను సంశయ మేరికైనఁ బొడమవచ్చును. కాని యది యనావశ్యకము. ఆంధ్రదేశంబున వార్తాపత్రికలు హూణభాషయందును ఆంధ్రభాషయందును బ్రచురింపఁబడుచున్నవి. హూణభాషాపత్రికల నాంగ్లేయభాషావిదులు మాత్రము చదువుకొందురు. వారి సంఖ్య మిక్కిలి తక్కువ. ఆంధ్రభాషావిదుల సంఖ్య మిక్కిలి యెక్కువ. వీ రందఱును నాంధ్రభాషాపత్రికలనే చదువవలసియున్నారు. ఇవి మాసపత్రికలు, పక్షపత్రికలు, వారపత్రికలు, అర్ధవారపత్రికలు నను నాలుగుతరగతులుగ మాత్రము ప్రకటింపఁబడుచున్నవి. దినపత్రికలుమాత్రి మింతవఱకు వెలువడ లేదు. ప్రతిహిందువునకును పత్రికాపఠనప్రాముఖ్య మెఱుకపడినఁ గాని యట్టి దినపత్రికలు వెలువడనేరవు. ఒకటిరెం డర్ధవారపత్రికలు దినపత్రికలుగా మాఱుటకుఁ బ్రయత్నములు సలుపఁబడినవి. కాని హైలోపముచేతనే వారువారు సాహసింపరైరి. తక్కిన నాల్గుతరగతుల పత్రికలలో నొక్కొక్కదానికిఁ జందాదారుఁడు సంవత్సరమున కీయవలసిన చందామొత్తము ఎనిమి దణాలు మొదలుకొని నాలుగు రూపాయలవఱకు నుండును. ఇట్టి పత్రికలను దెప్పించి చదువుటకొఱకు దాదాపుగఁ బ్రతిపట్టణమందును గ్రామమునందును గూడఁ బ్రకృతకాలమున విద్యాధికులు చేరి పఠనమందిరముల నేర్పఱిచి యచటికి వేఱువేఱు పత్రికలఁ దెప్పించి యుంచుచున్నారు. ఈ యేర్పాటుచేత నొక్కొక్కరు ప్రత్యేకముగఁ బత్రికలఁ దెప్పించుకొనవలసిన యావశ్యకము తొలఁగిపోవుచున్నది. ఎవరుగాని యా మందిరమునకు మిక్కిలి కొంచెము చందా నిచ్చినయెడ నచటి పత్రికల నన్నిటిని జదువుకొనవచ్చును. అట్టి మందిరములులేని మిక్కిలి చిన్నగ్రామములవారును బదిమంది యొకటిగఁ జేరి, యొక్కొకరు సంవత్సరమునకు రెండు అణాలుగాని నాలుగు అణాలుగాని చందానిచ్చి, యా మొత్తముసొమ్ముతోడ నొక్క వార్తాపత్రికను దెప్పించు

కొనిన యెడ దాని నొకరివెనుక నొకరుగ వారందఱును జదువుకొనవచ్చును. అట్లొకరివెనుక నొకరు వేఱువేఱుగఁ జదువుటకంటెఁ బదిమందియు నొకచోటనే చేరి, యొకనిచే దానిం జదివించి, వినినయెడ దానిచే మిక్కిలి యెక్కుడు ప్రయోజనము కలుగును. అందలి విషయముల నెప్పటివానినప్పుడే చర్చించుచు, గుణదోషముల విమర్శించుచు, గుప్తార్థముల నొకరికొకరు బోధించుకొనుచు, మహానందముగ జ్ఞానాభివృద్ధి నందఁదగును. చదువ నేఱుంగనివారుకూడ దాని విని మేలొందఁగల్గుదురు. అట్లు పత్రికల బఠించుట కుద్దేశింపఁబడిన దగుటచేత నా మందిరమే పఠనమందిర మగును. కావున నెంత చిన్నపల్లెయందలివారైనను, ఎంత చదువురానివారైనను, పదిమంది యొకటిగఁ జేరి, యిట్టి పఠనమందిరము నొకదాని నేర్పఱుచుకొని, వార్తాపత్రిక నొక్కటినైనఁ దెప్పించుకొని, యచటఁ జదివించి, విని, మేలొందఁదగును. ఈ యేర్పాటుచే ధనలోపదోషము వారి నింక బాధింపదు.

పఠన మందిరములు.

ఆ. వె. పలువు రొక్క చోటఁ ♦ బఠనమందిర మని
చేరి, దేశ దేశ ♦ చిత్రములను
జదివి, చర్చ చేసి, ♦ సారంబుగొనునట్టి
సభ యనంగ స్వర్గ ♦ సమము కాదె?

దేశోద్ధారకచతుష్కంబులో నీ పత్రికాధిపతు లొక్కరుమాత్రమే మాఱు త్రోవలం బడక యిక్కాలమున దినదినమును దేశాభివృద్ధికై పాటుపడువారుగ నున్నారు. ఈ పత్రికాధిపతు లందఱు నాధునికవిద్యాధికులైయున్నారు. మఱియందఱో ప్రతిభాశాలులు వీరలకు సహాయులుగనున్నారు. ఎట్లుండినను ప్రమాదో ధీమతా మపి •యను న్యాయానుసరణంబుగ వీరును నప్పుడప్పుడు మానవసహజంబులగు కొన్ని మనోదౌర్బల్యదోషంబులకు లోనగుచుందురు. వీనిలో మొదటిది స్వప్రయోజకత్వప్రకటనాపేక్ష. ఇది యొక భూతమువంటిది. ఈ భూతము ప్రతివిద్వాంసునియొద్దను బరమమిత్రమువలెఁ జేరి యాతని నేదో యొక సమయమున నేమఱించి యేవో కొన్ని వెకలిచేష్టలఁ జేయించును. సాధారణంబుగ దీని బారిం బడని విద్వాంసుఁడు లోకంబునఁ గనవచ్చుట యరుదు. పసిపాఁడు వెకలిచేష్టలు చేయకుండుట యరిది. చిత్రకారుఁ డొక సింహమును వ్రాసి, దాని వక్షస్థలమం దొక పద్మమును జిత్రించుచున్నాఁడు. దాని నడుమ నొక చిలుకను గూడ వ్రాయుచున్నాఁడు. దాని తోఁకచివరను పంచవర్ణముల కుచ్చును జిత్రించుచున్నాఁడు. పీర్లపండుగలో నొక్క మనుష్యునకు పులివేషమును వేయుచు ముగ్గురు మనుష్యులు కలిసినను మోయజాలనంత తోఁకను దానికిఁ గట్టుచున్నాఁడు.

గాయకుఁడు భావసహితమైన యొక్క పంక్తి వాక్యమునకు భావరహితమైన యిఱువది పఙ్క్తుల స్వరమును జోట్టఁబెట్టుచున్నాఁడు. కవి యొలుక యనుటకు గిరిసుత సూన వాహనము అనుచున్నాఁడు. ఇది యంతయుఁ బైఁజెప్పఁబడిన భూతముయొక్క మాహాత్మ్యమే. ఇట్లే యితరవిద్యాధికులును దఱచుగ నొనర్చుచున్నారు. వాని నన్నిటి నిటఁ దెలుపుట యప్రస్తుతప్రశంస యగును. ఇట్లే కొందఱు పత్రికాధిపతులును నర్థవిహీనమైన కేవలదంభవాక్యములతోఁ బత్రికల నింపుచుందురు. మఱికొంద ఱెవరి తోడనో కయ్యముపెట్టుకొని వారిం దూఱుట కీ పత్రిక నొక సాధనముగఁ జేసికొను చుందురు. ఇంకఁ గొందఱు కేవలధనార్జనాపరులగుచు నందుకు సామాన్యజనచిత్తరంజనం బావశ్యకంబని తదర్థమై కొన్ని విదూషకవాక్యములతోఁ బత్రికలఁ బూరింతురు. వేఱొక కొందఱు తమ నూతనపత్రిక త్వరలో వెల్లడికావలయు నని ముందు ప్రఖ్యాతి వహించిన పత్రికలను దూషించుచు వ్రాఁతలు వ్రాయుదురు. వారి పత్రికయందు వారు మరలఁ దమ పత్రికను దిట్టిన యెడఁ దత్కారణమునఁ దమ పత్రిక పేరు పదిమందిలో నికి వచ్చునుగదా యని తలంచుటే దీనికిఁ గారణము. ఈ లక్షణములు దేశోద్ధారకులగు పత్రికాధిపతులయం దుండఁదగినవి కావు. తనప్రజ్ఞను జూపుకొనుట, తనశత్రువుల దూషించుట, తాను స్వోదరపోషణార్థము నాలుగు డబ్బుల గడించుకొనుట లోనగు స్వలాభాపేక్షాపూర్వకములగు కార్యముల నిర్వహించుటకొఱ కీ పత్రికల సాధనములుగఁ జేసికొనుట తగవు కాదు.

కావునఁ బత్రికాధిపతు లిట్టి దోషములకు లోనుగాక, తమ పత్రికల సక్రమం బుగ నడపించి, దేశమందు ధర్మమును గాపాడుటకును అధర్మమును బాఱఁదోలుటకును మాత్రమే వాని నియోగించుచు దేశోద్ధారక నామంబును సార్థకపఱుచు కొందురుగాక.

పత్రికాధిపతుల దోషములు.

సీ. తనప్రజ్ఞఁ జూచి యం♦దఱు మెచ్చవలెనను-భ్రాంతిచే నేమేమొ♦వ్రాయు నొకఁడు
వారివీరలతోడ ♦ వైరంబు సాధింప - నెడఁగు వ్రాఁతల వ్రాయ ♦ దొడఁగు నొకఁడు
పదిరూక లెట్టులో ♦ పడయుటే ఘనమని - బడుగు హాస్యంబుల ♦ వ్రాయు నొకఁడు
తనపేరు వడిగ నం ♦ ద ఱెఱుంగవలె నంచుఁ-దిట్టువ్రాఁతల మొద ♦ లెట్టు నొకఁడు

గీ. ఇట్టి స్వార్థపరులు దేశ ♦ హితుల మంచుఁ
బత్రికల వ్రాయ ధర్మంబు ♦ బ్రతుకఁ గలదె ?
సత్యమునుగాయఁ, గల్లను ♦ సాగఁ ద్రోయ
స్వార్థమును వీడదగు పత్రి ♦ కాధిపతులు.

---

## 6. ఉపన్యాసకులు.

దేశోద్ధారకు లగు నల్వురిలో నుపన్యాసకులు మూఁడవవారు. వీరును దక్కిన ముగ్వురివలెనే స్వయముగఁ బ్రపంచమును దరిచి, గుణదోషముల విమర్శించి, గుణమును శ్లాఘించుచు, దోషమును నిరసించుచుఁ, బ్రజలకు బోధించు బుద్ధిస్వాతంత్ర్యమును గలవారు. అయినను గవులు రచియించిన గ్రంథములను, పత్రికాధిపతులు ప్రకటించు విమర్శనములను దమకు సాయంబుగఁ జేకొనుచుందురు. కాని కొన్ని కారణములచేత బోధయందు వీరు కవులకంటెను బత్రికాధిపతులకంటెను మిక్కిలి యెక్కువవా రని చెప్పఁదగియున్నది. ఆ కారణము లిచటఁ దెలుపఁబడును. ఇది మిక్కిలి కఠినమగు విషయము. చదువరు లీ భాగమును జాగరూకతతో సావధానచిత్తమునఁ జదువుదురుగాక.

కవులును బత్రికాధిపతులును దమ బోధను ధ్వనిరహితవర్ణరూప ప్రధానమైన వ్రాఁతమూలమునఁ దెలుపుచున్నారు. ఉపన్యాసకులు తమ బోధను ధ్వన్యాత్మకవర్ణ ప్రధానమైన భాషామూలమునఁ దెలుపుచున్నారు. వ్రాఁత భాషయొక్క రూపపటము (Photograph) మాత్రమే అయియున్నది. మనుజుని రూపపటము మనుజుని బహిరాకారమును మాత్రము చూపఁగల నిర్జీవరూపము. కాని సజీవరూపమువలెనే హృద్గత భావమును గూడఁ దెలుపు సమర్థతయుఁ దనకుఁ గలయట్టులు పైకిఁ గన్పట్టును. ఎట్టు లుండినను దానికి జీవము మాత్రము లేదు. ఇట్లే వ్రాఁతయు భాషయొక్క రూపపట మగుటచేత నది నిర్జీవమైయున్నది. భావప్రకటనమునకుఁ బ్రధానమైన ధ్వని భాషకుఁ బ్రాణము. అట్టి ప్రాణము వ్రాఁతకు లేదు. కావున దాని భావప్రకటనకార్య మసమర్థము. మఱొకటి కలదు. జీవికిఁ బంచప్రాణములవలెనే భావప్రకటనకార్యమందు భాష కైదంగములు కలవు. వానిలో ధ్వనియొక్క మార్దవకాఠిన్యములు ప్రథమాంగము. ధ్వనియొక్క ఆరోహణావరోహణభేదములు ద్వితీయాంగము. ధ్వన్యాత్మకవర్ణసముదాయము తృతీయాంగము. నేత్రాభినయసహితమైన ముఖవికారములు చతుర్థాంగము. కరచరణాద్యవయవ విశిష్టమైన యభినయము పంచమాంగము. వీనిలోఁ దృతీయాంగమైన ధ్వన్యాత్మకవర్ణసముదాయముయొక్క రూపపటమైన ధ్వనిరహిత వర్ణరూప సముదాయమే వ్రాఁత. ధ్వని సజీవలక్షణము. ధ్వనిరాహిత్యము నిర్జీవలక్షణము. కావున వ్రాఁత నిర్జీవరూపపటము. ధ్వని యనఁగా సహజధ్వని యగును. వాద్యధ్వనివంటి కల్పిత ధ్వని యని మాత్ర మిట నన్వయింపఁ జనదు. అట్టి సజీవలక్షణమైన సహజధ్వనితోఁ గూడినది భాష. భావప్రకటనకార్యమందు సహజధ్వని ననుసరించి యీ యంగపంచకమును నీడవలె భాష నొడఁబాయకయే యుండును.

భాషాంగములు.

క. ధ్వనిమార్దవకాఠిన్యము
లును, ధ్వని పైకెక్కి దిగుట ♦ లును, వర్ణములున్
గను మోము మార్పు, లభినయ ♦
మన నంగము లైదు భాష ♦ కగు భావముకై.

ఈ యంగపంచకమునకు భావప్రకటనకార్యముతోఁ గల సంబంధప్రాముఖ్యములు వాని క్రమంబు ననుసరించి యున్నవి. తొలుదొల్త కంఠమునుండి బయలువెడలు ధ్వని ప్రకటింపఁ బడవలసియున్న శృంగార హాస్య కరుణా రౌద్ర వీర భయానకాది భావముల కనుకూలమైన మార్దవకాఠిన్యాది భేదముల నొందియే బయలువెడలును. అది వెడలునపుడే, ఫిడిలుయొక్క ఒక్క తంతిపైని గ్రిందికి మీఁదికి నడిచెడి యొంటి వ్రేలి వలెనే యొక ప్రూస కంఠనాళమునందే యా ధ్వనిని బట్టుకొని తత్తద్భావానుకూలంబుగ నచటఁ దాను గ్రిందికి మీఁదికి నడుచుటచే దానియం దారోహణావరోహణాది భేదంబులఁ గల్పించుచున్నది. ఇట్లు మార్దవకాఠిన్యారోహణావరోహణభేదములను కంఠనాళమునందే పొందిన యీ ధ్వని వాక్కునఁ బ్రవేశింపఁగనే యచట నాలుక, దౌడలు, దంతములు, పెదవులులోనగునవి దానిం బట్టుకొని తా మొకటొకటిగను రెండురెండుగను జేరి దానితోడ నక్షరభేదంబులఁ గలిగించుచున్నవి. ఈ వర్ణములతోడనే పదములును, పదములతోడ భాషయు నేర్పడుచున్నవి. ఇవ్విధంబున నంగత్రయసాహాయ్యంబున నుద్భవించిన భాష వాక్కునుండి వెడలునపుడే తదుద్దిష్ట భావానుకూలముగ నేత్రదృష్టియు ముఖస్థితియుఁ గొన్ని మార్పులఁ జెందును. ఇదియే నేత్రముఖాభినయ మనఁబడుచున్నది. దీనిని మఱికొంత స్పష్టపఱుచుటకును బలపఱుచుటకును కరచరణాదుల యభినయము వచ్చుచున్నది. వీనిలో నీ తుదియంగము రానిచో మిగిలిన నాలుగంగముల తోడను, తుది రెండంగములును రానిచో మిగిలిన మూఁడంగములతోడను భావప్రకటన కార్యము నడచును. కాని మూఁడవయంగమగు భాష రానిచో నతఁడు మూఁగవాఁ డనఁబడును. మొదటి రెండంగములును చేరియే కంఠమునుండి వెలువడునుగాన నట్టి ప్రథమ ద్వితీయాంగములు రానిచో నాతనియందు సజీవలక్షణమే లేదు.

భాషాంగప్రాముఖ్యము.

గీ. అభినయంబును వీడిన ♦ నడ్డు లేదు
ముఖవికారమున్ వీడిన ♦ మొదలు చెడదు
భాష వీడిన మూఁగనాఁ ♦ బడును జగతి
స్వరము వీడిన జీవ ల ♦ క్షణమె లేదు.

ఇట్లు పంచాంగసహితమైన భాష చేయు భావప్రకటన కార్యమునకును, వీనిలోఁ దృతీయాంగమైన వర్ణసముదాయముయొక్క నిర్జీవరూపపిష్టమైన వ్రాఁత చేయు భావప్రకటనకార్యమునకును గల భేద మెంతయుండునో చెప్పకయే తెలియుచున్నది. ఉపన్యాసకుఁ డిట్టి భాషచేఁ దన బోధను బ్రజలకుఁ జేయుచున్నాఁడు. ఈతఁడు కవిరచిత గ్రంథపఠనకారణంబున విద్యావంతుఁడై వార్తాపత్రికాపఠనకారణంబున బహువిషయ పరిచితిం గాంచి జ్ఞానాభివృద్ధి నొందియున్నను దన జీవితకాలమందు దనకు లంభించిన వారికిఁ దన యభిప్రాయముల బోధించుటయందుమాత్ర మీతఁడు పై లేఖకద్వయంబున కంటె నధికుఁ డగుచున్నాఁడు. కవులును బత్రికాధిపతులును జేయు వ్రాఁతమూలమైన బోధకంటె నీతని వాఙ్మూలమైన బోధ శ్రోతల హృదయమందు మిక్కిలిగ నాటుకొనును. వారి వ్రాఁతలు తమయందు గౌరవము గలిగి, తెలిసికొను శక్తి కలిగి, తెలిసికొన నుత్సాహముఁ గలిగి, తెలికొనఁ బ్రయత్నించినవారి కెప్పుడు నొక్కవిధముననే బోధించును. ఉపన్యాసకుల బోధ లట్లు కాదు. తా నుపన్యసించుటకు సభలో నిల్చినతోడనే సభ్యు లెల్లర చిత్తముల నొక్కసారిగఁ దా నాకర్షించుకొనును. వారికి బోధింపఁదలఁచిన విషయమును, దానికివలయు వక్తృత్వసామర్థ్యమును నాతనియొద్ద నెప్పుడును సిద్ధముగనే యుండును గాన నాతఁ డా సభయందు నిలిచినప్పటినుండియు సభ్యుల చిత్తము లన్యవిషయములకుఁ బోవకయుండునట్లును, వారల దృక్కులు తననుండి తొలఁగకయుండు నట్లును జాగ్రత్తపుచ్చుకొనుటయే యాతని ప్రధానకార్యము. ఒకవేళ సభ్యులలో నెవ్వరైనఁ బరాఙ్ముఖులగుచు నన్యవిషయలోలు రైనట్లు కనవచ్చినయెడఁ దత్క్షణమే వారి చిత్తముల నాకర్షించుట కై దాఱు యుక్తుల నొకటివెనుక నొకటిగాఁ దనకుఁ గార్యసిద్ధి కలుగునంతవఱకును బ్రయోగించును. ఎట్లనఁగాఁ దాను జెప్పెడి విషయమునందు సందర్భమును సృష్టిచేసికొని యొక చప్పటఁ గొట్టును. అది కార్యసిద్ధి నొసఁగనిచోఁ దన ముందుండిన బల్లపైని గ్రుద్దును. కోపముతోఁగాని సంతోషముతోఁగాని యొక మాటను గుభాలున గట్టిగాఁ బలుకును. 'ఇంకొక గొప్పచిత్రము కలదు, చూచితిరా' యని యఱచును. ఎగురును. దుముకును. వీనిలో దేనిచేతఁగాని వారి దృష్టి యొక్కసారి తన వైపునకు మరలినయెడ నది మఱలఁ దొలఁగక యుండునట్లు లాకర్షించును. వారి చిత్తముల నుండి యన్యవిషయము తొలఁగిపోయినట్లు తనకుఁ దోఁచునంతదనుక వారివంకనే చూచి ప్రసంగించుచు వారిదృష్టి నాకర్షించును. మఱియు నిట్టివా రీ సభలో నింకెచ్చటనైనఁ గలరా యని నలుప్రక్కలకుఁ జూచి వెదకుచుండును. మధ్యమధ్య నొకసారి యీ చపల చిత్తులను బ్రత్యేకదృష్టితోఁ జూచుచు వారి చాపల్యము చెంతనుండువారికి వ్యాపింపక

పూర్వమే వారియందే యంతరించున ట్లొనరించుచుండును. ఉపన్యాసవిషయముయొక్క కాఠిన్యముచేఁగాని బాహుళ్యముచేఁగాని శ్రోతల చిత్తములు మందగతి నందుచున్నట్లు కన్పట్టినయెడఁ దోడనే యొక చక్కని పద్యమునో పాటనో శ్రావ్యముగఁ బాడుటచేఁగాని, ఒక్క చమత్కారకథనో వింతయైన సాటువనో చెప్పుటచేఁగాని వారలను రంజించి వారి చిత్తమాంద్యముఁ దొలఁగించును. ఎల్లెని సభ్యుల చిత్తముల నెల్లప్పుడు నేకముఖ మొనర్చి యవి తన యుపన్యాసవిషయమందు లగ్నము లగున ట్లొనరించును. తాను బోధించు వాక్యమును సభ్యులు తృప్తిగ గ్రహించినట్లు వారి ముఖవిలాసమువలనఁ గన్పట్టనియెడ నద్దాని మార్చిమార్చి చెప్పును. ఏ గ్రామమందుఁగాని, యే పల్లెయందుఁగాని, యే సంఘముగాని సత్యమును గ్రహింపక పెడత్రోవం బోవుచున్నట్లు వినవచ్చినయెడ దానియందలి యల్పత్వాధికత్వభేదముల గణింపక, పరార్థపరుఁడగుచుఁ దానే యచటికే కేగి, వారలకు బోధించి, వారిని సన్మార్గగాములుగాఁ జేయును.

ఉపన్యాసకుఁడు.

సీ. అంగపంచకయుతం ♦ బైన భాషనుగొంచు - సంఘబోధకుఁడౌచు ♦ సభను నిల్చు
యుక్తిపెయుక్తుల ♦ నొనరఁ బ్రయోగించి - యందఱఁ దను విను ♦ నట్లొ నర్చు
సమయోచితముగ భా ♦ షను గ్రమంబును మార్చి-యెల్లరఁ దనబోధ ♦ నెఱుఁగఁ జేయు
తానె శ్రోతలకై వె ♦ దకి చెంతలకు నేగి - యతులబోధల గృతా ♦ ర్థతను గూర్చు
గీ. జీవలక్షణ మగు ధ్వని ♦ చేత నిట్టు
లాత్మగతభావముల నెల్ల ♦ నను వెలింగి
బోధ లొనరించు, జ్ఞానసం ♦ పూర్తి నించు
నమలతరబోధకుం డుప ♦ న్యాసకుండు.

సభలో నిలువఁబడి యుపన్యసించినవా రందఱు నుపన్యాసకులే యని తలఁపఁ జనదు. వీరిలో యథార్థోపన్యాసకులు, దంభోపన్యాసకులు నను రెండు తెగలవారు కలరు. యథార్థోపన్యాసకుఁడు గ్రంథములనుండికాని, వార్తాపత్రికలనుండికాని, ప్రపంచ పాఠశాలలనుండికాని జనసామాన్యమునకుఁ దెలియని కొన్ని ధర్మసూక్ష్మములనో, ప్రధాన విషయములనో, నూతనసారాంశములనో గ్రహించి వానిని బ్రజలకు బోధించు తలంపున నుపన్యాసకుఁడై సభామధ్యంబున నిలుచును. ఉపన్యసించునంతసేపును దా నుద్దేశించిన విషయము శ్రోతల హృదయంబున కెక్కుచుండెనా లేదా యను చింతన యొక్కటే యాతని హృదయమునఁ దాండవించుచుండును. ఉపన్యాసాంతమున శ్రోతలయందు నూతనవికసన మేమైనఁ గలిగెనా లేదా యని పరీక్షతోఁ జూచును. అట్టి వికసనము

కలిగినచోఁ దన యుపన్యాసము సార్థకము, కలుగనిచో వ్యర్థము నని యెఱిఁగి వర్తించును. దంభోపన్యాసకు లెన్నియో తరగతులవారు కలరు. వారి నందఱ నిట వివరించుట దుర్లభము. యథార్థోపన్యాసకలక్షణవిరహితు లెల్లరును దంభోపన్యాసకులే యగుదురు. అయినను వారింగూర్చి కూడఁ నొక్కింత వివరింతును. బోధింపఁ దలఁచిన విషయమును ప్రవేశపెట్టుట, పెంచుట, ముగించుట యను మార్గములే తెలియక యేమాట దొరకిన నామాటనే పట్టుకొని దానితో నుపన్యసించుచు మొదటి విషయమును మొదటనే విడిచి చివర కేదో వాక్యముతోఁ బూర్తిచేయువారు కొందఱు కలరు. ఎట్లనఁగా నొకఁడు కాగితములనుగూర్చి యిట్లుపన్యసించును. ''సభాసదులారా! కాకితములు వ్రాతకు మిక్కిలి పనికివచ్చును. వ్రాతవ్రాయుటలోఁ గొంద ఱచ్చున గుద్దినట్లే వ్రాయుదురు. అచ్చునిపుడు యంత్రములతోఁ గూడ వేయుచున్నారు. యంత్రముల పనియం దాంగ్లేయులు మిక్కిలి నిపుణులు. ఆంగ్లేయు లిచటికి మొదట వర్తకులుగ వచ్చి యిపుడు ప్రభువు లయినారు. కాబట్టి కాగితములు చాలా యుపయోగకరమైనవి.'' ఈ యుపన్యాసముయొక్క ప్రయోజనమును జదువరులే గ్రహింతురుగాక. మఱియొకఁడు తాఁ జెప్పునది సభ్యులకుఁ దెలియుచుండినా లేదా యను విచారణలేక వాయువేగముతో నేమేమో వచియించి తన విధిని దాను బూర్తిచేసికొని కూర్చుండును. ఇంకొకఁడు స్వప్రయోజకత్వప్రకటనాపేక్షావివశుఁడగుచు దన యుపన్యాసము నంతను దీర్ఘసమాసములతోను, శ్లేషసహితాలంకారములతోడను నింపి సభ్యులకు బోధపడకుండున ట్లొనరించును. వేఱొకఁడు కేవలదంభాభిలాషియగుచు సారమేమియులేని వ్యర్థవాక్యములతోడ నూఁకదంచినయట్లు గంటలకొలఁది నూరక దడదడదడ యనుచు నేమేమో వచించుచు. ఈ పద్ధతుల కన్నిటికిని దృష్టాంతముల నీ గ్రంథాంతమందలి వ్యాయామవిషయిక చర్చ (Debate) యందుఁ జూడఁదగును. వీ రెల్లరు నేదోవిధంబునఁ బేరు సంపాదింపఁ బెనఁగులాడెడి దంభోపన్యాసకులు. తఱచుగ వీరి యుపన్యాసముల కలవాటు పడినవారు వీరి పద్ధతులనే యుపన్యాసకలక్షణముగ దలఁతురు. యథార్థోపన్యాసకులం దీ లక్షణములు లేకయుండుట దోషముగ భావింతురు. ఇది యీదంభోపన్యాసకులవలనఁ గలిగిన దోషము.

యథార్థోపన్యాసకులు మనదేశమం దచ్చటచ్చటఁ గలరు. వారు చేయఁదగిన మహాకార్యములను జేయుచునున్నారు. వారియందు ప్రజ్ఞాప్రకటనాపేక్ష లేశమాత్రము నుండదు. వా రెప్పుడును గార్యతత్పరులై యుందురు. అట్టి దేశోద్ధారకులగు యథార్థోపన్యాసకులను బ్రతిపట్టణమందును వెలయఁజేసి పరమేశ్వరుఁ డీ యాంధ్రదేశము నుద్ధరించుఁగాక.

దంభోపన్యాసకులు.

సీ. శబ్దజాలముల నా ♦ శ్చర్యంబుగాఁ జల్లి - తన ప్రజ్ఞఁ జూపెడి ♦ దంభుఁ డొకఁడు
ఊఁక దంచినరీతి ♦ నొక గంట పలికియు - సారమే విడెశి ని ♦ స్సారుఁ డొకఁడు
తెలియనీ గంగలో ♦ గలియనీ యని హాయు - వేగంబున వచించు ♦ వీరుఁ డొకఁడు
ఏమాట దొరకిన ♦ నామాటతోఁ బోయి - విషయమే విడనాడు ♦ వెఱ్ఱి యొకఁడు
గీ. సభలయం దుపన్యాసముల్ ♦ సలుపుచుంద్రు
కాని యిం దొక్కటియుఁ గార్య ♦ కారి కాదు ;
వినినతోడనె నూతన ♦ వికసనంబు
సభకుఁ గలిగించు నదెనుండు ♦ సార్థకంబు.

7. హరికథకులు.

దేశోద్ధారకు లగు నలువురిలోఁ దుదివారు హరికథకులు. వీర లుపన్యాసకుల తరగతి లోనివారే. కాని వీ రుపన్యాసకులవలెఁ దా ముద్దేశించిన ధర్మములను బోధరూపమునఁ దెలుపరు. ఈశ్వరచారిత్రములను గాని యీశ్వరభక్తచారిత్రములను గాని తెలుపుచు వారువా రొక్కొక్క ధర్మమును నిర్వహించుటయందుఁ బ్రతిబంధకములు తటస్థించు నపుడు వానినుండి ధర్మమును గాపాడుటకై పడిన శ్రమములను, అట్టి ధర్మనిర్వహణముచే వా రొనరించిన దేశోపకారములను, వారు పొందిన యైహికాముష్మికఫలములను చిన్నెలువన్నెలుగా వివరించి చెప్పుటచే నాయా ధర్మములందుఁ బ్రజలు గౌరవాసక్తులు కలిగి వాని నవలంబించునట్లు లొనర్తురు. తద్ధర్మవిరుద్ధవర్తనము లేవియైన సంఘమం దుండినట్లు తోఁచినపుడు వాని నాయా సందర్భములందు సూచించి ప్రజలకు వాని యెడ విముఖత్వముం గలిగించుచుందురు.

క. హరికథకుఁ డుపన్యాసకు
తరగతివాఁ డయ్యు సంఘ ♦ ధర్మంబుల మీ
రరయుఁ డని బోధ సేయఁడు;
హరిచరితాకర్ణనమున ♦ నలవడఁ జేయున్.

ఈ హరికథకు లుపన్యాసకుల తెగలోనివారే యయినను వారికన్న వీరిప్రజ్ఞ ద్విగుణమయియుండును. ఉపన్యాసకుఁడు భావప్రకటనకార్యము నంగపంచకసాహాయ్యంబునఁ జేయుచుండె నని తెలుపఁబడియుండెఁ గదా. ఆ యంగపంచకములోఁ దృతీయాంగమైన వర్ణసముదాయముచేత నేర్పడిన భాషయందు మాత్ర మాతనికి సంపాదిత

ప్రజ్ఞ కలదు. కొదవ నాలు గంగములయందు నాతఁడు సహజప్రజ్ఞతోడనే తృప్తినొందుచున్నాఁడు. అందుఁ బ్రథమాంగ మగు ధ్వనిమార్దవకాఠిన్యములును చతుర్థాంగమగు నేత్రముఖాభినయములును మనుష్యులకును మనుష్యేతరజంతువులకును గూడ సహజములయియున్నవి. మానవప్రజ్ఞచే వానియందుఁ జేయఁదగిన యభివృద్ధి మిక్కిలి కొంచెముగ నుండును. పంచమాంగ మగు కరచరణాద్యవయవ విశిష్టమైన యభినయము పురుషులయందు మితముగను స్త్రీలయం దెక్కుడుగను బొసఁగియుండుట సృష్టి యందుఁ గనవచ్చుచున్నది. దానికిఁ బ్రత్యేకముగ శాస్త్రము కలదు. శాస్త్రోపదిష్టవిధంబున నది వేశ్యకాంతల యాటపాటలందును, నాటకాది ప్రదర్శనములలో స్త్రీపాత్రముల యాటపాటలందును బ్రదర్శింపఁబడుచున్నది. పురుషులగు నుపన్యాసకులకుఁ గాని హరికథకులకుఁ గాని యీ శాస్త్రోపదిష్టాభినయపరిచితి యనావశ్యకము. ఇఁక ద్వితీయాంగమగు ధ్వన్యారోహణావరోహణ భేదములను భావానుకూలముగ నలయునట్లెల్లఁ బలుతెఱంగులుగఁ బ్రయోగించు శక్తి మనుజులకు మాత్రమే కలదు. కొన్ని మనుజేతరజంతువుల ధ్వనులం దిట్టి భేదము లొకటిరెండు కన్పట్టినను ఆ యొకటిరెండు మాత్రమే వానికి సహజములై యుండును. కాని వానిని స్వేచ్ఛగఁ బలుతెఱంగులఁ బ్రయోగించు శక్తి వానికి లేదు. అట్టి శక్తి మనుజులకుండినను అది ప్రతిమనుజునందును సమర్థముగ నుండదు. కావున మనుజుఁడు తన ప్రజ్ఞచే దాని నభివృద్ధి నొందింపవలసియున్నది. వానినిగూర్చి చెప్పుటకు విపులమగు శాస్త్రము కలదు. అది సంగీతశాస్త్రము. భావప్రకటనకార్యమందుఁ దృతీయాంగమగు భాషకంటె ద్వితీయాంగమగు సంగీతమున కెక్కుడు ప్రాముఖ్యము కలదు. మఱియు దీనికి భావముతోడ నెక్కుడు సన్నిహితసంబంధము ను గలదు. భాషాజ్ఞానము సాహిత్య మనఁబడుచున్నది. ఈ సంగీతసాహిత్యములు రెండు ను నాదాత్మకములే యైనను సంగీతమందలి నాదము ధ్వనిరూపాలంకార సహితమైనదియు సాహిత్యమందలి నాదము త దలంకారరహితమైనదియు నగుటచేత సాహిత్యమునకంటె సంగీత మెక్కుడు జనరంజకము ను నగుచున్నది. భావప్రకటనకార్యమున కీ రెండు విద్యలును దక్షిణవామభుజంబులవంటివి. సంగీతము కుడిచేయియు సాహిత్య మెడమచేయియు నగును. వీనిలో నొక్కవిద్యచే భావప్రకటన మొనరించి ప్రజల సంస్కరింపఁబోవుట యొక్కచేతి మల్లయుద్ధమునలెనే యుండును. హరికథకుఁ డీ రెండు విద్యలందు ను బరిశ్రమ చేసి ప్రజ్ఞను సంపాదించుచున్నాఁడు. కావున నీతఁడు కేవలోపన్యాసకునికంటె ద్విగుణితప్రజ్ఞావంతుఁ డగుచున్నాఁడు. దేశోద్ధరణకార్యదక్షుం డగుటయగాక ప్రజారంజకుఁడును నగుచున్నాఁడు. అమోఘంబుగఁ గార్యసిద్ధిని బడయుచున్నాఁడు. బోధకులలోనెల్ల నగ్రస్థానము నలంకరించుచున్నాఁడు.

హరికథకుని ప్రజ్ఞ.

ఆ. వె. భాష మాత్ర మెఱుఁగుఁ ♦ బ్రబలి కేవలవక్త;
గాన భాషల హరి ♦ కథకుఁ డెఱుఁగు;
భావ సిద్ధి యందు ♦ నుపన్యాసకునికంటె
హరికథకుఁడు ద్విగుణ ♦ మగుచు నుండు.

ఇటఁ జదువరుల కెన్నియో సంశయములు కలుగఁదగియున్నవి. సాహిత్యమున కంటె సంగీత మెక్కుడనుచుఁ జెప్పిన విషయము లన్నియు సంశయములుగానే యుండును. కావునఁ దత్సంశయముల నన్నిటిని, దృష్టాంతపూర్వములగు హేతువులఁ జూపి, యిట నివృత్తిచేయుదును

1. కేవలభాష భావప్రకటనమును జేయఁగలదా? చేయఁజాలదు. ఎట్లనఁగా 'నీ వెవరు?' అను వాక్యము నెన్నియర్థములు వచ్చున ట్లుచ్చరింపఁదగునో చూడుఁడు!

1. నీ పేరేమి? యూరేమి?
2. నీ వెవరో వినఁబడుటలేదు. సరిగాఁ జెప్పుమీ.
3. అతని సంగతి కాదు. నీవెవరో చెప్పుము.
4. సరే. అతని సంగతి తెలిసినది. ఇఁక నీవెవరు?
5. నన్నెఱుఁగవా! నీ వెవరని యడుగుచుంటివా!
6. చెప్పెదవా తన్నులుకావలెనా నీ వెవరు?
7. రాఁగూడనివాఁడవు వచ్చితివే; నీవెవరు!
8. అక్కఱకుమాలిన ప్రసంగము వద్దు. నీ వెవరు?
9. నీ విపుడు చెప్పినది మఱచితి. నీ వెవరు?
10. ఊఁ. నీ వెవరు (వెక్కిరింత). దొడ్డవిచారణకర్తవు.

'నీ వెవరు' అను పదములతో మఱియొక పదమును జేర్పకయే, ఆ శబ్దములం దే మార్పును జేయకయే పై పదివిధములగు భావములును వెలువడునట్లు వాని నుచ్చరింప వచ్చును. అట్లు లెల్లరును విశేషప్రయత్నమక్కఱలేకయే యన్నివిధములుగను హేరాళముగ నుచ్చరించుచునే యున్నారు.

వీనినుండి యిన్నిభావము లెట్లువెలువడినవి? ఈ భావముల కేనిఘంటు వాధారము? ఇన్నిటిలో నేభావమును జేకొనవలయు? ఇన్ని మార్పులు కలుగుటకుఁ గారణము లేకయుండునా? కారణములేనిదే కార్యము కలుగఁగలదా? అగ్ని లేకయే పొగ వచ్చునా? ఇచటఁ గార్యమైన భావభేదములు ప్రత్యక్షములే కదా. వీనికిఁ గారణ మేమి? ఆ కారణ

ములను నేనే మనవిచేయుదుఁ జిత్తగింపుఁడు. ఇచటఁ గార్యమువలెనే కారణములు ప్రత్యక్షముగనే యున్నవి. కన్నులు మూసి గంత కట్టినదేమియు లేదు. గారడీవానివలె మోసగించినదియు లేదు. ఈ వాక్యమం దుండినవి రెండుశబ్దములు 'నీవు + ఎవరు'. వీని శర్థాంతరములైనను లేవు. ఇవి యేకార్థబోధకపదములు. ఈ పదములు భావప్రకటనకార్యే తృతీయాంగ కల్పితములు. వీనితోఁ జేరి ద్వితీయాంగ కల్పితములైన ధ్వనిభేదములు కలవు. భావమందు మార్పులు కలుగుటకుఁ బదములందుఁ గాని, ధ్వనులందుఁ గాని మార్పులు కలిగితీరవలయును. అందుకు శబ్దములందు మార్పులు కలుగకపోవుట ప్రత్యక్షమైయున్నది. ధ్వనులయందో మార్పులు క లు గు ట ప్రత్యక్షముగ నుండినది. ధ్వనులు మాఱినపుడెల్లను భావము మాఱుచుండినది. ఇంకేమి? కారణము ప్రత్యక్ష మయ్యే యుండెఁ గదా. భాషయం దేమార్పు ను గలుగకయే భాషయొక్క పెత్తన మేమియు లేకయే ధ్వని నాశ్రయించి భావ మిన్నివిధములుగ మాఱుచుండినపుడు భాషకు స్వతంత్రమగు భావప్రకటన సామర్థ్యము కలదని చెప్పుట కవకాశము కలదా? లేదు. ధ్వనిభేదసాహాయ్యము నొందని కేవలభాష భావప్రకటనమును జేయఁజాలదు.

కే వ ల భా ష.

కం. ధ్వనిభేద సహాయంబును
గొనకుండిన భాష యటనె ♦ కూర్చుండును; దా
మనుకొని భావప్రకటన
మును జేయఁగలేక యెంతో ♦ మోసముఁ జెందుక్.

2. కేవలధ్వనిభేదములు భావప్రకటనమును జేయఁగలవా? కేవలభాషవలెనే యస మర్థముగఁ జేయఁగలవు. ఆ భావము విస్పష్టముగ నుండదు. దృష్టాంతము:—గోడ చాటున నిద్దఱు మనుష్యులు మీకుఁ దెలియని నూతనభాషలోఁ బ్రసంగించుకొనుచుం డఁగా వినుఁడు. వారు సంతోషముగ ముచ్చటలాడుకొనుచుండిరో, కోపముతో జగడ మాడుకొనుచుండిరో, యెవరినైన మోసగింపవలయు నని కుట్రచేయుచుండిరో మీకు సులభముగఁ దెలియును. అట్లు తెలిసికొనుటయందు మీకుఁ దోడ్పడిన వేవి? ధ్వనిభేద ములే. మూఁగవాఁడు తన భావమును కేవలధ్వనులచేతనే తెలుపుచున్నాఁడు. భాష నెఱుఁగని శిశుపశ్వాదులయొక్కయు సుఖదుఃఖ సంతోషాది భావములను ధ్వనులచేతనే మనము గ్రహించుచున్నాము. కావున కేవలధ్వనులు భావప్రకటనమును జేయఁగలవు. అది యస్పష్టంబుగ నుండును. భాష దానిని స్పష్టపఱుచును. కాఁబట్టి కేవలధ్వనులు తెల్పునది యస్పష్టభావమనియు, ధ్వనిభేదసాహాయ్యసహితభాష తెల్పునది స్పష్టభావ మనియు స్థిరపడుచున్నది. భావప్రకటనకార్యమం దీ ధ్వనిభాషలు రెండును సమాన ప్రాముఖ్యమునే కలిగియున్నవి.

కేవలధ్వనులు.

గీ. భాష నెడఁబాసి ధ్వనిభేద ♦ పఙ్క్తులైన
నెంతొ యసమర్థముగ భావ ♦ మెఱుక పఱుచుఁ
గాన ధ్వనిభేదములు భాష ♦ కలసిమెలసి
భావమును దెల్పు టదియెంతొ ♦ బాగు బాగు

3. భావముతోడ సన్నిహితసంబంధము దేనికిఁ గలదు? ధ్వనులకా? భాషకా? ధ్వనులకే కలదు. ఎట్లనఁగా హృదయమునుండి భావము బయలుదేరఁగనే దాని ప్రకటనముకొఱకు కంఠమునుండి ధ్వని వెడలునపుడే తదనుకూలమైన యారోహణావరోహణ భేదములను కంఠస్థానమందే పొంది ముందుగ భావప్రకటనమును జేసినది ధ్వనియే. ప్రతి మనుజునందును బాల్యమున ముందు భావప్రకటనము ధ్వనులచేతనే జరుగుచున్నది. సృష్ట్యాదియందును నొకప్పుడు కొంతకాలమువఱకు భావప్రకటనము కేవలధ్వనులచేతనే జరిగినదని కేవలహేతువాదజ్ఞులు చెప్పఁదగియున్నది. అనంతరము నాగరికత హెచ్చినకొలఁదిని భాష వచ్చి, హెచ్చి, యా భావమును స్పష్టపఱుపసాగినది. ఆ భాష వేఱువేఱు దేశములందు వేఱువేఱువిధములుగా నున్నది. ఎట్లుండినను ఏభాష వచ్చినను ఆ ధ్వని భేదముల యారోహణావరోహణక్రమము మాత్రము మాఱుట లేదు. ప్రపంచములో నెచటికిఁ బోయినను ఎన్నిభాషలఁ బ్రయోగించి చూచినను ఆ క్రమ మట్టులే యుండును. భావము మాఱినపు డా క్రమము మాఱును. దృష్టాంతములు.

| తెలుగు. | ఉరుదు. | అరవము. | ఇంగ్లిషు. |
|---|---|---|---|
| నీ వెవరు? | తూ కోన్ హై? | నీ యారు? | హు ఆర్ యు. |
| అలాగా. | వైసా హై. | అప్పడియా. | ఇజ్ ఇట్ సో. |
| మిక్కిలి మంచిది. | బొహత్ అచ్ఛా. | రొంబ నల్లదు. | వెరి గుడ్. |

ఇచటఁ జదువరులు గ్రహింపవలసిన విషయములు రెండు కలవు. భాష మాఱినను ధ్వనుల క్రమము మాఱుట లేదు. భావము మాఱుటతోడనే ధ్వనుల క్రమము మాఱుచున్నది. కావున భావముతోడ నెడతెగని సన్నిహితసంబంధము ధ్వనులకుఁ గలదనియు, అనంతరము భాష వచ్చి యా ధ్వనులతోనే చేరుననియు స్థిరపడుచున్నది.

మ. ధ్వనిభేదంబులు కంఠనాళమునఁ దొ ♦ ల్తన్ బుట్టి భావంబులన్
మను సృష్ట్యాదిని నేఁడునుం బ్రకటనం ♦ బుం జేయుచుండంగ వా
క్కున జన్మించెడి భాష లా ధ్వనులనే ♦ కొంచున్ నిల్చెడున్; గాన నా
ధ్వనిభేదంబులకుం దలంపులకు బం ♦ ధం బాద్యమై యొప్పెడున్.

4. సాహిత్యమునకంటె సంగీత మెక్కుడురంజకముగ నుండునా? తప్పక యుండును. ఏలయన నీ ధ్వనిభేదములను రెంటినో మూటినో మాత్రమే తీసికొని కేవలభాషాజ్ఞుఁడు తన భావప్రకటన కార్యమును జేసికొనుచున్నాఁడు. (ఈ విషయమును గానవిద్యానిపుణులు మాత్రమే యెఱుఁగఁగలరు. కావునఁ గేవలభాషాజ్ఞులు ఫిడేలు వీణ మొదలైన యంత్రములందుఁ దమ ప్రసంగమును వాయింపఁజేసి కనులతోఁ జూచినయెడ నప్పుడాతని వ్రే లెన్ని స్వరస్థానముల వఱకు నడచునో ప్రత్యక్షముగఁ గన్పట్టును.) పండ్రెండు ధ్వనిభేదములతో భావప్రకటనమును జేయు మార్గ మింకొకటి కలదు. ఆమార్గమును బోధించు శాస్త్రమే సంగీతశాస్త్రము. అందు నాదము పండ్రెండు భాగములుగా విభజింపఁబడినది. ఆ భేదములకు సప్తస్వరములు ప్రతినిధులుగా నేర్పఱుపఁబడినవి. ఆ స్వరముల సాహాయ్యంబున గానవిద్య యంతయు బోధింపఁబడినది. (ఈ విషయమును విపులముగ నెఱుఁగఁగోరువారు గానసారమందలి 5వ యుపన్యాసమును జూడనగును.) మూఁడు ధ్వనిభేదములచేఁ జేయఁబడినప్పటికంటెఁ బండ్రెండు ధ్వనిభేదములచేఁ జేయఁబడినప్పుడా భావప్రకటన మెక్కుడు సమర్థముగ నుండు ననుటకు దృష్టాంతములు వలయునా? అక్కఱలేదు. మూఁడు రూపాయల జీతగాని కుటుంబమునకంటె పండ్రెండురూపాయల జీతగాని కుటుంబ మెక్కుడు సౌకర్యములతోఁ గూడి సమర్థముగ నుండుట లేదా? అట్లే యిదియు నుండును. మఱియుఁ గేవలభాషయందలి ధ్వను లలంకారరహితంబులును గేవలకార్యసాధనమాత్ర ప్రయోజకంబులు నై యుండును. సంగీతధ్వనులన్నో అనేకాలంకార సహితంబులై యుండును. భావప్రకటనమందు సర్వజనులకును సహజముగ నుండిన ధ్వనిభేదముల క్రమము ననుసరించి యీ యలంకారములఁ బ్రయోగించుటచేత గానజ్ఞుఁడు తన భావప్రకటనమును సమర్థముగను సర్వజనరంజకముగను జేయుచున్నాఁడు. కావున సాహిత్యమునకంటె సంగీత మెక్కుడు రంజకమగుట స్థిరపడుచున్నది.

గీ. ఒకటి రెండు ధ్వనులతోడ ♦ నొనరు భాష;
గాన మిది ద్వాదశధ్వని ♦ కలిత మగుచు
ధ్వనికలాప సంభరితమై ♦ తనరు చుండుఁ;
గాన భాషకంటెను రంజ ♦ కంబ యగును.

5. కేవలభాషతోడ భావప్రకటనమును జేసికొని తృప్తిఁజెందుచుండఁగాఁ బంచ్రడెండు ధ్వనిభేదములతోఁగూడిన గానమునకై కేవలసాహిత్యపరులు పెనఁగులాడుట యావశ్యకమా? తప్పక యావశ్యకమే. ఏలయన:—గానము కంఠస్థానమున జనించు చున్నది. భాష వాక్స్థానమున జనించుచున్నది. వాక్స్థానమున జనించిన హల్లులకుఁ గంఠస్థానమున జనించిన యచ్చులు ప్రాణము లని వ్యాకరణశాస్త్రము చెప్పుచున్నది. అట్టులే భాషకు గానము ను ప్రాణ మని చెప్పఁదగియున్నది. అట్టి ప్రాణమును ద్యజించి కేవలభాషతోఁ దృప్తిచెందెద మనుట సరసముకాదు. మఱియు గానము ధ్వన్యాత్మకము. ధ్వని శ్రవణేంద్రియమునకు విషయము. ఇట్లే శ్రోత్ర త్వక్చక్షు జిహ్వా ఘ్రాణేంద్రియము లైదింటికిని శబ్ద స్పర్శ రూప రస గంధము లైదును క్రమంబుగ విషయములు. వీనిలో మానవప్రజ్ఞచేత నొక్కొక్క విషయమం దెన్నియో యభివృద్ధు లొనరించి యాయా యింద్రియములఁ దృప్తినొందించుచున్నారు. ఎట్లనఁగా పఱుపులు శాలీనులు విలువగల మృదువస్త్రములు లోనగువానిచేఁ ద్వగింద్రియమును, చిత్రపటములు నగలు లోనగు నలంకారములచేఁ జక్షురింద్రియమును, షడ్రసోపేత భోజనపదార్థాదులచే జిహ్వేంద్రియమును, అపూర్వపుష్పాది దివ్యతర పరిమళ పదార్థములచే ఘ్రాణేంద్రియమును దృప్తిపఱుచుచున్నారు. వీనికై వేలకొలఁది రూప్యములను వెచ్చించుచున్నారు. బహుళతరశ్రమలఁ బడుచున్నారు. వానియందు లేశమాత్రపు లోపమునైన సహించుట లేదు. ఇంద్రియచతుష్కముకొఱ కింత చేయుచుఁ, బ్రథమేంద్రియమగు శ్రోత్రము విషయములో మాత్రము వైరాగ్యమూని, మధురధ్వనిసంపాదన మనావశ్యకమనుచు,మానవప్రజ్ఞావిరహితంబులైన సహజధ్వనులతోడఁ దృప్తిచెందెద మనుట యొప్పిదమగునా? కానేరదు. మఱేమి చేయవలయు? మధురధ్వనిసంపాదనము చేయవలయు. ఆ మధురధ్వను లెట్లులభించును? గానవిద్యాభ్యాసమున లభించును. కావునఁ దక్కిన యింద్రియములవలెనే శ్రోత్రేంద్రియమునకును మానవప్రజ్ఞాకల్పితసుఖముల నొడఁగూర్చుటకై గానవిద్యాభ్యసన మొనర్చుట కేవలసాహిత్యపరులకును నావశ్యకమే.

### గానప్రాముఖ్యము.

చ. సలలిత కీర్తిశాలులు! ప్రశస్త మనీషులు! చిత్తగింపుఁడీ
కలదొక మాట; తెల్పెద; జగంబున గానము భాషయుఙ్ బళా
బలియని యాడుజోడుగ సభాస్థలులందుఁ జరించి సొంపులఙ్
జిలుకుచునుండ, నాధునిక శిష్టులు కొంద ఱదేమిపాపమో
నలదిది వల్లు; నంతయును వల్ల'ని గానమునుం ద్యజించి కే

వలమగు భాషనే కొలిచి ♦ పల్కరుఁ దృప్తిని గాంచుచుండు; రీ
వలనిది యుక్తమో వెదఁగు ♦ పద్ధతియో తమరే యోచింపుఁడీ;
యిలఁగలయట్టి విద్యలకు ♦ నెల్లను మూలము గానభాష; లా
కల లవి రెండు నాదమునఁ ♦ గల్గెను; నాదము రెండు త్రోవలై
తొలుతను గానరూపమునఁ ♦ దోడనె వర్ణములౌచు భాషగాఁ
జెలఁగెను; గాని రెండు ధ్వని ♦ చేతనె నిల్చును; దొల్త గానమం
దలరెడు నాద మెల్లరకు ♦ హాయి నొసంగు; ద్వితీయభాగమం
దలిది యశేషశాస్త్రకథ ♦ నంబున జ్ఞానము నిచ్చు; రెండునుం
గలిసి చరింపఁగా సుఖము ♦ జ్ఞానము నబ్బును గాని జ్ఞానమే
వలయును హాయి వల్దనుట ♦ పాడియె? యిట్టి విరాగ మర్హమే?
చెలఁగుచుఁ గంటి మెప్పుఁ గొనఁ ♦ జిత్రకలాపసమార్జనంబునన్
గులుకుచు జిహ్వాతృప్తికయి ♦ కుత్తుకబంటి భుజించునప్పుడున్
వలపుల ఘ్రాణముం దనుప ♦ వాసనలన్ సమకూర్చుపట్టునన్
దలఁగక త్వక్సుఖప్రద ప ♦ దార్థసమార్జన కాలమందునన్
విలువను లెక్కసేయక యె ♦ వేలును లక్షలు గాఁగ రూప్యముల్
గలగల రాల్చుచున్ బడి పె ♦ నంగుచు దొర్లెడివేళ నంతయున్
గలుగని యీ విరాగ మిటు ♦ గట్టిగ శ్రోత్రసుఖార్జనంబునన్
గలుగఁగ హేతువేమొ! చెవి ♦ కర్మమొ! దుష్కృతమో! దరిద్రమో!
కలియుగధర్మమో! యరసి ♦ కర్మవిమోచనముం బొనర్పుఁడీ;
అలయికఁగొన్న వేళఁ, బర ♦ మాత్మఁ దలంచెడివేళఁ, గీర్తనల్
సలిపెడివేళ, నేకముఖ ♦ సంఘబలంబును గోరువేళ, నె
చ్చెలు లొకచోట నందముగఁ ♦ జేరి వినోదము సేయువేళఁ, బెం
డిలి మొదలైనకార్యముల ♦ కీవి నొనర్చెడివేళ, సంఘముం
బలువిధ ధర్మబోధనల ♦ బాగొనరించెడివేళ, నన్యవి
ద్యలు తమచేతఁగాదనుచు ♦ దవ్వులఁ బాఱఁగ నిశ్చలంబుగన్
నిలుచుచుఁ గార్యసిద్ధి నిడ ♦ నేర్తును; నేర్తును; నేను; నేనటం
చలరుచు నప్రమేయపురు ♦ షార్థచతుష్కము నిచ్చు గానమున్
దెలియకయుంట నంతయు ను ♦ ధీజనధర్మము కాదు; కాన నో
యలఘుతరప్రశస్తనుగు ♦ ణాన్వితులార! వినుండు; శ్రోత్రమున్

జులుకనచేసి న్యూనముగఁ ♦ జూడక దివ్యమనుష్యశక్తిచేఁ
గలుగు ప్రయోజనంబిలను ♦ గర్ణహృషీకముకూడ గానసత్
ఫలరస మాధురీ భరిత ♦ వాక్యముఖంబులఁ నందఁ జేయుఁడీ;
యిలఁ గల భోగభాగ్యముల ♦ నెల్ల నొసంగుచు నీశ్వరుండు ని
స్తులకమనీయ సౌఖ్యముల ♦ తోడ మిముం గృప నేలుఁ గావుతన్.

6 ప్రసంగము నంతను గానముతోనే చేయవలయునా? అనావశ్యకము. ఈ శంకయే యనావశ్యకము. జిహ్వేంద్రియమును దృప్తిపఱచుట కెవ్వరైనను పంచభక్ష్య పరమాన్నములను దినదినమును జేసికొని తినుచుండిరా? కొదవ యింద్రియములనైన నెల్లప్పుడు నెవరైనఁ దృప్తిపఱచుచుండిరా? అట్లొనర్చినచో సుఖములును వెగటు కావా? పండుగదినములందును, వివాహాదిశుభకార్యములందును, ప్రత్యేకావసరములందును వాని కధికసౌఖ్యములఁ గూర్చుట లేదా? అట్లే శ్రోత్రమునను దృప్తిపఱుపవగును. ఆయా విషయములను వాని ప్రాముఖ్యమును బట్టి వచనములందో, పద్యములందో, పాటల యందో తెలుపఁదగును. అనఁగా సాధారణవిషయమును వచనమునందును, దానిమించిన దానిని బద్యములందును, దానికంటె ముఖ్యమగు విషయము పాటలయందును దెలుపఁ దగును. పద్యములందును బాటలయందును గానముచేరును. కాని ప్రసంగము నంతను గానముతోనే చేయుదుమనుట వెఱ్ఱితనము; పొరపాటు; రసాభాసకు మూలము.

గానావసరము.

ఆ. వె. పలుకుపట్ల నెల్లఁ ♦ బాటయే వలయునా
యనెడి శంక మొదలె ♦ యనవసరము;
ఎఱిఁగి యవసరముల ♦ నితరేంద్రియంబులఁ
దనుపు నట్లె చెవిని ♦ దనుపఁ దగును.

సంగీతవిద్యావిషయిక సంశయనివారణభాగము నింతటితో విరమించి యిఁక హరికథకుని యోగ్యతాయోగ్యతల వివరింతును. హరికథకుఁడీ సంగీత సాహిత్య విద్యల రెండింటి నెఱిఁగియుంటయే గాక నిరంకుశప్రజ్ఞలు కలవాఁడుగ నున్నాఁడు. సభ్యుల నెన్నియోవిధముల రంజింపవలసియున్నాఁడు. ఆతనియొద్దకు సభ్యులు వివిధాశయముల తోడఁ జేరుదురు. పూర్వజన్మపరమభాగవతసంసర్గసమాగతచిత్తనైర్మల్యయుక్తులౌచుఁ గలుషజాలమహోగ్రవనీకుఠారములగు నీశ్వరచారిత్రములఁ గర్ణరసాయనంబుగఁ వినఁ గోరు భక్తులును, కామరోషలోభాది విరోధిత్రయోద శానవరతబాధిత మనస్కులగుచు నిజకుటుంబపోషణపారవశ్యంబున నలసిసొలసి యొక్కింత చిత్తవిశ్రాంతి నభిలషించు

గృహస్థులును, సంగీతసాహిత్యాది వివిధ లౌకికవిద్యాపరిశ్రమాగత నిరూఢమనీషా యుక్తులగుచు సవయస్కులగు సంగడికాండ్రఁ గూడి కేవలవినోదార్థంబుగ హరికథకుని ప్రజ్ఞాప్రతిభావిశేషంబులఁ గాంచి యానందింపఁ బ్రయత్నించు లౌక్యులును, దుర్వారగర్వాతిరేకంబున సుపర్వులకైన వంక లెన్నుదుమనుచు రంధ్రాన్వేషణోద్యోగ తత్పరులగు చపలచిత్తులును నరుదెంచి యాతని సభయందుఁ బరివేష్టించియుందురు. వారి నెల్లరను వారువారు కోరు సద్విషయములచేఁ దృప్తినొందించి దుర్విషయములను వారి హృదయములనుండి తొలఁగించి యానందపఱుచుటచే వారి హృదయములందలి పరితాప చాపల్యాదిదోషంబుల నిర్మూలించి, వారి చిత్తంబుల నీశ్వరముఖంబులగునట్లొనరించి యవి విశ్రాంతినొందియున్న సమయంబునఁ దా నుద్దేశించిన పరతత్త్వబోధలనో, భక్తి జ్ఞానవైరాగ్యాదులనో, దేశోద్ధారకము లగు లౌకికబోధలనో చేయుచున్నాఁడు. అట్టి బోధల కావశ్యకము లగు పద్యగద్యగీతాదులను దానే స్వయముగ రచియించుకొనఁ గలుగుచున్నాఁడు.

ఇట్టిసమర్థత కలిగి దేశోద్ధారకతత్పరులగుచుఁ బనిచేయు హరికథకు లీ యాంధ్ర దేశంబున నొక్కఁడో యిద్దఱో యుందురని సంశయముతోఁ జెప్పఁదగియున్నది. తదితరులెల్లరును జీవనార్థము హరిదాసవేషధారులైనవారలే. పలుగ్రంథములను బత్రికలను జదివి, ప్రపంచమును దరిచి, సంఘావశ్యకముల నెఱిఁగి, తగు బోధ లొనరించుటకు వీరికి విద్యాజ్ఞానమే లేదు. శ్రవణేంద్రియమూలమున బోధింపనెంచినను దానికి విషయ మగు శబ్దమును గూర్చి చెప్పెడి ధ్వనిమాధుర్యబోధకమగు సంగీతశాస్త్రమంతకంటెఁ దెలియదు. ఏ చిల్లరమల్లర కథలతోడనైనను నాల్గు నీతులను బోధింతురేమో యను కొన్నచో దానికి వలయు వక్తృత్వసామర్థ్యము లేదు. వీరియం దే ప్రజ్ఞయు లేకయున్నను గీ. చెఱకునకు వంక పోయినఁ జెడునె తీపి యనునట్లు లొక్కసారి యా భగవంతుని నామమును నిర్మలచిత్తంబున నుచ్చరింపఁ గలరేమో యనుకొనుటకు వీరి హృదయమునకు భక్తి యన నేమో తెలియదు. వీరియొద్ద నిఁక నేమికలదు? ఏమియు లేదు. ఎవరియొద్దకో పోయి యేఁబది పుటల గ్రంథమును వల్లింతురు. దానిని సభలో నమ్మకముగ నొప్పగింతురు. 'అంతట హరిశ్చంద్రుఁడు నక్షత్రకుని జూచి' అని పద్దెమును జదువుదురు. 'రుక్మిణి కృష్ణునిఁ దలఁచి' అని పాటపాడుదురు. కవి వ్రాసిన యరపజ్కఁని విడిచి యొక్కమాట నైనను బల్కఁజాలరు. ఇఁక వీరి బోధ యెచ్చటఁగలదు? బోధయే లేదు. అపశబ్దబాధ లేకయుండినఁ జాలును. కూలివాఁడు మూట మోసినట్లు నేర్పినదాని నొప్పగింతురు. వీరియం దే ప్రజ్ఞ లేకయుండినను గానోపన్యాససామర్థ్యములు రెండైన నుండినచోఁ

గొంత యుపకారము చేయఁగలరు. ఈ రెండే యపురూపము లగుచుండును. చదువు, గానము, వక్తృత్వశక్తి, భక్తి అనునీ నాల్గుయోగ్యతలు కలవారలే నిజమగు హరికథకులు. అట్టివారలే దేశోద్ధరణకార్యదక్షులు. అట్టి హరికథకులు లభించుటెట్లు? దీనికి మిక్కిలి శ్రమ మక్కఱలేదు. సులభముగనే లభింతురు. ఎట్లనఁగాఁ గ్రయికుల ననుసరించి విక్రేతలు వత్తురు గావున విద్యాధికు లట్టివారికై నెమకుచుండినయెడ సంఘమం దట్టివారు వెలువడుదురు. ఆంధ్రదేశంబున కిట్టి దేశోద్ధారకులఁ బరమేశ్వరుఁ డనుగ్రహించుఁగాత.

హరికథకులు.

సీ. గ్రంథశోధనఁ జేసి ♦ కల ధర్మముల నెల్ల - వివరించి చెప్పంగ ♦ విద్య లేక
శ్రావ్యంబుగాఁ బాడి ♦ సభ్యుల రంజింప - గానశాస్త్రం బంత ♦ కంటె లేక
యే పిట్టకథలైన ♦ హితవుగా వచియింప - ననువగు వక్తృత్వ ♦ మైనలేక
కృష్ణరామాయంచుఁ ♦ గీర్తింపఁగానైన - నల భక్తియోగ మా ♦ వంత లేక
గీ. వెదకి పొట్టకై హరిదాస ♦ వేష మూని
సభల నిల్తురు కొంద ఱా ♦ శ్చర్య మగును;
చదువు, గానంబు, వక్తృత్వ ♦ శక్తి, భక్తి
కలుగువారలె తగు హరి ♦ కథకుఁ లెపుడు.

---

## 8. చిత్రలేఖనము ♦

భావప్రకటనమునకుఁ బరమేశ్వరదత్తములైన మార్గములు మూఁడు. వాగ్రూపము, లేఖనరూపము, చిత్రరూపము. ఇందు వాగ్రూపమార్గమున దేశము నుద్ధరించువార లుపన్యాసకులు, హరికథకులును. లేఖనరూపమార్గమునఁ గవులును, బత్రికాధిపతులును దేశోద్ధరణమును గావించుచుందురు. ఇఁకఁ జిత్రరూపమార్గమున దేశోపకారు లగువారు చిత్రలేఖకు లని చెప్పఁదగియున్నది. ఈ చిత్రరూపమార్గము పలువిధములుగ నున్నది. కొందఱు కాగితములు, అట్టలు, అద్దములు, వస్త్రములు, కొయ్యపలకలు, రాతిపలకలు, చర్మములు, ఇనుము మొదలగు లోహముల రేకులు, గోడలు లోనగువానిపైని వస్తురూపములను రంగులతో వ్రాయుదురు. రాజా రవివర్మగారి పటములును తెరలపై నాడించెడి తోలుబొమ్మలును దృష్టాంతములు. ఈ రూపములకుఁ బొడవు వెడలుపు మాత్రమే యుండును. మందము నంతయు నుండదు. మఱికొందఱు పైపదార్థములతోడను, మఱియు రేగటిమన్ను, పేఁడ, మక్కులోనగు పదార్థములతోడను బై వస్తురూపములను బొడుగు వెడలుపు మందము ను గూడ నుండునట్లు బొమ్మలుగఁ జేయుదురు.

కొండపల్లి బొమ్మలు, నక్కపల్లిబొమ్మలు, మఱికొన్ని పోఁతవిగ్రహములు మొదలగునవి యుదాహరణములు. ఇంకఁ గొందఱు కొయ్యపలకలు, రాతిపలకలు, రాగి మొదలగు లోహముల రేకులు లోనగువానిపైని యా వస్తురూపములఁ జెక్కుదురు. ఈ త్రివిధపద్ధతుల చేత వస్తురూపములఁ గల్పించి చూపువార్లు నిచటఁ జిత్రలేఖకు లని చెప్పఁబడు చున్నారు. ఇటఁ జదువరుల కొక సంశయము కలుగఁదగియున్నది. ఏమనఁగా నిందు మొదటితరగతివారిని జిత్రలేఖకు లనఁదగునుగాని యా రూపములఁ జెక్కువారిని బోఁత పోయువారిని, చేయువారిని గూడ లేఖకు లనఁదగునా యని. దీని కిట్లు సమాధానముఁ జెప్పవచ్చును. వస్తురూపములను జెక్కువారు తొలుత రూపములను వ్రాసి యనంతర మందుఁ జెక్కుదురు. పోఁతపోయువారును దొలుతవ్రాసి, చెక్కి, అచ్చుగాఁ జేసికొని, మట్టి పింగాణి లోహములు లోనగువానిని తడిచేతనో వేఁడిచేతనో మెత్తఁబఱిచి, యా యచ్చులోఁ బోసి, విగ్రహమును దీయుదురు. విగ్రహములను జేయువారైనను ఆ వస్తు రూపము తమ హృదయమందు సరిగా నిలిచెనాలేదా యని చూచుకొనుటకుఁ బ్రప్రథ మమున నొకదానిపై వ్రాసిచూచుకొని యారూపము ననంతరమందు వస్తురూపముగఁ జేయుదురు. కావున విగ్రహములను జెక్కువారిని, చేయువారిని, పోయువారిని గూడఁ మొదటి తరగతివారితోఁ జేర్చి మొత్తమునఁ జిత్రలేఖకులనియే యిటఁ జెప్పఁబడు చున్నది.

కం. మనుజులు భావప్రకటన
మును వాక్కున, లేఖమూల ♦ మునఁ జిత్రములన్
బొనరింత్రు; చిత్రలేఖన
మను పేరఁ దృతీయమార్గ ♦ మలరుచు నుండున్.

ఈ విద్య భావప్రకటనమునకుఁ దృతీయసాధనమైనను బై సాధనద్వయమున కంటె దీనియందు మూఁడు సమర్థత లెక్కుడుగఁ గలవు. అవి 1 అప్రత్యక్షవస్తు ప్రత్య క్షీకరణము, 2 సంగ్రహబోధ. 3 అందము. ఏదైన నొక నూతనపదార్థమునుగాని, జంతు వునుగాని, జగడములోనగు విషయములనుగాని చూచివచ్చి దాని నితరుల కెఱిఁగింపఁ దలఁచినపు డుపన్యాసకుఁడు దానిని వాఙ్మూలమునఁ దెలుపును. కవి యక్షరలేఖన మూలమునఁ దెలుపును. వారుభయులు తెలుపునపుడును దదప్రత్యక్షరూపము శ్రోతల హృదయఫలకములపైఁ బడుచుండును. అట్టి హృద్గతరూపదర్శనమువలన వార లా యప్రత్యక్షవిషయము నూహింపఁవలసియున్నారు. చిత్రలేఖకుఁడన్ననో యట్లు కాదు. తద్రూపము నొక ఫలకముపైఁ జిత్రించి యెదుట నుంచును. దానిచేఁ దదప్రత్యక్ష

రూపము ప్రత్యక్షమై కన్పట్టును. ఇదియే అప్రత్యక్షవస్తుప్రత్యక్షీకరణము. 2 తద్విషయము నుపన్యాసకుఁడు వాగ్రూపముననే దెలుపుట కొక యరగంట కాలము పట్టవచ్చును. కవి వ్రాఁతచేతఁ దెల్పుట కిరువది కాగితములపైని వ్రాయవలసివచ్చును. ఉపన్యాసకుఁ డంతగఁ దెల్పినను కవి యింతగ వ్రాసినను విషయ మప్రత్యక్షముగ నుండుటచేఁ ద దను భవమును నంతగనే యుండును. దానినే చిత్రలేఖకుఁ డొక పత్రముపైఁ జిత్రించి యెదుటఁ బెట్టినయెడఁ ప్రేక్షకు లైదు నిమిషములలోఁ దద్విషయతత్త్వమును సుల భముగ గ్రహింపఁగలుగుదురు. విద్యాజ్ఞానలేశము నెఱుంగని మూఢులైనను దాని నతి సులభముగ నెఱుంగఁగల్గుదురు. ఇదియే సంగ్రహబోధ. 3 సృష్టియందలి యేపదార్థ మైనను దత్తజ్జాతినైజ సమస్తసుగుణ భరితమైయుండుట యరిది. ఒక్క చంపకపుష్ప మును జిత్రగింపుఁడు. ఆజాతి పుష్పములను బదింటి నొక్కచోఁ బెట్టి పరీక్షింపుఁడు. పొట్టిది, పొడుగుది, లావుది, సన్నది, రేకుసంగినది, రంగుతక్కువది, వాడిపోవునది గా నిట్టు లన్నియు నన్నిలోపములతో నుండును. ఇట్లే సృష్టియందలి యేపదార్థమయినను దఱుచుగా గుణదోషసమన్వితమయియే యుండును గాని సర్వసుగుణోపేతమై యుండుట కడిఁది. చిత్రలేఖకుఁ డట్టి పదార్థమును జిత్రించునపు డాజాతియందలి బహుపదార్థము లందుఁగల గుణములనెల్ల సేకరించి తన పటమునందుఁ జిత్రించును. అనఁగా స్వేచ్ఛగ నొక వృక్షమును వ్రాయనెంచినపు డందలి విఱిగిన కొమ్మలనుగాని, వాడిన యాకు లనుగాని, పుచ్చిన కాయలనుగాని మఱి దానియందలి యేదోషములనుగాని తన పటము నందు వ్రాయఁడు. సారవంతమగు నేలయందు జన్మించి, యుత్తమమగు వాతావరణ మందుఁ బెరిఁగి, దినదినప్రవర్ధమానములగుచున్న యాజాతివృక్షములలో ననేకములందుఁ గన్పట్టు గుణవిశేషములనెల్ల సేకరించి తనపటమున నొక్క వృక్షమునందు వ్రాయును. దానిచేత నీతఁడు స్వేచ్ఛగఁ జిత్రించు పటము లెప్పుడును సర్వగుణాలంకృతమ్ములగుచు నేత్రోత్సవజనకంబు లగుచుండును. ఇదియే దీనియందలి యందము. మఱియు నీతని నేత్ర మెల్లప్పుడు నందమును దీర్చి దిద్దుట కలవాటుపడుటచేత నీతఁ డొనరించు సర్వ కార్యములందును నందమే ప్రాముఖ్యమును వహించుచుండును.

చిత్రలేఖనాధిక్యము.

ఆ. వె. వక్తృలేఖకులకు ♦ వలెఁగాక చిత్రలే
ఖకుల కధిక శక్తి ♦ కలదు మాఁట
భావగతవిధంబుఁ ♦ బ్రత్యక్షపఱుచుట,
క్షిప్త బోధ, యంద ♦ గించు టనఁగ.

ఇట్టి గుణత్రయోపేతంబగు చిత్రలేఖనవిద్య సంఘమునకు బహువిధంబులుగ నుప యోగించుచున్నది. మనము దూరదేశమునుండి యొక యాభరణమునో, యంత్రమునో, పాత్రమునో తెప్పింపఁదలఁతు మనుకొనుఁడు. అపుడు మన యభిప్రాయము నా దూరస్థ శిల్పున కెఱింగించుట యెట్లు? ఎంతవ్రాఁత వ్రాసినను ఒకటి కింకొకటి తోఁపవచ్చును. వ్యయప్రయాసల కోర్చి యొక మిత్రు నచటికిఁ బంపుదు మనుకొన్నను అతఁడు పోయి వచించునపు డా శిల్పి యొకటి నింకొకటి గా గ్రహింపనచ్చును. అపు డేమి చేయఁ దగును? తా నుద్దేశించిన యా వస్తురూపము నొక్క కాకితము పై వ్రాసి పంపినఁ జాలును. మనము కోరిన ట్లా శిల్పి చేసియిచ్చును. వైద్య వ్యాయామ శిల్పాది శాస్త్రం బుల బోధించునపుడు చిత్రలేఖనవిద్యా సాహాయ్యంబును గొననిచో నందలి వివిధభాగం బులు తృప్తిగ బోధ కానేకావు. కావుననే యట్టి గ్రంథములం దాయా వస్తుక్రియా రూపంబులు చిత్రించి చూపఁబడుచున్నవి. ఆవు గుఱ్ఱము మొదలగు సాధారణవిషయ ములను గూర్చి యుపాధ్యాయుఁడు తన శిష్యులకు బోధించునపుడైన నా విద్యాసాహా య్యంబు లేనిది బోధ సమర్థముగ నుండఁజాలదు. కావుననే ప్రభుత్వమందలి విద్యా శాఖాధికారులు చిత్రలేఖనవిద్యాజ్ఞానములేని యుపాధ్యాయుఁ డసమర్థబోధకుఁ డని తీర్మానించుటయకాక ప్రతివిద్యార్థికి నిచ్ఛానుసారపాఠము లెన్నియోయుండఁగా దీనిని మాత్రము నిర్బంధపాఠములలోఁ జేర్చిరి. పండితపామరుల కుభయులకు నతిశీఘ్రకాల ములో విషయతత్వమును సమంబుగ బోధించుటయం దీ విద్య యసమానమై యుండు నని ఘంటాపథంబుగఁ జెప్పనగును. అతికఠిన తపస్సంపన్నుఁడును, మహాశక్తియుతుం డును, బ్రహ్మర్షియు నగు విశ్వామిత్రుఁ డొకప్పు డింద్రియవశగతుండై మేనకవలన నొక పుత్రికను (శకుంతలను) బడసియుఁ దన చిరకాలోపార్జితవైరాగ్య కుఠారసాధనంబునఁ దన పుత్రికాప్రేమపాశంబులఁ దెగనఱికి యా పుత్రికాస్వీకారంబు నొల్లక త్యజించు టను దెల్పెడి యా చిత్రపటంబును జూచునపు డందలి విశేషంబుల నేమూఢుఁడు గ్రహిం పకయుండును? శ్రీరామపట్టాభిషేకము, సృష్ట్యతీతమగు నృసింహావతారరూపము, మహిషాసురమర్దనము, పార్వతీపరిణయము లోనగు పురాణగాథ లీవిద్యాసాధనంబుననే కదా చిత్రపటములందు దినదినమును మనకుఁ బ్రత్యక్షములగుచుఁ ద దంతర్గత గుప్తార్థం బుల నెల్ల దినదినంబును మనకుఁ గరతలామలకభాతి నొనర్చుచున్నవి. మనము మన యింటనే కూర్చుండి ప్రపంచమందలి వివిధదేశప్రజలను, వారి వినోదములను, చేష్టలను, వృత్తులను, నచ్చటచ్చటి దుర్గారామనదీపర్వతాదులను, సృష్టివైచిత్ర్యములను గూడఁ బ్రత్యక్షంబుగ నొక్క యరగడియలోనఁ గన్నులపండువుగఁ జూడఁగల్గుట యీ విద్యా

సాహాయ్యంబున నేకదా. నాటకప్రదర్శనః డాయాప్రదర్శనంబులందు శిశు పశు ఫణి పండితాద్యాబాలగోపాలజన రంజిన సమర్థం బగు గానవిద్యా సాధనంబున సభ్యపాళికి శ్రోత్రానందంబు నొడఁగూర్చుటయకాక యాయా రంగంబుల వివిధనైసర్గికపదార్థ యుతంబుగ నగపఱుచుచు నేత్రానందంబును గూడ నొనఁగూర్పఁగలుగుట యీ విద్యా మూలంబున నేకదా. స్త్రీలు గృహాంగణాభ్యంతర ప్రదేశములందుఁ బెట్టెడి ముగ్గులందును, స్త్రీపురుషు లొనరించుకొనెడి బొట్టు జుట్టు కట్టు లోనగు సమస్తాలంకార ప్రయత్నములందును ఈవిద్యయే ప్రాముఖ్యమును వహించుచున్నది. ఇంత యేల? మనుజుని దినచర్యయందు నేత్రతృప్తికి యందమును గల్పింపఁజూచెడి సర్వవిధకార్యములందును ఈ చిత్రలేఖనవిద్య కగ్రతాంబూలము నొసంగక తీరదు.

చిత్రలేఖనము.

చం. అనుపమధీవిశాలురు! గు ♦ ణాఢ్యులు! పెద్దలుః! చిత్తగింపుఁడీ
యనువగు చిత్రలేఖనమ ♦ హత్వముఁ దీరుగ విన్నవించెదన్;
జనులకు నీశ్వరుం డొసఁగు ♦ సర్వహృషీకములందు నేత్రమే
ఘనమగు; దానిఁ బాసిన జ ♦ గంబె నిరర్థకమౌను; లోకమం
దనయము దానికిన్ విషయ ♦ మైనది రూపము; వక్రరూపమున్
గనుఁగొన నేవగించు; నొడి ♦ కంబగు రూపుని కాంచు; దాని కిం
పొనరకయున్నచోఁ గొనఁగ ♦ నొల్లదు హారము నీర మంబరం
బును మఱి కట్టు జుట్టు నగ ♦ బొట్టును బోనము; కాన నేత్రమున్
దనుప నురూపమున్ గొనుట ♦ తద్దయు ముఖ్యము; తత్స్వరూపమే
జను లనుకొందు రందమని; ♦ చక్కఁగ నందముఁ దెల్పఁ జిత్రలే
ఖనమనువిద్యయే ఘనతఁ ♦ గాంచెను విద్యలలోన; నిద్ది యిం
కను వివిధప్రదేశముల ♦ గల్గు వినోదములెల్ల నొక్కచో
టను లిఖియించి నుంతయును ♦ డక్కు టమారములేక తథ్యమే
యనఁదగురీతిఁ జూపి ముద ♦ మందఁగఁ జేయును; బూర్వమెప్పుడో
చనిన మహాత్ములన్, ఘనుల, ♦ సాధుల, దివ్యములైన శక్తులన్,
వినుత పతివ్రతాళి, రణ ♦ వీరుల, ధీరుల నిక్కువంబుగన్
గనులను గాంచునట్లు కల ♦ కాలము దృష్టికిఁ దెచ్చునట్టు లిం
పొనరఁగ వ్రాసి వారియెడ ♦ నొప్పుచునుండు విశేషధర్మముల్
జనములు కూర్మిమీఱ నని ♦ శంబును జేకొనఁజేయు; నెందునుం

గనని విశేషయంత్రముల ♦ కార్యము నైనను వ్రాసి యంతలో
మనమున కెక్కఁజేయు; నణు ♦ మాత్రములోనఁ బురమ్ముఁ గానగా
వనముఁ బురమ్మురీతిగ నె ♦ బాసన మార్చి నిసర్గరూపముం
బొనరిచి నాట్యరంగమును ♦ బొల్పు వహింపఁగఁజేయు; భావబో
ధనకుఁ దృతీయమార్గమయి ♦ దానిఁ బ్రపూర్ణతనొందఁజేయు; నీ
యనువునఁ జిన్నపెద్దల, ధ ♦ నాఢ్యుల, బీదల, స్త్రీజనంబులన్
ఘనముగఁ దన్పి, యెల్ల శుభ ♦ కార్యములందు నలంకరించుచో
మునుమును తానె నిల్చి, ముద ♦ మున్ ఘనమున్ బలముం బొనర్చి, మే
లనఁదగురీతి నెల్ల మను ♦ జాళిని దన్పెడు చిత్రలేఖనం
బను నమితోపకారకర ♦ మై తగు విద్యను నేర్చి యెల్లరున్
దినదినముం దదీయమగు ♦ దివ్యఫలంబులఁ గాంత్రు గావుతన్.

మన పూర్వు లీ విద్య కింతటి ప్రాముఖ్యము నిచ్చినట్టు లూహించుటకుఁ దగు నిదర్శనము లెన్నియో కలవు. ఆ కాలమం దీ దేశంబునఁ గల స్త్రీపురుషు లెల్లరు నీ విద్యను జక్కఁగ నెఱిఁగియుండిరి. పరిణయంబునకుఁ బూర్వము వధూవరు లన్యోన్య నిర్ధారణార్థము పలువురి రూపపటంబులఁ దెప్పించుకొని వానిలోఁ దమ యిచ్చవచ్చిన వారి నేఱుకొనుచు వచ్చిరి. వారి రూపపటముల వ్రాసి తెచ్చుటకై యే విద్యాధికునో యాశ్రయించుట లేదు. చెంతనుండిన యే చెలికత్తియనో యే చెలికానినో కోరుదురు. వారు స్వయముగ వ్రాసి తెచ్చియిత్తురు. ఎన్నియోవివాహములం దీపద్ధతియే యవలంబింపఁబడినట్టులు మన పురాణగ్రంథములందుఁ గనవచ్చుచున్నది. ఆకాలమం దీవిద్య పురుషులందేకాక సర్వసామాన్యముగ స్త్రీలయందును నెంతగ వ్యాపించియుండెనో దీనింబట్టి చదువరు లూహించుకొందురుగాక.

ఇట్టి చిత్రలేఖనవిద్య ప్రకృతకాలంబున మన దేశమం దెట్టిస్థితిలో నుండెనో యొక్కింత చిత్తగింపుఁడు. విద్యాధికులగువారియందు లేశమాత్రమును జేరక కేవలముగ 'ముచ్చీలు' అని పిలువఁబడెడి యొక తెగవారికి జీవనోపాధిగ మాత్రము బరిణమించుచుండినది. వీరే యిపు డీ దేశమందుఁ జిత్రకారనామధేయులై యున్నవారు. ఈ దేశమందలి యేకవిద్యాభ్యసనపద్ధతియే దీనికిఁ గారణమైయుండు నని చెప్పవచ్చును. ఈ ముచ్చీలు తమకు జీవనోపాధిగ నేర్పడిన యీ చిత్రలేఖనవిద్యను మాత్రమే శ్రద్ధతోఁ జూచుకొనుచుఁ గొందవవిద్య లన్నిటి నుపేక్షించుటచే వారు నానాటికి సంఘమందు హీనస్థితినొంది పనిపాటలవాండ్రలో నొకరుగఁ బరిణమించుచుండిరి. వివిధవిద్యాధిక

సామాన్యమైన స్వప్రయోజకత్వ ప్రకటనాపేక్షారూపక మనోదౌర్బల్యము వీరియందును ప్రవేశించినది. మఱేమికావలెయును? ఈ విద్య బాలునిచేతిలోని బంగారుఖడ్గమువలెఁ బరిణమించినది. వీరు తొలుత స్వభావవిరుద్ధలేఖనములకు మొదలుపెట్టిరి. ఒక చిలుకను వ్రాసి దాని ఱెక్కమీఁద బంగారువన్నెగల చుక్కలను వ్రాయఁజొచ్చిరి. ఒక పులినివ్రాయునపుడు దాని పిఱుఁదుపై నొక పద్మమును, దాని యంతరమున నొక రథమును వ్రాయసాగిరి. ఇట్టి దోషములు నానాఁటఁ బ్రబలఁగాఁ గ్రమంబుగ వీరు నీతిబాహ్యలేఖనములకుఁ బూనిరి. వానిని జపలచిత్తులగు సామాన్యజనులు కొందఱు ఆమోదించుచువచ్చిరి. తుదకీ యక్రమము హిందూసంఘమందుఁ బవిత్రస్థలములుగ నుండిన దేవాలయములపైని బూతుబొమ్మలను ధారాళముగఁ బ్రయోగించునంతవఱకు వ్యాపించెను. అది యొక యాచారమై నేఁటివఱకును మన సంఘమును బాధించుచునే యుండినది. నరుని కంట నల్లతాయి బ్రద్దలగు నని యొక సామెత కలదు. దృష్టిదోషము చేత నట్లగునని దీని యభిప్రాయము. తద్దోషనివారణార్థము చిత్రకారుఁ డొక వికార రూపమును జిత్రించును. కాని లెక్కనుమీఱుచున్న యీ బూతుబొమ్మ లా తరగతి లోనికిఁ జేరఁజాలవు. ఇంత యేల? మన ప్రకృతకాలపు నాటకసంఘములందలి తెరలపైఁ జూడుఁడు. స్త్రీపురుషు లిరువురు ముద్దులుపెట్టుకొనుచున్న ట్లుండును. కొందఱు స్త్రీలు పూర్తిగ దిగంబరులైకాని దాదాపుగ దిగంబరులైకాని యాటలాడుచున్న ట్లుండును. కానిచో నే విదేశసంఘమువారో యొక్కచోటఁ గూర్చుండి యేదో వినోదమును జేసికొనుచున్న ట్లుండును. చదువరులారా! దీని నేమిగాఁ దలంచెదరు? దీన నేమైనఁ బుణ్యమా పురుషార్థమా? మన సంఘమందుఁ బురాణపురుషు లెందఱు లేరు? మహాత్ము లెందఱు లేరు? రణవీరు లెందఱు లేరు? మహాపతివ్రతాశిఖామణు లెందఱు లేరు? వారల పటములు వీరి కేల రుచింపవు? ఈ మహాదురాచారమున కెవరు నిందార్హులు? నవనాగరకజనస్థానము లనఁదగు నీ నాటకసంఘములందే యిట్టి వికార రూపములు తాండవించుచుండుట లజ్జాకరము కాదా? ప్రదర్శకులు నియమించిన సమయమునకుఁ బ్రేక్షకులు పోయి నాటకశాలయందుఁ గూరుచుందురు. సాధారణముగాఁ బ్రదర్శకు లాలస్యముగఁ బ్రారంభింతురు. అంతసేపు నేమియుం దోఁచక తలయెత్తి చూడఁగనే యే వికారరూపమో ప్రత్యక్షమగును. అది కొన్నిసమయములందు మన మెన్నఁడును గని విని యెఱుఁగనిదిగఁ గూడ నుండును. అట్టి మొదటితెరపై నే పతివ్రతా చారిత్రమునో, యే మహనీయ చారిత్రమునో, యే దేశోద్ధారక చారిత్రమునో జ్ఞప్తికిఁ దేఁదగిన రూపములు చిత్రింపఁబడియుండునెడ నెంత మహానందజనకముగ నుండును!

# చిత్ర  ఖనము.

అచటఁ గూర్చుండిన కాల మెంతగ సద్వినియోగమగును! ప్రదర్శకు లన్యప్రతిబంధకములచేతఁ జేసిన యాలస్య మెంతగ సార్థకమై యొప్పును! దానిచేఁ బ్రేక్షకుల కెంత మేలు కలుగను! అట్టిరూపములనే దేవాలయాదిస్థలములందుఁ బ్రయోగించినయెడ నవి చిరకాలముదనుక ప్రజాసామాన్యమున కెంతగ సుబోధకములైయుండును! ఇట్టి పవిత్ర కార్యనిర్వహణార్థ ముపయోగింపఁబడఁదగిన చిత్రలేఖనవిద్య దుర్వినియోగ మగుట కడుంగడు శోచనీయము కాదా?

పాశ్చాత్యపండితాభిప్రాయానుసరణంబుగ నిపుడు మన యాంగ్లేయవిద్యాభ్యాసన పాఠశాలలయం దాచరణలోనుండిన వివిధవిద్యాభ్యాసనపద్ధతిచేత నీ చిత్రలేఖనవిద్యయుఁ బాఠముగ నియమింపఁబడుటయకాక దీని ప్రాముఖ్యమును బూర్తిగ గ్రహించుటచేఁ గొంచెముకాలమునుండి నిర్బంధపాఠముగఁ గూడ నేర్పఁబడినది. కావున నిఁక మన దేశమందు వెలువడఁబోవు విద్యాధికులం దీవిద్యయుఁ గన్పట్టుచుండును. కాని వారియందిది యసమర్థముగ మాత్రమే యుండు నని తోఁచుచున్నది. ఏలయన నిప్పటి విద్యార్థులు దీనిని స్వోపయోగార్థమును సంఘోపయోగార్థము నని యభ్యసించుట లేదు. పరీక్షాధికారులఁ దృప్తిపఱుచుటకు మాత్రమే యభ్యసించుచున్నారు. పాఠశాలాధికారులును దీని నంతగనే మన్నించుచున్నారు. ఈ లోపమునకుఁ గారణ మీ విద్యార్థులును గారు; అధికారులును గారు. ప్రజాభిప్రాయమే కారణము. అట్టి ప్రజాభిప్రాయము మాఱినఁ గాని యీ లోపము చక్కఁబడ నేరదు. ఈ విషయమును విద్యార్థులనుగూర్చిన ప్రత్యేకోపన్యాసమందుఁ జూడఁదగును. అవకాశము కలుగునంతలో విద్యాప్రయోజనము గ్రహించి నిజమగు నుత్సాహముతో నిప్పటివిద్యార్థు లీ విద్య నభ్యసింపఁదొడఁగినయెడ నిది యచిరకాలములోనే యభివృద్ధినొంది మన సంఘమునకు నూతనోపకారముల నొనరించు ననుట నిశ్చయము.

కావున భావప్రకటనతృతీయమార్గమగు చిత్రలేఖనముయొక్క ప్రాముఖ్యమును దేశోద్ధరణకార్యోత్సాహులగు మహాజను లెల్లరును గ్రహించి, ప్రజాసామాన్యమున కెఱింగించి, విద్యార్థులఁ బ్రోత్సాహపఱిచి, విద్యాభ్యాసన పద్ధతుల సంస్కరించి, యీ విద్య కేవల వినోదమాత్రజనకముగఁ గాక ధర్మబోధనసాధనంబుగఁ బ్రజల కుపకరించున ట్లొనర్తురుగాక.

## చిత్రలేఖకదోషములు.

సీ. సింహంబు వీఁపుపైఁ ♦ జిలుకను జిత్రించు - దాని పక్షముపైర ♦ థంబు వ్రాయు
వ్యాఘ్రపృష్ఠంబుపైఁ ♦ బద్మంబు లిఖియించుఁ - దన్మధ్యమందుఁ ద ♦ త్తడి లిఖించుఁ

బుణ్యస్థలములందు ♦ బూతుబొమ్మలఁ గూర్చు - వాని చెంతల ముని ♦ వరుల నిల్పు
రంగస్థలముల వ్య ♦ ర్థక్రీడలనుఁ ద్రావాయు - వానిప్రక్కను జెట్ల ♦ వరుసఁ జూపు

గీ. చిత్రలేఖకుఁ డిటొనర్చు ♦ చేత కంటెఁ
బుణ్యచారిత్రముల మహా ♦ పూరుషులను
దివ్యతరశక్తుల మహాప ♦ తివ్రతలను
జ్ఞప్తికిని దెచ్చు వ్రాఁతలే ♦ నంబు కాదె?

---

## 9. సంగీతమఁట! తెలియదఁట!

శ్రీమదఖిలజగదేకకారణుం డగు పరమేశ్వరునిచే మానవహృదయంబునఁ గల్పింపఁబడిన సజీవలక్షణ మగు నాదము రెండుభాగములు కాఁగా నందు మొదటిభాగము గానమును రెండవభాగము భాషయు నైనవి. ఈ గానభాషలు రెండును సంగీతసాహిత్యములను పేరఁ బరఁగుచున్నవి. ఇందు సంగీతము తౌర్యత్రికం బనఁబడు గీతవాద్యనృత్యములను మూఁడు భాగములుగ నేర్పడి యాయా భాగములం దనేకములగు భేదములఁ జెందినది. సాహిత్యము వేదశాస్త్రపురాణకావ్యనాటకాలంకారాది భేదములఁ జెందినది. ఈ సంగీతసాహిత్యములు రెండును నిఖిలవిద్యాధిదేవత యగు సరస్వతికి సహజాలంకారములై యొప్పుచున్నవి. శ్లో. సంగీతసాహిత్య కళావిహీనః - సాక్షాత్ పశుః పుచ్ఛవిషాణహీనః అనునట్లు సంగీతసాహిత్యముల నెఱుఁగని మనుజుఁడు తోఁకయుఁ గొమ్ములును లేని ప్రత్యక్షపశు వని చెప్పఁబడుచున్నాఁడు. పశువునకంటె మనుజునందుఁ గల యాధిక్య మీ సంగీతసాహిత్యవిద్యాద్వయమునందే కలదు. కావున నట్టి పశుత్వమునుండి తొలఁగి మానవత్వము నొందుటకుఁ బ్రతిమనుజుఁడు నీ విద్యాద్వయమందును బరిశ్రమం బొనర్పవలసియున్నాఁడు. మఱియు నీ గానభాషలు రెండును నాదరూపములే యైనను గానమందలి నాదము మధురధ్వనియుతమైయున్నది. భాషయందలి నాదము బహువిషయభరితమైయున్నది. ఇందు మాధుర్యమును విషయమునుండి వేఱుచేయుట యుత్తమపురుషలక్షణము కాదు. ఉభయవిద్యాపరిశ్రమం బే యుత్తమలక్షణం బగును. ఇందు గానము మొదటిదగుటచే దానిఁగూర్చి యిట ముందుగఁ దెల్పఁబడుచున్నది. ఎవరుగాని యొక పెద్దమనుష్యుఁడు తన యింటిలో నొక సంగీతసభను జేయింపనెంచి యా సంగీతమును వినుటకుఁ దన సాటివారల నొక యిరువదిమందిని రమ్మని పిలిచిన యెడ వారిలో సుమారు పదునాలుమందియైనను ఇట్లనుదురు. "సంగీతము మాకుఁ దెలియదు. మేము వచ్చి ప్రయోజనమేమి? మే మేమి వినఁగలము?" ఇట్లనువారి నే

"అయ్యా! తమరు రేపు మా యింటికి భోజనమునకుఁ దయచేయుఁడు'' అని పిలిచినచో నది మాకుఁ దెలియదు అని చెప్పరు. "నేడు సర్కస్ ఆట జరుగుచున్నది. మనము చూడఁబోవుదము రండు'' అని పిలిచినను వార లది మాకుఁ దెలియ దని చెప్పరు. 'భోజనము చేయుటకును, సర్కసును జూచుటకును బిలిచినపుడు మాకుఁ దెలియ దని చెప్పరైతిరి; సంగీతమును వినుటకుఁ బిలిచినపుడు మాత్రము మాకుఁ దెలియ దనుచుంటిరి; ఇట్లనుటయందు మీ యభిప్రాయ మేమి?'' అని మరల నడిగినయెడ నిట్లు చెప్పుదురు. "సంగీతములో మాకు రాగము తెలియునా, తాళము తెలియునా, పాడుట తెలియునా వాయించుట తెలియునా? మా కేమియుఁ దెలియదు గనుక న ట్లంటిమి. ఇదియే మా యభిప్రాయము.'' అట్లయినచో భోజనము చేయుటకును, సర్కసును జూచుటకును వెంటనే యంగీకరించుట చేత వంటచేయుటయందును, సర్కసుచేయుటయందును మీరు సమర్థులని గ్రహింపవలసినదే కదా యని పలికినయెడ నవియుఁ దెలియ వందురు. 'మిమ్ములను సంగీతము పాడుటకుఁ బిలువలేదు కదా; వినుటకుమాత్రమే పిలిచితిమి కదా; వండుట తెలియకుండినను భుజించి యానందించినట్టులు పాడుట తెలియకుండినను పాటనువిని యానందింపఁగూడదా?' అని యడిగినయెడ "వినినను మాకు సుంతయుఁ దెలియుట లేదు'' అని ప్రత్యుత్తర మిత్తురు.

ఇట్లనుటకుఁ గారణ మేమైయుండును? వారికిఁ దెలివి లేదందుమా? అట్లు కాదు. వారు బుద్ధిశాలులు; విద్యాధికులు. కల్లలాడుచుండి రందుమా? అదియు సరికాదు. వారు యథార్థమునే పల్కుచుండిరి. అట్లయినచో వారికిఁ దెలియకపోవుటకు దోష మెచ్చటనైన నుండితీరవలయును. అది యెచ్చట నుండును ? అది యుండుటకుఁ బ్రదేశములు రెండే కలవు. వినువారి చెవియందుఁగాని పాడువారి నోటియందుఁగాని యుండును. వినువారి చెవియందే కలదని చెప్పునెడ నొక్క బాధ కలుగును. ఏమనఁగా సర్వజగత్కర్తయగు పరమేశ్వరుఁడు మన యింద్రియముల సృజించుటలో రుచిని గ్రహించి యానందింపఁగల జిహ్వను, పరిమళమును గ్రహించి యానందింపఁగల ఘ్రాణమును, ఇట్టులే వానివాని విధుల సమర్థముగ నెఱవేర్పఁగలుగునట్టులు తక్కిన యింద్రియములను సృజించి, ఒక్క చెవిని మాత్రము తనకు విషయమగు ధ్వనియొక్క మాధుర్యమును గ్రహించి యానందింపఁజాలక యుండునట్టు లసమర్థముగ సృజించె నని యొక యకారణదోషమును ఆ సర్వసమునం దారోపించినవార మగుదుము. ఇది యక్రమము. ఇఁక పాడువారల నోటియందే యీదోషము కలదనునెడ నదియుఁ దృప్తిగ న్యాయముగఁ దోఁచుట లేదు. ఏలయన వారు రాగమునందుఁగాని, తాళమునందుఁగాని, స్వరమునందుఁగాని

లక్షణవిరుద్ధముగ నెంతమాత్రమును బోవుట లేదు. ఒకవేళఁ గొంద ఱట్లు పాడినయెడ వారు గాయకులే కాకపోవుదురు. వారి సంగతి యిచట విచారణీయము కాదు. లక్షణయుతముగఁ బాడినపాటనే వీరు గ్రహింపఁజాలకయున్నారు.

ఇఁక నీ దోష మెచ్చటఁగలదు? అదియే యిట వ్రాఁతవలన సాధ్యమగువఱకు వివరింపఁబడును. చదువరులు దీనిని సావధానముగ గ్రహింతురుగాక. ఈ దోషము పాడువారియందే కలదు. అయినను వారి విద్యయందు లేదు కాని వారి పద్ధతులందుఁ గలదు. ఎట్లనఁగా గానముయొక్క ప్రయోజనము పాటయందలి భావమును వినువారల హృదయసీమలందుఁ జక్కఁగ నాటుకొనున ట్లొనర్చుటే.

గానప్రయోజనము.

ఉ. గానము గానమన్న సరి గగ్గరి గగ్గరి యంచు నూరకే
ప్రాణము సోలుదాఁక బహు భంగుల నూకుట కాదుకాదు; తాఁ
బూనినయట్టిభావము ను బోధకమౌగతి సొంపు గుల్కఁగన్
వీనుల నాటఁజేయఁదగు విద్యయె సుమ్మిది మిత్రరత్నమా!" గానసారము.

కావున గానమందుఁ సర్వజనులకును దెలియఁదగినదియుఁ, దెలియవలసినదియు పాటయందలి భావముకాని సంగీతవిద్యామర్మములును, పాఠకుని ప్రజ్ఞయుఁ గావు. అట్టి భావమునకు భంగముకలుగకయుండునంతవఱకును ఆ గాన మెల్లరకును దెలియుచునే యుండును. కాని ప్రకృతకాలపు గాయకులు పలువురు గానవిద్యాప్రయోజనమును నంతయు గమనింపక తద్విద్యామర్మములను, స్వప్రయోజకత్వమును మాత్రమే ప్రకటించుటకు మిక్కిలిగఁ బ్రయత్నించుటలో భావమునకుఁ బూర్తిగ భంగమును గలిగించుచున్నారు. కావున నట్టి పాట సర్వజనామోదకరము కాకపోవుచున్నది. దాని కందఱును సంతసించుట లేదు. ఇఁక వారు మహాతురమునఁ బ్రకటించెడి విద్యామర్మములును, వారిప్రజ్ఞయు నెల్లరకుఁ దెలియకపోవుట సహజమేకదా. ఏలయన నవి యా విద్యయందుఁ బరిశ్రమచేసి నిపుణత్వము వడసినవారికే తెలియఁగలవు. అట్టి నిపుణులకుఁగూడ సులభముగఁ దెలియని విశేషములు నూతనవిద్వాంసుల గానమునందుఁ బెక్కు లుండును. అట్టి కేవలవిశేషములను జనసామాన్యముకొఱకుఁ బ్రయోగించుట గాయకునిదోషము కాని వినువారిదోష మెంతమాత్రమును గాదు. గానమును వినుటకు వచ్చువార లందఱును గానవిద్యానిపుణు లని గాయకుఁడు ను దలంచుట లేదు. కావున నది గాయకునిదోషమే యగుచున్నది. మఱియు సంగీతము సర్వజనోపయోగార్థ ముద్దేశింపఁబడినది కాని తద్విద్యాధికుల యానందముకొఱకె యేర్పడినది కాదు

ఈ ధర్మము ఒక్క సంగీతమునకే కాదు. చదువు, కవిత్వము, సాము, వైద్యము, జ్యోతిషము, గణితము, శిల్పము మొదలగు శాస్త్రము లన్నియు సర్వజనోపయోగార్థ మేర్పడినవే కాని యాయా విద్యలందు నిపుణులగువారి యుపయోగార్థ మేర్పడినవి కావు. ఆయా విద్యలవలని ప్రయోజనమును బడయఁగోరువార లాయా విద్యలందుఁ బరిశ్రమ చేయకయుండుట దోష మెంతమాత్రమును గాదు. ప్రజ్ఞాప్రకటనోద్యమంబున భావమునకు భంగముఁ గలిగించుటమాత్రము గాయకుని దోషము.

### గాయకదోషము.

గీ. ప్రజ లెఱింగెడి భావముల్ ♦ బాడు చేసి
ప్రజ్ఞఁ జూపఁ బెనఁగు గాన ♦ పాతకుండు;
ప్రజ్ఞ నెఱుఁగుట విద్యాధి ♦ పతుల కగును;
తత్ప్రయోజన మెల్లరఁ ♦ దనుపు చుండు.

ఇట్లు చెప్పుటచేత నాయావిద్యాధికులు జనసామాన్యమును దృప్తిపఱుచుటకుఁ దమతమ విద్యాధిక్యమును వదలుకొని హీనగాయకుని రీతిని బరిణమింపవలసినదా యని కొందఱకు సంశయము వొడమవచ్చును. దాని కిట్లు సమాధానమును జెప్పఁదగును. ఆయా విద్యాధికులు ఆయా విద్యల ప్రయోజనమును భంగపఱుపకయుండునంతవఱకుఁ దమ తమ విద్యాధిక్యమును జూపుకొనఁదగును. కాని తమ విద్యాధిక్యమును జూపుటకొఱకు విద్యాప్రయోజనమునకు భంగము గలిగింపఁగూడదు. ఇందున కొక దృష్టాంతముం జూడుఁడు. మన మొక ద్వారబంధమును జేసి యిమ్మని యొక శిల్పకారుని గోరునపుడు ఆతఁడు దాని కమ్ములపైఁ జిత్రములను విగ్రహములను జెక్కుచు వాని బూర్తిచేయు సందర్భమున హనుమంతునిబొమ్మకొఱ కొక కమ్మిని బొడుగుగను గరుత్మంతునిబొమ్మకొఱకు మఱియొకకమ్మిని వెడలుపుగను జెక్కి ద్వారబంధమును జెడఁగొట్టినయెడ దానియందలి శిల్పవిద్య యెంత స్తోత్రార్హమైనను అచట శిల్పవిద్యాప్రయోజనమునకు భంగము కలుగును. అనఁగా ద్వారబంధము చెడును. అట్టి విద్యవలన లాభము లేదు. ఇట్టులే సంగీతవిద్వాంసులును దద్విద్యాప్రయోజనమునకు భంగము కలుగకయుండునంతవఱకుఁ దమ విద్యాకౌశలమును జూపుకొనవలయును. వంటచేయునాతఁ డెంత సమర్థుఁడైన నంత రుచికరముగ వంటను జేయవచ్చును. కాని భోజనమునకు భంగముఁ గలిగించినచో నట్టి వంట వ్యర్థము. ఇట్లే యితర విద్యాధికులును దమ ప్రజ్ఞను జూపుకొనఁదగును. కావునఁ బై సంశయ మనావశ్యకము.

### విద్వద్ధర్మము.

ఆ. వె. ప్రజ్ఞఁ జూపు కొఱకు ♦ ఫలభంగ మొనరింపఁ
బండి తులకు నేనిఁ ♦ బనికి రాదు;
ఫలముఁ జెఱుపకుండఁ ♦ బ్రజ్ఞ నెంతగనైనఁ
జూపఁ దగును బ్రజల ♦ సుఖము కొఱకు.

ఇపుడు సంగీతము తెలియుట యనఁగా నర్థ మేమి తేలినది? పాడఁబడిన పాట యందలి భావము తెలియుట. ఆ భావము భాషచేఁ దెలుపఁబడుచున్నది. భాష మనుజులకు సహజము. అట్టి తన భాష తనకుఁ దెలియదనునెడఁ దాను మనుష్యకోటిలోఁ జేరకపోవలసివచ్చును. భాష సరిగాఁ బలుకఁబడనియెడ సరిగాఁ బలుకునట్లు కోరుఁడు. గానమనునది భాషాధ్వనులపైఁ జేయఁబడెడి మెఱుఁగు. మెఱుఁగుచేయుటచేఁ బదార్థ మెక్కుడుగఁ బ్రకాశించునా తెలియకపోవునా? తెలియకపోవుట లోకమందుఁ గలదా? ఇఁక 'సంగీతము నాకుఁ దెలియదు' అని పలికెడు మాటల కర్థ మేమి? అర్థమే లేదు. కావున 'సంగీతము మాకుఁ దెలియదు' అనుటకంటె 'సంగీతము మాకుఁ దెలియునట్లు పాడఁబడ లేదు' అనుట సార్థకముగ నుండును.

### పలుకఁదగిన విధము.

ఆ. వె. గాన మెఱుఁగ నేను ♦ గానంబు నెఱుఁగను
గాన మెఱుఁగ ననుట ♦ కంటె జనులు
గాన మెఱుఁగు నట్లు ♦ గాఁ బాడఁబడలేదు
కనుఁడి యనుట సార్థ ♦ కమగుచుండు.

'గానవిద్య యిచట భావప్రకటనమునకుఁ బ్రతిబంధకమగుచుండ నట్టిదానికొఱ కేల పెనఁగులాడవలయు? అడుసుఁ ద్రొక్కనేల? కాలిఁ గడుగనేల? గానమునే విడిచి వేసినయెడ మేలుగ నుండదా?' అని యిట నేరికైనఁ దోఁపవచ్చును. కాని యది సరి కాదు. వివిధేంద్రియములను దృప్తిపఱుచుకొఱకు వాని విషయములగు రూపరసగంధాదులయందు మానవప్రజ్ఞచేత నెన్నియో యభివృద్ధు లొనరించుచున్నాము. అనఁగా నేత్రేంద్రియమును దృప్తిపఱుచుటకు సృష్టివైచిత్ర్యము లెన్నియో యుండఁగా నాభరణములు, చిత్రపటములు లోనగు విశేషముల నెన్నిటినో సంపాదించుచున్నాము. రసనేంద్రియమును దృప్తిపఱుచుటకు సెనగలను కందులను దెచ్చి తినుతినుమని యెదుటఁ బెట్టుట లేదు. ఉప్పు పులుసు కారము తీపు మొదలగు రుచిభేదములను వానితోఁ

చేర్చుటచే వివిధములగు రూపముల నసంఖ్యాకములుగఁ గల్పించి వానిచేఁ దృప్తినొందించుచున్నాము. మిఠాయి దుకాణములే దీనికి దృష్టాంతములు. ఇట్టి మానవప్రజ్ఞయొక్క ప్రయోజనమును శ్రవణేంద్రియమునకుఁ గూడ లభింపఁజేయుట మనకు విధి. కావునఁ దదర్థమై మధురధ్వనిసంపాదన మొనర్పవలయు. అది గానవిద్యాసాహాయ్యంబున లభించును. ఇదియే గానవిద్యాప్రయోజనము. గాయకుని దోషముచేత నట్టి ప్రయోజనమునకు భంగము కలుగుచుండునపుడు తద్దోషనివారణమునకై ప్రయత్నింపఁదగునుగాని ప్రయోజనమును వదలుకొనఁ గూడదు.

### ఉత్తమమార్గము.

ఆ. వె. పరుల దోష ములను ♦ బట్టి స్వఫలమును
వదలు కొనుట యుచిత ♦ ఫక్కి కాదు;
దోష సమితి నడఁచి ♦ తోషదం బగు మేలుఁ
బడయఁ గోరు టెపుడుఁ ♦ బరమ పథము.

ఇచట నొక్క సంశయము చదువరులకుఁ గలుగఁదగియున్నది. అది సంశయము కాదు. పరితాపము. ఏమనఁగా మన చెంతనుండు స్నేహితులలో ననేకులు పాడుటను గూడ నెఱిఁగి యా గాయకుని గానమందలి సంగీతసాహిత్యములలోఁ గేవలభాషతోడ మాత్రమే యానందించుట గాక యాతని గానవిద్యాధిక్యమును గూడ నామూలాగ్రముగ గ్రహించి యానందించుచుండఁగా మన మా గానమందలి కేవలభాషతోడనే తృప్తినొందవలయుఁ గదా యని కొందఱు పరితాపపడుదు రని కన్పట్టుచున్నది. ఈపరితాపనివృత్తికై మహామంత్రప్రయోగమువలె నొక్క మహారహస్యార్థమును బ్రయోగింతుఁ జిత్తగింపుఁడు. సభలో గాయకుఁడు పాడుచుండఁగాఁ బదిమంది వినుచుండి రనుకొనుఁడు. వీరిలోఁ బదియవవాఁడు తొమ్మిదవవాని నుద్దేశించి తన మనస్సులో ని ట్లనుకొనుచుండును. "నే నెన్నఁడును పాడియే యెఱుఁగను. ఈతఁడు మొన్న బహిర్దేశమునకుఁ బోవుచు కూనరాగములను దీయుచున్నాఁడు. బహుశః సంగీత మీతనికిఁ దెలిసియుండును. ఈతఁడీ గాయకుని సంగీతము నంతను గ్రహించుచున్నాఁడు. నా కేమియుఁ దెలియుట లేదు." ఈ తొమ్మిదవవాఁ డెనిమిదవవాని నుద్దేశించి యిట్లు తలఁచుచుండును. "నాది కూనరాగపు సంగీతము. ఈతఁడు మొన్నఁ దన బంధువు లందఱును గ్రామాంతరమునకుఁ బోయినపుడు తలుపులు గడియలు పెట్టుకొని యొంటరిగ నింటిలోఁ జేరి పెద్ద గొంతుతో పెంకు లెగిరిపోవునట్లు రాగధోరణిగాఁ బద్యాలు పాడుచున్నాఁడు. ఈతనికి సంగీతము తెలిసియుండును. కావున నీతఁడీ గాయకుని గానము నంతను

గ్రహించుచున్నాఁడు. దీనిలో నా కేమియుఁ దెలియుట లేదు.'' ఎనిమిదవవాఁ డేడవవానిఁ గూర్చి యి ట్లనుకొనుచుండును. ''నాది చాటు సంగీతము. ఈతఁ డప్పు డప్పుడు భజనలలో తాళములు బ్రద్దలుకొట్టుచుండును. కావున నీతఁ డీ పాఠకుని గానము నంతను గ్రహించుచున్నాఁడు. నా కేమియుఁ దెలియుట లేదు.'' ఏడవవాఁ డాఱవవానిఁ జూచి యి ట్లనుకొనును. ''నాది భజనసంగీతము. ఈతఁ డైదాఱు సారాలుకూడా పాడుతాఁడు. కాఁబట్టి యీ సంగీతమంతా యీతనికి దెలుస్తున్నది. నా కేమియుఁ దెలియుట లేదు.'' ఆఱవవాఁ డైదవవానిఁ గూర్చి యిట్లు తలఁచును. ''నాకు సరళిస్వరములైనను బూర్తి కాలేదు. ఈతఁడు చిన్నప్పుడు రెండుమూఁడు గీతాలుకూడా నేర్చుకొన్నాఁడఁట. ఇప్పుడు పాడలేకపోయినను నేఁటి సంగీతము నంతను ఈతఁడు పూర్తిగ గ్రహించుచున్నాఁడు. నా కేమియుఁ దెలియుట లేదు.'' అయిదవవాఁడు నాల్గవవానిఁ జూచిఁ యి ట్లుద్దేశించును. ''నాది చిన్ననాఁటి చిన్నసంగీతము. అది చిన్ననాఁడే పోయినది. ఈతఁడు వీణ చింతయ్యగారి శిష్యుఁడఁట. అప్పుడప్పుడు పిడేలు గిస్తూవుంటాఁడు. ఇచట నందఱకంటె నెక్కువగాఁ దలఁ ద్రిప్పుచున్నాఁడు. ఈయన కీ గాన మంతయుఁ దెలియుచున్నది. నా కేమియుఁ దెలియుట లేదు.'' నాల్గవయాతఁడు మూఁడవ పురుషు నుద్దేశించి యిట్లు తలఁచును. ''నాది ఓనమాలసంగీతము. మా గురువుగారియొద్ద నాకు గీతాలైనను బూర్తి కాలేదు. ఈతఁడు వర్ణములుకూడను బూర్తిచేసి యిపుడు కృతులు చెప్పుకొనుచున్నాఁడు. కాఁబట్టి యీ పాట యంతయు నీతనికిఁ దెలియుచున్నది. నాకేమియు దెలియుట లేదు.'' మూఁడవయాతఁడు ద్వితీయపురుషు నుద్దేశించి యిట్లు తలఁచును. ''నాది బండపాట. ఎన్నివర్ణములు కృతులు చెప్పుకొనినను నాకు స్వరజ్ఞానము కలుగనే లేదు. ఈతఁడు స్వరకల్పనను బాగుగఁ జేయఁగలఁడు. పల్లవిని ధారాళముగఁ బాడఁగలఁడు. కాఁబట్టి యీ గానము నంతను ఈతఁడు గ్రహించుచున్నాఁడు. నా కేమియుఁ దెలియుట లేదు.'' ద్వితీయపురుషుఁడు ప్రథమునిఁ జూచి యిట్లు తలఁచును. ''నాది గ్రుడ్డిసంగీతము. ఎన్నాళ్లు పాడినను సంగీతములోఁ దూర్పు పడమర కూడా తెలియదు. ఈయనకు శాస్త్రజ్ఞానము కూడఁ గలదఁట. రాగములను బ్రస్తరింపఁగలఁడఁట. కాఁబట్టి నేఁటి గానము నంతను ఈయన గ్రహించుచున్నాఁడు. నాకుఁ దెలియుట లేదు.'' ఆ మొదటిపురుషుఁడు తనలోఁ దా నిట్లు తలఁచును. ''ఈయన క్రొత్తరాగములలోను క్రొత్తతాళములలోను బాడుచున్నాఁడు. మామూలుగాఁ బాడున పందఱకుఁ దెలియును గాని క్రొత్తవాని దెలిసికొనుట మిక్కిలి దుష్కరము. వానిని దెలిసికొనుటకు మార్గములు

మాత్రము శాస్త్రిమందుఁ గలవు. హఠాత్తుగ వినినమాత్రముననే తెలిసికొనుట కష్టము కదా. ఈ పాఠకున కిట్టి నూతనములు చాలగాఁ దెలిసియుండవచ్చును. అవి నాకుఁ దెలియవు;'' ఇట్టులు ప్రతిసభ్యుఁడును దనకుఁ దెలియదనియు నింకొకరికిఁ దెలియుచుండవచ్చుననియుఁ దలంచుచుండును. విద్యారహస్యములు వీరిలో నొక్కరికైనను దెలియుచుంట లేదని చెప్పవచ్చును. ఒక గాయకుఁ డొక నూతనరాగమును బాడునపు డందలి స్వరశ్రుతుల గ్రహించి, దాని యారోహణావరోహణములఁ దెలిసికొని, యది షాడవౌడవసంపూర్ణములలో నేదియగునో నిర్ణయించి, సంపూర్ణమైనయెడ డెబ్బదిరెండు మేళకర్తలలో నెన్నవదియగునో యరసి, షాడవౌడవములలోఁ జేరినయెడ నెన్నవమేళకర్తయందు జన్మించెనో అందు జన్మించిన 484 భేదములలో నెన్నవది యగునో కనుఁగొని, ఇందు వక్రగమనమే మైనఁ గలదేమో తెలిసికొని, రాగస్వరూపమును నిర్ణయించునట్టి సమర్థత ప్రకృతకాలపు గాయకనామధేయులలో నూట నొక్కనికైనఁ గలదని చెప్పుటకును సంశయముగనే యున్నది. పదునాలు తొమ్మిదు లెంతయో చెప్పుటకుఁ బావుగంట సేపు గుణించెడు నిరక్షరకుక్షియగు గాయకుఁడు హఠాత్తుగ నింత గుణకమును జేసి రాగస్వరూపనిర్ణయమును జేయఁగలఁ డని యెవ్వరు చెప్పఁగలరు? గాయకుఁడే దాని నెఱుఁగఁజాలకుండునపుడు తదితరుల కది తెలియలేదను పరితాపమేల? తమరు నుంతయు నభ్యసింపని విద్యయందుఁ గల మర్మములు తమకుఁ దెలియకుండుటయు నొక సంతాపకారణమేయగునా? అభ్యసించినవా రెంత గ్రహింపఁగలిగిరి? వా రెంత నేర్చుకొనిరో యంత గ్రహింపఁగలిగిరి. అభ్యసింపనివారిలోఁ గొందఱకుఁ గొన్ని రాగములు తెలియుచుండినను ఆ జ్ఞానము గ్రుడ్డివాని గ్రామసంచారజ్ఞానముకంటె నెక్కుడుగ నుండఁగలదా? కావున గానవిద్యారహస్యములు తమకుఁ దెలియలేదను పరితాప మనావశ్యకము. గానమం దెల్లరకును దెలియఁదగినది భావము. అది యితరులవలన వినుదానికంటె గాయకునివలన వినునప్పు డెక్కుడు మధురముగ నుండును. అట్టి మాధుర్యము ననుభవించుటే సర్వజనులును గోరఁదగినది. కావున గానమునుండి యెఱుఁగఁదగినది భావము, అనుభవింపఁదగినది ధ్వనిమాధుర్యము, ననియు గానవిద్యామర్మములతో శ్రోతలకు సంబంధ మెంతమాత్రమును లేదనియుఁ దెలిసికొని యా భావమాధుర్యములఁ గైకొని సర్వజనులును గానవిద్యాప్రయోజనము నొందుటయగాక గానము సర్వజనానుభవయోగ్య మను ధర్మము నుద్ధరింతురుగాక.

అయినను గాయకుఁడును, జంత్రవాద్యపరులును బొనరించు దోషములచేత నీ మాధుర్యభావములకుఁ దఱచుగా భంగము కలుగుచున్నది. దానిచే శ్రోతలు గానము

నెడ విముఖులగుచున్నారు. దోషనివారణ ప్రయత్న ముచితకార్యమగును గాని విముఖులగుట సరసముకాదు. ఆ దోషములను గూర్చి యనంతరోపన్యాసములఁ జూడఁదగును.

గీ. సభను గూర్చుండునప్పుడే ♦ సకలమైన
తెలివి తేటలఁ బోనాడి ♦ దీను వట్లు
నేనెఱుంగను గానంబు ♦ నేనెఱుంగ
నంచు స్మరియించు టది మహా ♦ నర్థకంబు.

తెలియఁదగిన సంగీతము.

మ. అకటా! గానమెఱుంగలేమనెడి య ♦ న్యాయంపు దుశ్చింతచే
సకలార్థప్రదమైన గానమును లే ♦ శం బాలకింపంగఁ బో
వక యల్లాడెద రేమిపాపమిది! నా ♦ పల్కొక్కటాలించి యం
దుకొనంజూడుఁ డెఱుంగ నేర్తు ధ్వనిమా ♦ ధుర్యార్థభావంబులన్.

---

## 10. గానము.

శ్రీమ దఖిలలోక నిర్మాణావన నిబర్హణ చణుండగు పరమేశ్వరుండు ఆహారనిద్రా భయాది వివిధగుణ సహితంబగు సమస్తజంతుజాలంబునకును భావప్రకటనసాధనంబుగఁ గంఠధ్వని నొక్కటి నొసఁగియుండుటయ గాక సృష్టపదార్థంబులకెల్లఁ బ్రభుఁడుగ నుండఁదగిన మనుజున కా కంఠధ్వనియం దారోహణావరోహణాది భేదకల్పనాసామర్థ్యమును, జిహ్వయందు వర్ణోచ్చారణ సౌకర్యమును నదనముగ నొసఁగియున్నాఁడు. ఈ రెంటికిని గంఠధ్వని యనఁబడు నాదము మూలాధారము. నాదమే లేనిచో నారోహణావరోహణాది భేదములును లేకపోవును; వర్ణములును లేకపోవును. ఈ రెండు సౌకర్యములును భావప్రకటనార్థ మొసఁగఁబడినవే. ఉప్పును బప్పును నేకముగఁ జేరి యుపయోగింపవలసిన వయ్యు నుప్పు సముద్రతీరమునను బప్పు పొలమునందును బండింపఁ బడునట్టులే యేకకార్యసాధనంబులగు పై రెండుశక్తులును రెండు శాస్త్రములచేత వేఱు వేఱుగ శాసింపఁబడి యభివృద్ధి నొందింపఁబడుచున్నవి. అందు ధ్వనిభేదములనుగూర్చి చెప్పునది సంగీతశాస్త్రము; వర్ణభేదములనుగూర్చి చెప్పునది సాహిత్యశాస్త్రము. ఈ రెండుశాస్త్రములును జేరి చేయవలసిన కార్యము భావప్రకటనము. భావమందు సాహిత్యశాస్త్రము క్రొత్తక్రొత్త విషయములఁ దెచ్చి చేర్చుచుండును; సంగీతశాస్త్ర మా విషయములకు రంజకత్వమును గలిగించుచుండును. ఇట్టు లా (సాహిత్య) భావములకు సంగీతశాస్త్రసాహాయ్యంబున వన్నెవెట్టి ప్రయోగించుటే గాన మనఁబడుచున్నది.

గా న ము.

గీ. భాష తెలిపెడి బహువిధ ♦ భావ ములను
వన్నె వెట్టఁగ ద్వాదశ ♦ ధ్వనులఁ జేర్చి
రంజకంబుగ నొనరించి ♦ ప్రజల మదిని
నాటుకొనఁజేయు టదియె గా ♦ నంబు జగతి.

ఇట్టి గానమునకుఁ గల శక్తులు రెండు. చిత్తమును రంజించుట, సమకాలజ్ఞానమును గలిగించుట. ఇవి క్రమంబుగ శృతి లయ లనఁబడు గానభాగములచే నెఱవేర్పఁబడుచున్నవి. ఏ మనుజుని కంఠనాళమందైనను గలిగెడి ధ్వనిభేదములు పండ్రెండు. వీనికే శ్రుతు లని పేరు. వీనిని ప్రస్తరించుటచేతనే జనక రాగము లనఁబడెడి 72 సంపూర్ణ రాగములును, వానిలో నొక్కొక్కదానియందు షాడవౌడవ భేదంబులచే 484 జన్యరాగములును, బిమ్మట లెక్కలేని వక్ర రాగములును గలిగినవి. తాళాంతర్వర్తి యగుచు ఘాతఘాతమధ్యను సమదీర్ఘ మగుచు నుండెడి కాలప్రమాణమునకు లయ యని పేరు. దీనికొఱకే సప్తతాళంబులు, నూటొక్కతాళములు, అష్టోత్తర శతతాళంబులు లోనగు ననసంఖ్యాకంబులగు తాళంబులు దశప్రాణయుక్తముగఁ గలిగినవి. (ఈ శృతి లయలను గూర్చి యెక్కుడుగ నెఱుఁగఁగోరువారు గానసారమందలి 4, 5, 8, 9 సంఖ్యల యుపన్యాసములఁ జూడవలయును.) గానకార్యము చిత్తరంజన మనుటకంటె భావబోధన మనుట సమంజసము. ఏలయన రౌద్రశోకాదులఁ దెలుపుపాటలఁ బాడునపుడాయారసములనే గాన ముద్బోధించును. గానమువలనఁ గలిగెడి రసోద్బోధనముచేఁ బాటలయందలి భావము శ్రోతల హృదయమందు నాటుకొనును. అయినను గానము శ్రోతృచిత్తసుఖావహములగు కార్యములందే తఱచుగఁ బ్రయోగింపఁబడుటచే గానకార్యము చిత్తరంజనమే యని చెప్పఁబడుచున్నది. చిత్తమును రంజించుటచేత భావమందు శ్రోతలకు మిక్కిలిగ ననురాగమును గలిగించును. భావబోధనకార్యము భాషదైయుండఁగా గానధ్వనుల కా కార్యమందు సంబంధము కలదా యని యేరైన సంశయింపవచ్చును. ఈ దృష్టాంతముం జూడుఁడు. ఒక యధికారి వాకిట నొక సేవకుఁడు కలఁడు. అచటికి నిఱుపేదయగు నొక బిచ్చగాఁడు వచ్చి యా సేవకునితో నిట్లు మొఱ పెట్టుకొనుచున్నాఁడు. "అయ్యా! నాకు రెండుదినములనుండి యాహారము చిక్కలేదు. ప్రాణములు సోలి పోవుచున్నవి. ఇచటినుండి యొక్క యడుగైన నడువఁజాలక యున్నాను. పట్టెఁడన్నమును బెట్టి, చిట్టెఁడు నీళ్లను బోయుదువేని నాజీవము నిలుచును. లేనిచో నా ప్రాణముల నిచటనే విడువవలసినవాఁడ నగుదును." ఈ సేవకుఁడు

లోనికిఁ బోయి యీ మాటలను జాలిఁబుట్టించెడి కంఠధ్వనితో నధికారికి విన్నవించు నెడ జాలి పుట్టును; వీలైనయెడ సాయ మొనర్చును. కాని యాతఁ డించుక కఠినమగు కంఠధ్వనితోడ నిట్లు పలుకు ననుకొనుఁడు. 'అయ్యా! బిచ్చగాడండి. వాకిటిలోఁ గూర్చున్నాఁడండి. అన్నమును బెట్టుమనుచున్నాఁడండి. లేనిచో నిచటనే చచ్చిపోయెద ననుచున్నాఁడండి.'' ఈ మాటలు బిచ్చగాఁడు పలికినవే యయినను వానితోఁ జేర్పఁబడిన ధ్వనులు మాఱుటచేత నధికారికి జాలి పుట్టకపోఁగా నాగ్రహము కలుగుట నిశ్చయము. కావున దీనిచేత నేమి తెలియుచున్నది? భాషయందలి భావమును సరిగా బోధించుటకు ధ్వనిభేదముల సాహాయ్యము మహావశ్యక మని తెలియుచున్నది. సహజములగు కేవల ధ్వనులే భావప్రకటనమం దింత ప్రాముఖ్యమును వహించుచుండఁగా సమర్థమగు సంగీత విద్యచే మెఱుఁగిడఁబడెడి ధ్వను లెంతచేయఁగలవో వేఱుగఁ జెప్పవలయునా? అక్కఱ లేదు. ఇట్లు భాషాభిప్రాయములను బ్రజాహృదయములందుఁ జక్కఁగ నాటుకొనునట్లొనరించుటే సంగీతప్రథమార్థభాగ మగు శ్రుతి యొనరించెడి చిత్తరంజనముయొక్క ప్రయోజనము. ఇఁక ద్వితీయార్థభాగమగు లయ యొనరించెడి సంఘీభావము లోనగు సంఘోపకారములను గూర్చి యీ గ్రంథమందు విద్యార్థులను గూర్చిన యుపన్యాసమునఁ జూడనగును.

ఈరీతిని సర్వజనరంజన సమర్థంబును మహాసంఘోపకారకరంబును నగు గానవిద్యను కేవల స్వప్రయోజకత్వప్రకటనాపేక్షావివశులగుచుఁ గొందఱు గాయకులు బహువిధంబులుగ నిర్వినియోగము చేయుచున్నారు. మఱికొందఱు సామాన్య జనచిత్తరంజనార్థము నీతిబాహ్యకీర్తనములఁ బాడుటందును, నింకఁగొందఱు విటవిటీజనంబుల మోసగించుటందును దుర్వినియోగము చేయుచున్నారు. ఈ కారణములచే గానము మాకుఁ దెలియ దని కొందఱును, గానము ప్రజలను నీతిబాహ్యవర్తనులుగాఁ జేయు నని మఱికొందఱును, సంగీతము పనిపాటలఁ జెఱచు నని యింకఁగొందఱును దలఁచి యీ విద్యను వదలుకొనుచున్నారు. ఇది దేశమునకుఁ గలిగిన మహానర్థకము. దీనికిఁ గారణము గాయకదోషములు. కావున గాయకుఁ డొనరించు వివిధదోషములను గూర్చి యిచటఁ దెలుపుచున్నాఁడను.

### మోసము.

ఉ. గాన మెఱుంగ లేమనుచు ♦ గానము నీతివిరోధమంచునుం
గాన మదేరికిన్ సకల ♦ కార్యవిభంజకమంచు నెందఱో
కానక, మోసపోయి, బహు ♦ కార్యసమర్థనదక్షమైన యీ
గానమునుం ద్యజించెదరు ♦ గాయకదోషపరీతచిత్తులై.

ఈ విషయమును వ్రాయుటకుఁ బూనుటతోడనే కలము వడఁకుచున్నది. నేను వ్రాయునది యథార్థమే యైనను దీని యాథార్థ్యమును గ్రహించునంతలోపలఁ గొందఱు మనస్సులు నొచ్చునుకదా యనియు, గాయకులయొక్క నిజమగు విద్యాప్రకటనప్రయత్నమును గూడ సందర్భవశమున నిట దోషముగ నిరూపింపవలసి వచ్చుచున్నదికదా యనియు నా మనస్సునకుఁ దోఁచుటే యీ కలము వడఁకుటకుఁ గారణము. అయినను మానవయత్నముయొక్క ఫలాఫలంబులు దైవాధీనములేయైనను ఈ వ్యాసమందు నా ప్రయత్నము మాత్రము గాయకసంఘమును జక్కఁబఱిచి వారిప్రజ్ఞలని ప్రయోజనమును జనసామాన్యమునకు లభింపఁజేయుటే కాని పరనిందాపేక్షమాత్రము కాదు. కావునఁ జదువరులు దీనిని సాంతముగఁ జదువునటులకును నన్ను నున్నింతురుగాక. ఇందలి విషయము లాంధ్రగాయకులకే మిక్కిలిగ సంబంధించును.

1. పల్లవి:—ఒక సంగీతసాతకుని సుమారు రెండుగంటలకాలము తన సంగీతముచేత మనలఁ దృప్తిపఱుచుట కేర్పఱచుకొనినయెడ నాతఁడా రెండుగంటలకాలములో సుమారు గంటన్నరసేపు పల్లవిని బాడును. తక్కిన యరగంటయుఁ గృతులను బాడును. దానిలోనే పదినిమిషముల కాలమును మిగిల్చి యొకటిరెండు పదములులోనగువానిని గొందఱు పాడినను అట్లు పాడుట విద్వద్ధర్మముకాదని మఱికొందఱు గాయకులు పల్కుచుందురు. పల్లవిని బాడుటకుఁ బూర్వము కొంతసేపు ఆపల్లవిని బాడఁదలఁచిన రాగమును విరామముగాఁ బాడుటకూడఁ బల్లవిలోనిభాగముగనే సంప్రదాయసిద్ధముగఁ బరిగణింపఁబడుచున్నది. 1 గాయకుఁ డీ రాగము నొక యరగంటసేపు పాడును. దీనియందు తాళనియమములేక గాయకుని విద్యాధిక్యమును దెలిపెడి యలంకారసహితములైన ధ్వనిసముదాయరూపములు గల రాగసంగతులు మాత్రమే యుండును. కాని జనసామాన్యమునకు వలసిన భాషాసహితమైన భావ మిం దుండదు. 2 పిమ్మట నొక యరగంటసేపు పల్లవిని బాడును. పల్లవిని బాడుట యనఁగా సుమారు అయిదాఱు పదంబులుకల యొక చిన్నవాక్యమును దీసికొని, పైరాగసంగతులను తాళదశప్రాణబద్ధములగున ట్లొనరించుచు, వీని నసంఖ్యాకంబులుగం బై యైదాఱుశబ్దములతోడఁ బ్రత్యేకరము ప్రక్కను వేఱువేఱువిధంబులుగఁ జేర్చుచు నొక్క యరగంటసేపు పాడును. దీనియం దనుపల్లవియుఁ జరణంబులు నుండవు. ఇందలి శబ్దములు భావసహితములే యైనను ఈ యైదాఱుశబ్దము లరగంటసేపు వినుటకుఁ జాలియుండవుగనుకను, వీనిలో శబ్దమధ్యమునను రాగసంగతుల మిక్కిలిగ నిఱికించుటంజేసి స్వరూపము చెడి యాశబ్దములు కూడ వినువారలకుఁ దెలియఁబడవుగనుకను ఈ పల్లవిభాగముకూడ

భావరహితమే యని చెప్పఁదగియున్నది. 3 అంతట స్వరకల్పన నొక యరగంట చేయును: ఇందు దాదాపుగఁ బై రాగసంగతులనే స్వరరూపముగఁ బ్రయోగించి చూపును. (దీనింగూర్చి గానసారగ్రంథమున 15వ యుపన్యాసమును జూడనగును.) ఇట్లు రాగము, పల్లవి, స్వరకల్పన యను మూఁడుభాగములు కల దీనినే పల్లవిపాట యందురు.

'ఉ. పల్లవిమాత్ర మెత్తి యను ♦ పల్లవియుం జరణంబులేక యం
దల్లెడ రాగసంగతు ల ♦ హీనగతిన్ స్వరకల్పనంబు రం
జిల్లఁగఁ దొంటిపద్ధతిని ♦ జిట్టలతోఁ బనిలేక యంతయుం
గొల్లగ నాశుధార నొన ♦ గూర్చుటె పల్లవిపాట నాఁబడున్.' గానసారము.

ఈ పల్లవిపాటపాడెడి గంటన్నరసేపులోను జనసామాన్యమునకుఁ దెలియఁ దగిన భావము పూర్తిగ నుపేక్షింపఁబడుచున్నది. కావున నిది వారికి నుంతయు సంతోషమును గలిగించుట లేదు. ఒకవేళ నిందలి మధురధ్వనులను విని యానందింపఁ గూడదా యందురేమో. అదియు లభించుట లేదు. ఆ మాధుర్యమునకుఁ గూడఁ భంగము గలిగింపఁబడును. దానిఁగూర్చి యీ విషయానంతరమందుఁ బ్రత్యేకముగఁ దెల్పఁబడును. ఈ పల్లవిపాటయందుఁ బాటకుని విద్యాధిక్యముమాత్రము పూర్ణముగ వెల్లడియగుచుండును. కాని యా విద్యాధిక్యము జనసామాన్యమునకేకాక గాయకసామాన్యమునకుఁ గూడ గ్రహణసాధ్యము కానేరదు. ఈ పల్లవిపాట గాయకుని గానవిద్యానుభవమును బరీక్షించుట కుద్దేశింపఁబడినది.

''గీ. తాళ దశవిధులను నుంత ♦ తలఁగకుండ
రాగసంగతులను గూర్చి ♦ రక్తిఁ జేర్చి
చాల స్వరకల్పనము సేయు ♦ జ్ఞానధనున
కీయఁ బల్లవి తగును బ ♦ రీక్షకొఱకు.'' గానసారము, పుట 64.

ఇట్లు పరీక్షావసరంబునఁ బరీక్షాధికారుల యెదుటఁ బ్రయోగింపఁదగిన తన గానవిద్యాకౌశలమును జనసామాన్యము నెదుటఁ బ్రయోగించుటచేత నీ గాయకుఁడు అసమయప్రలాపం బను దోషమును గావించుచున్నాఁడు.

ఆ. వె. విసిగి విసిగి ప్రజలు ♦ విశ్రాంతిఁ గోరుచు
నాసఁ జెంది గాన ♦ మంచు రాఁగఁ
బ్రజ్ఞఁ జూపఁ బెనఁగు ♦ పాఠకు శ్రమ మెల్ల
నసమయప్రలాప ♦ మగును గాదె.

2. కృతులు:—గానసభయందు గాయకుఁడు పాడెడి మఱియొక భాగము కృతులు. ఇవి త్యాగరాజాది ప్రామాణిక గాయకులచే రచియింపఁబడి, వానియందలి సంగతు లన్నియు స్వరపఱుపఁబడియున్నవి. ఇవి కేవలముగ దైవభక్తిని మాత్రమే బోధించున వైనను బూర్తిగ భావసహితము లయియే యున్నవి. కాని యీ గాయకుఁడు తనకు భాషాజ్ఞానము లేకపోవుటచేతను, మఱియు నాంధ్రభాషాక్షర జ్ఞానమే లేని ద్రావిడులు మొదలగు నన్యదేశస్థులనుండికూడఁ దాను గొన్నిటి నేర్చియుండుటచేతను, గానవిద్యాప్రయోజనమును దా నెఱుఁగకపోవుటచేతను దాను బాడెడి పాటల యర్థమునుగాని భావమునుగాని తాను దెలిసికొనకపోవుటయేగాక వినువారికిఁగూడఁ దెలియకపోవునట్లు పాడుచున్నాఁడు. అనఁగా శబ్దములను స్ఫుటముగఁ బలుకక నంగి మూఁగ ముద్ద నత్తిమాటలుగ నుచ్చరించుట, మఱియు నపశబ్దోచ్చారణచేయుట, వాని నర్థవిహీనముగ మార్చుట, స్వప్రయోజకత్వప్రకటనయందే తన లక్ష్యము నంతను నిలుపుట, పాటయందలి భావబోధకపదములను వినువారు మఱచిపోవునంతదీర్ఘకాలము పాటమధ్యను స్వర రాగ జతులను బ్రయోగించుట, పాటయందలి భావమునకు విరోధముగ నుండునట్లు తన దృష్టిని ముఖవిలాసమును గంఠధ్వనిని వికృతముగను నస్వాభావికముగను మార్చుట, ఎదుటివారల కసహ్యముగ నుండునట్లు తన కరశిరంబులతోడ వికారాభినయములఁ జేయుట మొదలగు దోషంబులను దానొనరించుటచే పాటయందలి శబ్దార్థభావములు వినువారల చిత్తంబులకు గోచరింపక యుండునట్లును వికారనేత్రముఖాభినయములచే రసాభాసము జనించునట్లును జేయుచున్నాఁడు. ఇది గాయకుఁ డొనరించెడి అనర్థక కార్యాచరణం బను దోషము.

కం. అర్థము భావము నెఱుఁగక
వ్యర్థక్రియ లాచరించి భావము నెల్లన్
వ్యర్థ మొనర్చెడి నేత య
నర్థకకార్యాచరణము నాఁబడు జగతిన్.

3. గాయకుఁ డెన్నిదోషములఁ జేసినను గానముయొక్క రంజకత్వమునకు భంగము కలుగనియెడ శ్రోతలా కేవలధ్వనిమాధుర్యమునైనఁ గొని యానందింతురు. కాని గాయకుఁడు ప్రజ్ఞాప్రకటనోద్యమంబున దాని మాధుర్యమునకుఁ గూడ భంగమును గల్గించుచున్నాఁడు. ఎట్లనఁగా:—సరిగమపధని యను సప్తస్వరములును ధ్వనిభేదముల నామములు. గాయకుఁడు రాగమును బాడునపు డా ధ్వనిభేదములను ధ్వని వములతోడను, స్వరకల్పనమును జేయునపు డా ధ్వనిభేదములనే స్వరరూపమునను

ప్రయోగించును. ఈ రాగస్వరకల్పనముల రెండింటియందును గాయనుఁడు మధురధ్వని సముదాయములను గల్పించుటకు బదులుగాఁ గంఠధ్వని తిరుగఁగలుగునంత వఱకు రాగ సంగతులను, నాలుక యుచ్చరింపఁగలుగు వఱకు స్వరకల్పనమును జేయఁ బ్రయత్నించు చున్నాఁడు. 'సరి' యను రెండు ధ్వనులే జేకొని యి ట్లుచ్చరించును. ససరిరి సారిరి సరీరి ససరిస సరిసా సారిస సరిరిస, రిససరి రీసరి రిసరీ రిసారి రిరిసరి, రిసాస రిరీస రిరిరిస రిససస రిరిరిస రిరిరిరి ససస అనుచు ని ట్లింక నెన్నియో భేదంబులఁ గల్పించును. ఇట్లు రాగస్వరములు రెంటియందును దన శక్తికొలఁదిని గలుగఁదగినన్ని భేదములఁ గల్పించుటే యాతని ప్రయత్నము కాని మధురధ్వనులఁ గల్పించుట కాదు. దీనిచేత నీతని గాన మందుఁ బ్రజ్ఞ యెంతయెక్కుడుగ నుండినను దాని రంజకత్వమునకు భంగము కలుగు చున్నది. మహమ్మదీయగాయకులు తమ గాత్రగానమునందును, ఆంగ్లేయగాయకులు తమ యంత్రగానమునందును మాధుర్యభాగమునకు మిక్కిలిగఁ బ్రాముఖ్యము నిచ్చు చున్నారు. దానిచేత నవి రెండును గడుంగడు శ్రావ్యము లగుచున్నవి. వాని యందలి భావము తెలియకుండినను గానము నెఱుఁగమనెడి మన యాంధ్రు లెల్లరును గూడ వానిని విని యానందించుచున్నారు. ప్రజ్ఞాభాగమందు మాత్ర మాంధ్రగాయకులు వారిని సర్వ విధంబుల మీఱుచున్నారు. ఇంతటి ప్రజ్ఞావంతుఁడయ్యుఁ దత్ప్రజ్ఞాప్రకటనోద్యమంబున గానమాధుర్యము నుపేక్షించుటంజేసి అనవశ్యకకార్యోదాసం బనెడి దోషము నొనరించుచున్నాఁడు.

ఈతఁ డొనరించెడి యంత్రవాద్యవిషయికదోషము నెఱుంగుటకు దాని గూర్చిన ప్రత్యేకోపన్యాసమును జూడఁదగును. ఒకానొక గాయకుఁడు పెండ్లియింటిలో నూతనవధూవరులయెదుటఁ బాడుటకుఁ గోరఁబడి రాముఁ డరణ్యమునకుఁ బోవుతతిని కౌసల్యాదుఃఖమును దెల్పు పాటను బాడుచున్నాఁడు. ఇట్టి గాయకదోషములచేత గానము సర్వజనామోదకరము కాకపోవుచున్నది. ఇట్టి దోషములకు లోనుగాక పాడెడి గాయకులు దేశమం దొకరిద్దఱకంటె నెక్కుడుగ లేరని చెప్పఁదగియున్నది. స్త్రీల గానమం దీదోషములలో ననేకము లుండనేయుండవు. ముఖ్యముగ ముఖవికారదోష ములు వారియందుఁ గలుగవు. కంఠమాధుర్య ముండును. అయిన నట్టి గాయనీమణులు జారత్వమునే జీవనోపాధిగఁ గల వేశ్యకులజులుగ నుండుటచేత వారి గానము దుర్విని యోగ మగుచుండు నని యాధునికవిద్యాధికులు కొందఱు వారి గానమును నిరసించు చున్నారు. ఇతరస్త్రీలం దిటువంటి గాయనీమణు లీదేశమున నింతవఱకు వెలువడుట లేదు. ఆ విషయ మెట్టులున్నను వారియందలి ముఖవికారదోషరాహిత్యాతిశయము

పురుషుల కసాధ్యము మాత్రము కాదు. వినువార లా దోషమును నిరసింపక పోవుటచేత గాయకులం దది ప్రబలుచున్నది. క్రయికుల ననుసరించి విక్రేతలు వత్తురు. కావున నీ దోషనివారణమునకై తొలుతఁ బ్రయత్నింపవలసిన వారు శ్రోతలు. వా రీ సందర్భమున గాయకుని గోరఁదగిన విషయములు రెండు; భావబోధ, చిత్తరంజనము. వీనిచే శ్రోతలఁ దృప్తిపఱుచుటకు గాయకుఁ డవలంబింపఁదగిన సులభమార్గ మేమనఁగాఁ దన పాటను సహజముగ మాటలాడునట్లే పాడవలయు. అనఁగా గానముకొఱకుఁ దన కంఠధ్వనియందుఁ గాని ముఖవర్చస్సునందుఁ గాని నూతనవికారములఁ దెచ్చిపెట్టుకొనక యూరక మాటలాడునప్పటివలెనే పాటయందలి సుఖదుఃఖాదిభావముల కనుకూలములైన కంఠధ్వనితోడను ముఖవికారములతోడను బాడవలయు. అది యుత్తమపద్ధతి. అది తనకుఁ జేతకానియెడ నన్నిపాటలను సంతోషమును దెలిపెడి చిఱునవ్వుమోముతోడఁ బాడవలయు. పాటయందలి విషయము సంతోషమే కానిండు; శోకమే కానిండు; రౌద్రమే కానిండు. తాను జిఱునవ్వుతోడనే పాడవలయు. దానియందలి భావము పాడైనను సభ్యులు మధురధ్వనులనైన సంతోషముతోడ వినుదురు. కాని గాయకు లట్లు చేయరు. ఒకఁడు పాడునంతసేపును ఏడుపుమొగముతోడనే పాడును ఇంకొకఁడు రౌద్రముఖముతోడఁ బాడును. వేఱొకఁడు వెక్కిరించునట్లు పాడును. మఱియొకఁడు బెదరినట్లు పాడును. ఇట్లు పాడుటచే భావమునకు రసాభాస మేర్పడును. వీరిలోనే కొంద ఱా పాటయందలి వేఱువేఱు రాగసంగతుల నుచ్చరింపఁజాలక గ్రుడ్లుఱుకఁబడఁగా, మెడనరములును ప్రక్కప్రేగులును బైకుబుకఁగా గిలగిలగిలఁ గొట్టుకొనుచుఁ బాడుదురు. అట్టి పాటను వినునప్పుడు శ్రోతలకు సంతోషము కలుగుటకుఁ బదులుగ జాలి కలుగును.

---

కావున గాయకులు తమ పాట నంతను సహజముగఁ బల్కునట్టులు పాడుట యుత్తమపద్ధతి. కాని సో సంతోషముతోనైనఁ బాడుట ద్వితీయపద్ధతి. శ్రోత లా గాయకులందలి వివిధదోషములచేత నిరుత్సాహమును జెందక తద్దోషనివారణమార్గముల నవలంబించి గానవిద్యాఫలంబుల నందుదురుగాక.

### గాయకులు.

సీ. తలత్రిప్పి, చెయిత్రిప్పి, ♦ తంబురఁ ద్రిప్పియు - సాము చేసినరీతి ♦ సాఁగి సాఁగి
పెదవులు మూతియుఁ ♦ బిగఁబట్టి యికిలించి - నెమరువేయుచు నట్టె ♦ నీల్గి నీల్గి
బెదరు, విస్మయంబు, ♦ విసువును దుఃఖమ్ము - బడెడికీతి మొగంబు ♦ మార్చి మార్చి
నంగి మూఁగ ముద్ద ♦ నత్తిమాటలతోడ - శబ్దార్థ భావముల్ ♦ చంపి చంపి

గీ. పాతకుల మంచు నపకీర్తిఁ బడుట కంటె
[1] సహజముగఁ బల్కు రీతిని, [2] సంతసమున
మాటలాడెడి రీతి శ్రమంబు లేక
పాడి, గాయకుల్ సత్కీర్తిఁ బడయరాదె?

## 11. జంత్రవాద్యములు.

వాద్యములు నాలుగు విధములు. తంత్రీవాద్యములు, ముఖవాద్యములు, చర్మవాద్యములు, కాంస్యవాద్యములు. వీణ, ఫిడీలు, సారంగి లోనగునవి తంత్రీవాద్యములు. పిల్లనగ్రోవి, సన్నాయి మొదలగునవి ముఖవాద్యములు. డోలు, మృదంగము లోనగునవి చర్మవాద్యములు. తాళము, ముక్కోణము మొదలగునవి కంచువాద్యములు. ఇందలి తంత్రీముఖవాద్యములు రెండును సంగీతప్రథమార్థభాగ మగు శ్రుతి నాశ్రయించుచు, ద్వాదశశ్రుతి కల్పనా సమర్థము లయియుండును. మఱియు గాత్రపుఁబాటయొక్క (అక్షరసంబంధములేని) కేవలధ్వనిరూపమును అచ్చునఁగొట్టినట్లు రూపపటము (Photograph) వలెఁ గనఁబఱుచుచుండును. రూపపటమునకు జీవము లేనియట్లు లీధ్వనిరూపమునకు స్పష్టభావము లేకయుండును. చర్మవాద్యములు సంగీతద్వితీయార్థభాగ మగు లయ నాశ్రయించుచు, నారోహణావరోహణరహితము లగు కేవలధ్వానులను దాళదశప్రాణానుగుణంబుగఁ గల్పింప సమర్థము లగుచుండును. కంచువాద్యములు లయను మాత్రము సూచించుచు బహుగాయకులను బహువాద్యగాండ్రను నేకమార్గమున నడపించుటకు బహిర్లక్ష్యస్థానములుగ నిలుచుచుండును. వీనిలో మృదుధ్వానులుకలిగి యొక్క గృహమునందలివారికి మాత్రము వినఁబడఁదగియుండు తంత్రీవాద్యములును, చర్మవాద్యములందలి మృదంగము తబలా లోనగునవియు, కంచువాద్యములందలి చిఱుతాళము లోనగునవియు మొదటితరగతిగను, కఠినధ్వానులుకలిగి యొక్క వీధియందలివారి కందఱకు నేకకాలమున వినఁబడఁదగిన ముఖవాద్యములు, చర్మవాద్యములందలి డోలు ఢక్క భేరి మొదలగునవియు, కంచువాద్యములందలి పెద్దతాళంబులు లోనగునవియు రెండవ తరగతిగను విభజింపఁబడియున్నవి. వీనిలో మొదటితరగతివాద్యములు గాత్రగానమునకు సాయంబుగ నుండుట కుపయోగింపఁబడుచున్నవి. రెండవతరగతివాద్యములు వివాహాది శుభకార్యములందును, ఊరేగింపులయందును, రణరంగములందును బహుజనులకుఁ దెలివిడికొఱకును, ఉత్సాహజనకముగ నుండుకొఱకును, మార్గదర్శకము లగుటకొఱకును ఉపయోగింపఁబడుచున్నవి. ఈ చతుర్విధవాద్యములును యంత్రవాద్యములు జంత్రవాద్యములు నని రెండు పేళ్లఁ బిలువఁబడుచున్నవి.

జంత్రవాద్యములు.

గీ. జగతిఁ దంత్రీముఖంబులఁ ♦ జర్మమునను
గాంస్యమున వాద్యములు నాల్గు ♦ గతులఁ గలిగె;
గాత్రగానంబునకు రక్తిఁ ♦ గలుపుఁ గొన్ని;
కడమ వనుకూల మగు వీధి ♦ కార్యములకు.

గాత్రధ్వనులందు సహజమాధుర్య ముండుట తఱచుగ సంభవింపదు. కావున గాత్రగానమందుఁ గొంత మాధుర్యమును జేర్చుటకై తంత్రీవాద్యములు కల్పింపఁబడినవి. కొందఱు గాయకులు జంత్రగాత్రముల సమంబుగ గానము సేయఁగలిగియుందురు. వీర లుత్తమగాయకులు. కేవలగాత్రగానమున నిపుణులగువారు మధ్యమగాయకులు. కేవల జంత్రగానమున నిపుణులు జంత్రవాద్యపరులు. ఉత్తమగాయకులందు జంత్రగాత్రముల రెంటిని నడపించు మన స్సొక్కటిగనే యుండుటచేత వాని గాన మభేదమగుచు నొక్కటిగనే యుండును. మధ్యమగాయకులు మాత్రము ధ్వనిమాధుర్యముకొఱకు కేవల జంత్రవాద్యపరుల సాహాయ్యము నపేక్షించుచుందురు. ఇగట బుద్ధులు రెండగుటచేత జంత్రగాత్రముల గానము హెచ్చుతగ్గులుగ నుండును. గాత్రపుఁబాఠకుఁడు లభింపనపుడు కేవలజంత్రగానమును విని కూడఁ గొంత యానందమును జెందుచున్నారు. ఇది రూపపట దర్శనమాత్రమున మూలపదార్థస్ఫురణ కలిగి కొంత యానందము లభించునట్టులే యుండును. తొలుత మూలపదార్థపరిచయము లేనిచో నట్టి స్ఫురణమును, స్ఫురణమువలని యానందమును గలుగనే కలుగవు. అపుడు రూపపట మొక నిరర్థక ప్రతిమ యగును. కేవల జంత్రవాద్యములందలి ధ్వనిరూపముల స్థితియు నిట్టిదే యని గ్రహించునది.

తంత్రీవాద్యములు.

కం. అందఱ కంఠస్వరముల
యందును మాధుర్యసిద్ధి ♦ యమరని కతనన్
బొందుగఁ దంత్రీవాద్యము
లందిడు మాధుర్య మెప్డు ♦ నఖిలవిధములన్.

చర్మవాద్యములందలి ధ్వనులకు శ్రుతిసంబంధము లేకయుండినను ఆంధ్రగాయక కల్పితమగు మృదంగమును, మహమ్మదీయగాయక కల్పిత మగు తబలాయును మాత్రము ద్వాదశశ్రుతులలో నొక్క శ్రుతిని మాత్ర మాశ్రయించుచున్నవి. గాయకు లా శ్రుతిని సర్వసామాన్యముగఁ బ్రథమశ్రుతిగను, గొందఱు చతుర్థముగను, నింకఁ గొందఱు పంచమముగను జేకొని త దనుకూలముగఁ దమ గానమును నడపుకొనుచుందురు. ఈ వాద్యములు

ఆరోహణావరోహణరహితమ్ములును, ఏకశృత్యాశ్రయములును, తాళదశప్రాణాను గమములును నగు కేవలధ్వనిసముదాయములచేత శ్రోతల చిత్తంబుల రంజించుచు ఆవృత్తవిభజనంబున గాయకునకు సాయమొనరించుట కేర్పఱుపఁబడినవి. వీనియందలి ధ్వనులు ఏకశృత్యాశ్రయములే యైనను వీనిలో నొక్కొక్కదానియందు రమారమి యేడెనిమిది ధ్వనిభేదములు కలవు. ఆ ధ్వనిభేదములను బహువిధంబులగు చిత్రవిచిత్ర సముదాయములుగఁ జేర్చి, సమయోచితమార్దవకాఠిన్యములతోడ ధ్వనింపఁజేయుటే వాద్యము గాత్రగానముయొక్క ధ్వనిభేదములను గ్రంథస్థముచేయుట కా ధ్వనిభేద ములకు స రి గ మ ప ధ ని యను నక్షరములతోడ నామకరణము చేసి, యా నామములను వానికిఁ బ్రతినిధులుగఁ జేకొనినట్లు లీ చర్మవాద్యధ్వనులకు తా ధీ తోం నం, కిటతక, ఝుం, ణ, ధ, రి మొదలగు నక్షరములు నామములుగను బ్రతినిధులుగను జేకొనఁబడినవి. ఈ నామాక్షరసముదాయ స్వరూపములు తత్తదింద, ధీంతక, తోంగిట, నంగిట, ఝుంతక, తధణాం, తరికిట యనునట్లు బహువిధంబులుగ నుండును. వీనికి వరుసలు అని పేరు. ఉదాహరణము:— డోలువరుసలు, మద్దెలవరుసలు, తాళపువరుసలు. ఈ వరుసలే యొక్కొక్క తాళమునం దావర్తనియములతోడ వ్రాయఁబడునప్డు జతు లనఁబడుచుం డును. ఈ వరుసలరూపముగనే యీజంత్రవాద్యములు గ్రంథస్థము చేయఁబడుచుండును.

చ ర్మ వా ద్య ము లు.

ఆ. వె. ఎక్కు దిగుట లేని ♦ పెక్కు ధ్వనులఁ గూర్చి
గాత్ర గాన మందుఁ ♦ గలయఁ జేర్చి
చిత్ర గతుల సభ్య ♦ చిత్తరంజక మౌచుఁ
బ్రబలు చుండుఁ జర్మ ♦ వాద్య సమితి.

ఇట గ్రంథస్థముచేయఁబడుచుండు ననుటచేత నాయా వరుస లాయా వాద్యపరు లచే జ్ఞాపకార్థముగ వారివారి కనుకూలమగు విధమున వ్రాసి పెట్టుకొనఁబడుచుండు నని మాత్రమే గ్రహింపవలసియున్నది. ఏలయన నీ వాద్యక్రమముం గూర్చిన గ్రంథ మొక్కటియైన ముద్రణంబునఁ గనఁబచ్చుట లేదు. దీనికిఁ గారణ మిట్టు లూహింపఁ దగియున్నది. ఈ జంత్రవాద్యములందలి ధ్వనిభేదములకు ఉత్పత్తిస్థాననియముకాని నామాక్షరనియమముకాని లేదు. అనఁగా నాయా ధ్వనిజనకప్రదేశములలోఁ బుట్టెడి యేధ్వనికైన నేపేరైనఁ బెట్టఁబడును. ఈ దృష్టాంతముం జూడుఁడు. త అను ధ్వని మృదంగమునందు ఒక వరుసను వాయించునపుడు కుడిప్రక్కను, మఱియొకవరుసను వాయించుటలో నెడమప్రక్కను, ఒకప్పుడు అంచున, మఱియొకప్పుడు మధ్యను

ప్రయోగింపబడుచున్నది. అనఁగా నాయాప్రదేశములందుఁ బుట్టు ధ్వనులకే యీ పేరు పెట్టఁబడుచున్నది ఒకరు తరికిట యనిన పరుసను మఱియొకరు కిటతక యందురు. ఇంకొకరు ఝుణుతక యందురు; వేఱొకరు తకకిణ యందురు. ఒక్కఁడే యాధ్వనులకే వేఱువేఱుతాళములందు వేఱువేఱు పేర్లను బెట్టును దేశభేదము కలిగినపుడీ భేదము మఱియు హెచ్చుగ నుండును కావుననే యీ పరుసలు లోకోపకారార్థము సక్రమముగ గ్రంథస్థము చేయఁబడలేదు. గ్రంథమందు పరుసను జూచినమాత్రమున దాని నిట్లు వాయింపఁదగు నని చదువరులు గ్రహించుటకుఁ దగిన యాధారములను గల్పింప వలసి పడినది కాదు. అయినను విద్యార్థులకు స్వయంబోధినిగ నుండకపోయినను ఉపాధ్యాయులకు మార్గదర్శకంబుగనైనను దోడ్పడఁదగిన గ్రంథ మొక్కటి వ్రాయఁదగియుండె నని కనపట్టుచున్నది. అట్టిదానికై సమర్థులగువారు ప్రయత్నింతురు గాక.

చర్మవాద్యగ్రంథములు.

క. తరికిట కిటతక యనియెడి
పరుసల ధ్వనిభేదములకు ♦ వర్ణంబులకున్
స్థిరసంబంధము లేమిని
విరవే యరుదాయె గ్రంథ ♦ విరచన సేయన్.

ఈ రెండువిధముల జంత్రవాద్యములును గాత్రగానమునకు సాయమొనరించుట కేర్పఱుచుకొనఁబడినవి. వీనిలోఁ దంత్రీవాద్యములు గాత్రగానమును యథాస్థితిగ ధ్వనించుచు గాయకునకు గ్రుక్కఁద్రిప్పుకొనుట కవకాశమును గలిగించుచుఁ దమ ధ్వనిమాధుర్యమును దానియం దభేదంబుగఁ జేర్చుటచేత గాత్రగానమునకును, చర్మవాద్యములు గానముతోడ నేకశృతిలయ సబంధములు తప్ప మఱియే యితరసంబంధమును లేని వివిధములగు కేవల మధురధ్వని సముదాయములఁ జేర్చుటచేత యంత్రగాత్రగానములకును జనరంజనకార్యమందు సాయపడవలసియున్నవి.

ఇట్లు గాత్రగానమునకు సహాయ మొనరించుట కరుదెంచిన జంత్రవాద్యములు గాత్రగానమునకుఁ బ్రతిబంధకము లగుచున్నవి. ఎట్లనఁగా:—కేవల గాత్రపాఠకుఁడు స్వప్రయోజకత్వప్రకట నోద్యమంబున గానవిద్యాప్రయోజనంబునకు భంగముగలిగించునట్టులు ఈ రెండుతరగతుల జంత్రవాద్యపరులును అట్టిప్రయత్నంబుననే ఆప్రయోజనంబునకే భంగము గలిగించుచున్నారు. మొదట గాయకుఁడే సభ్యుల కెల్లరకుఁ దెలియఁదగిన భావసహితభాగమును మిక్కిలి కొంచెముగఁ బాడుచున్నాఁడు. ఆ కొంచెమునకే సభ్యులలోఁ గొంద ఱానందించుచుండఁగా వారిసంతోషసమయమందే తమప్రజ్ఞను

గూడఁ జూపనెంచి యన్యోన్యాతిక్రమణేచ్ఛచే గరగరగరయని యొకరును పెళపెళపెళ యని యింకొకరును నేకకాలమందే ధ్వనిచేయుటచేత భావసహితమైన యాకొంచెమును గూడఁ దెలియకుండఁ జెడఁగొట్టుచున్నారు. ఈకారణముచేతనే పలువురు విద్యాధికు లీ విషయమునఁ దమ యభిప్రాయమును సమర్థముగను ఖండితముగను జెప్పఁజాలకపోయినను మద్దెలలేకయే పాడుఁడనియు, ఫిడిలులేకయే పాడుఁడనియుఁ దఱచుగఁ గోరుట సంభవించుచున్నది. ఇది జంత్రవాద్యపరుల దోషమే యైనను సభారంజనంబున నచట నుత్తరవాది యగునాతఁడు గాయకుఁడే కావున నాతఁడు తనయెదుట జరుగుచున్న యా దోషమును జూచి సమ్మతించుటచేత శ్లో. కర్తా కారయితా చైవ - ప్రేరక శ్చాను మోదకః - సుకృతే దుష్కృతే చైవ - చత్వార స్సమభాగినః. అను న్యాయానుసరణంబుగ నిది యా గాయకుఁ డొనరించెడి అక్రమకార్యాను మోదనము అను దోషముగఁ జెప్పవలసి వచ్చుచున్నది.

ఫలభంగము.

ఆ. వె. అట్టె యొకరి నొక్క ♦ రతిశయింపఁగఁ గోరి
పాఠకుఁడును జంత్ర ♦ వాద్య పరులు
పలుకు తెలియకుండఁ ♦ బలుగు రొక్కట మ్రోఁగ
గాన ఫలము పడటఁ ♦ గలియు నకట!

జంత్రవాద్యపరుఁ డెప్పుడును గాయకుని చెంత నడఁగియుండి యాతనిప్రజ్ఞనే ప్రకాశింపఁజేయుచుండునెడ తన ప్రజ్ఞాతిశయమును వ్యర్థముచేసికొనవలయుఁగదా యని యెవ్వారైన నిచట సంశయింపవచ్చును. కాని యా సంశయ మక్కఱలేదు. పాఠకుఁడు పాడునంతసేపును దంత్రీవాద్యపరుఁడును చర్మవాద్యపరుఁడును నాతని పాటను బ్రకాశింపఁజేయుట కావశ్యకమగు వఱకు నిమిత్తమాత్రముగ వాయింపఁదగును. అంతటఁ గొంచెముసేపు గాయకుఁ డూరకుండ వలయు. అపుడు తంత్రీవాద్యపరుఁడు మాత్రము చర్మవాద్యపరుని సాయముతోఁ దన ప్రజ్ఞను జూపుకొనఁదగును. అంతట నాతఁడు నూరకుండవలయు. అపుడు చర్మవాద్యపరుఁడు తన ప్రజ్ఞను జూపుకొనవచ్చును. గానసభలందుఁ గంచువాద్యములను బెట్టుకొనుట తఱచుగ వాడుకలో లేదు. పెట్టుకొనిన యెడ నాతఁడు తన ప్రజ్ఞాతిశయమును జర్మవాద్యపరునితోఁ జేరియే చూపుకొనవలయు. ఇట్లొకరివెనుకనొకరుగ వీరు తమ ప్రజ్ఞను వేఱువేఱుగఁ జూపుకొనునెడ వీరిలో నొకరి ప్రజ్ఞవలన మఱియొకరిప్రజ్ఞ మఱుఁగుపడుట సంభవింపదు. సభ్యులు వీరి ప్రజ్ఞను బ్రత్యేకప్రత్యేకముగఁ గని యానందించుట కలుగును. గాత్రపుఁ బాటయందలి భావార్థ

ములు పూర్ణముగఁ బ్రకాశించును. గానము సర్వజనరంజకమను నార్యోక్తి సార్థకమగును.

### వాద్యపరుల పంతులు.

ఆ. వె. గానమునకు వన్నెఁ ♦ గల్పింపఁ జంత్రవా
ద్యముల టంచు నెఱిఁగి ♦ యడఁగి యుండి,
యవల వారి వారి ♦ యాధిక్యముల నెల్లఁ
గ్రమతఁ జూపఁ దగును ♦ ఘనులు తెలియ.

ఈ క్రమమునకుఁ బ్రత్యక్షవిరోధముగ నుండు పద్ధతులుగల మఱియొకవిధమైన గానసభలు కలవు. వానినే భజనకూటము లందురు. వీనియం దెందఱు గాయకులైనఁ జేరి యేకముఖముగఁ బాడుదురు. ఈ గాయకులకు గానవిద్యాపరిచితి బొత్తిగఁ దక్కువ. చర్మవాద్యపరుఁ డొక్కఁడే యుండును. గాయకుల చేతులలోనే కంచుతాళము లుండును. ఈ తాళములు పెద్దవిగ నుండును. కొన్ని సంఘములం దివి పంద్రెం డంగుళ ములు మధ్యకొలతకలవిగఁ గూడ నుండును. ఎందఱు పాడినను ఒకటే విధముగ వినఁబడు చుండు నోటిపాటయుఁ, అట్లేవినఁబడు చేతి తాళములును, పెద్దగ మ్రోఁగు చర్మ వాద్యమును జేరి యేకముఖమయి యొక పెద్ద ధ్వనిగ నేర్పడి, యన్యవిషయమును జెవిం జొరనీయక, పలువురు గాయకులచేత నైకకంఠ్యముగఁ బలుమాఱు రావర్తింపఁ బడుచున్న భక్తి సూచకవాక్యములు మాత్రము తన్మధ్యంబున నిరాఘాటంబుగఁ జెవింబడుచు నెట్టి మూఢచిత్తంబునైనఁ గరఁచి పరవశత్వంబు నొందఁజేయును.

### భజనసంగీతము.

చ. కరములఁ గాంస్యతాళములు, ♦ గంఠములన్ బరమాత్మ కీర్తనల్,
సరసను వాద్యముల్, పరవ ♦ శంబునఁ జేతులుతట్టు భక్తులున్,
వరలఁగ నైకకంఠ్యమగు ♦ వాక్కులఁ దద్ధ్వనినుండి బోధనాం,
కురములఁ జిక్కెడున్ భజన ♦ కూటపు గానము కొల్లకొల్లగన్.

ఈ భజనకూటముల యాచారమే గానసభలందుఁ బ్రవేశించి వానిని గలవర పఱుచుచున్నది. భజనకూటములందలి గాయకులకును వాద్యగాండ్రకును బ్రజ్ఞ మిక్కిలి తక్కువ. ఇచ్చట వివిధ ధ్వనులు చేరిన యొక్క మహాధ్వనిచేత జిత్తము లాకర్షింపఁ బడుచుండును. గానసభలందలి గాయనగాయనీజనులకును, వాద్యపరులకును గూడ నెక్కువైన ప్రజ్ఞ యుండును. ఆ ప్రజ్ఞ ప్రకాశింపవలయు. దాని ప్రయోజనము సభ్యు లకు లభింపవలయు. ఆ ప్రజ్ఞాసాధనంబున బహువిషయంబులు సభ్యులకుఁ దృష్టిగ

బోధింపఁబడవలయు. కావున జంత్రవాద్యపరు లెల్లప్పుడును దమ వాద్యములు గాత్రగానమును బ్రకాశింపఁజేయుటకే యని యెఱిఁగి త దనుకూలముగ వర్తించుచు, నొకరి కొకరు ప్రతిబంధకముగఁ బరిణమింపక యొకరివెనుక నొకరుగఁ దమ ప్రజ్ఞాతిశయముల సభ్యులకు నివేదించుచుఁ, దమ ప్రజ్ఞాతిశయప్రయోజనమును సంఘమునకు లభింపఁజేయుదురుగాక.

---

## 12. గాయకవిధులు.

గాయకుఁడు తనవిద్యను సంఘోపకారకరముగ నొనరించుట కీ దిగువపద్ధతుల నవలంబింపవలయును.

1. గాయకుఁడు తన విద్య తా నానందించుటకును, సంఘమును రంజించుటకు నే కాని కేవలముగఁ దనప్రజ్ఞను జూపుకొనుటకుఁ గాదు. యెఱిఁగియుండవలయు.

2. పరీక్షింపఁదలఁచిన వారియెదుటఁ బల్లవిని బాడవలయును గాని ప్రతిసభయందును బల్లవినిబాడుట విధియని తలఁపరాదు.

3. పల్లవిని బాడుటయందుఁ దాను గనఁబఱుచు విద్యానుభవజ్ఞానముయొక్క ప్రయోజనము స్వరపఱుపఁబడని పాటలను జనరంజకము లగునట్టు లానుధారను బాడుటేయని రూఢిగ నమ్మియుండవలయును.

4. సంగతికల్పనయందుఁగాని స్వరకల్పనయందుఁగాని మధురధ్వనిసముదాయములఁ గూర్చుటే కల్పనయనఁబడును. కావున గొంతుతిరుగునట్లు సంగతులను ద్రిప్పుట, సరళిస్వరములను జంటస్వరములను నోరుతిరుగువఱకు మార్చిమార్చి ప్రయోగించుట యనెడి వ్యర్థపద్ధతిని మాని మధురధ్వనిసముదాయములఁ గూర్చి సభ్యుల రంజించుటకుఁ బ్రయత్నింపవలయును.

5. ఏభాషయందుఁదాను బాడుటకుఁ బూనుకున్నాఁడో ఆ భాషయందుఁ బరిశ్రమచేసి జ్ఞానమును దాను సంపాదించి యుండవలయును. ముఖ్యముగఁ దాను బాడెడి పాటలయొక్క శబ్దార్థతాత్పర్యములనైన నిస్సంశయముగ నేర్చియుండవలయును. మఱియుఁ దాను బాడెడి పాట సభ్యులకు స్పష్టముగ వినఁబడునంత స్ఫుటముగ శబ్దముల నుచ్చరింపవలయును.

6. శబ్దముల నుచ్చరించునపుడు తన కంఠధ్వనిని ద ద్భావప్రకట నానుకూలములగు మార్దవకాఠిన్యములతోడఁ బ్రయోగింపవలయుఁ గాని తద్విరుద్ధధ్వనితోఁ బ్రయోగింపఁ గూడదు.

7. పాటను బాడునంతసేపును పాటయందలి భావమున కనుకూలమగు ముఖవిలాసమును గలిగియుండవలయుఁ గాని రౌద్రమునో దుఃఖమునో మఱియే యితర రసమునో సూచించెడి యొకవిధమైన ముఖవికారమునకుఁ దా నలవాటుపడి అట్టి ముఖవికారముతోడనే పాటల నన్నిటిని బాడుచుండఁ గూడదు.

8. పాడునపుడు పండ్లికిలించుట, నోరు మిక్కిలిగఁ దెఱచుట, గ్రుడ్ల మిణకరించుట, చేతుల నటునిటు జాడించుట మొదలగు చేష్టలు వికారముగను హాస్యాస్పదంబుగను నుండుటయేగాక అప్రస్తుత భావములను సూచించుచుండును గనుక నట్టి వికారచేష్టలను ముఖ్యముగ మానవలయు.

9. పాడునపుడు సభ్యులవంకఁ బూర్ణదృష్టితోఁ జూచుచు వారి కెట్టిపాటలు రుచించుచుండునో వారి ముఖవిలాసాదులవలన గ్రహించుచు నట్టివానినే పాడుటకుఁ బ్రయత్నింపవలయుఁ గాని తలవంచుకొని తన పాఠములన్నియుఁ బూర్తియగునంతకును బాడుచుండఁ గూడదు.

10. తత్తత్కాలోచితముగ రచియింపఁబడెడి సంఘాభివృద్ధికరములగు వేఱు వేఱు పాటలను జనరంజకము లగునట్లు తన ప్రజ్ఞచేఁ బాడుటయే విద్వద్ధర్మమని రూఢిగ నమ్మి యట్లు పాడుటకుఁ బ్రయత్నింపవలయుఁ గాని కేవలముగ భక్తిమాత్రమే బోధించు కృతులను వల్లించి, వానినే సర్వసంఘములవారికి నెల్లప్పుడును విద్యార్థివలె నొప్పగించుచుండఁ గూడదు. (గానసారము 16 వ యుపన్యాసము.)

11. భావసహితమైన పాటమధ్య నచ్చటచ్చట భావరహితములైన రాగస్వర జతుల మూడింటిని ధ్వనిభేదములచే భావమునకు రుచులు కల్పించుటకై వలయునఱకు మాత్రమే ప్రయోగింపవలయుఁ గాని భావమును శ్రోతృగాయకులిరువురును గూడ మఱచునంత దీర్ఘకాలము వఱకును బ్రయోగింపఁ గూడదు.

12. జంత్రవాద్యములు గాత్రగానమునకు సాయమొనరింప నరుదెంచునవి కావున నవి గాత్రపుఁబాటను మించియుండుట కంగీకరింపరాదు. వారివారి విద్యాధిక్యములఁ జూపుకొనుట కాయా వాద్యపరులకు పాటలమధ్య నవకాశ మీయవలయు.

## 13. శ్రోతృనియమములు.

గానశ్రోతలు గానమును నేర్వకయుండుట దోషముకాకయుండినను నేర్చియుండుట గుణము కాకపోదు. కావున నెల్లరును సాహిత్యముతో జతగా సంగీతమును గూడ నేర్చియుండుట యుక్తము. అట్టిది బాల్యమునుండియు విద్యలలో భాగ

ముగఁ బ్రతిమనుజునకును విధిగా నేర్పఁబడియుండుట యుత్తమమార్గము. కానిచో మధ్యకాలమందుఁ దీరికకలవారలు లేశమాత్ర మభ్యసించుటయుఁ దగును. తదితరు లందఱును గానము నభ్యసింపఁజాలకపోయినను గానవిద్యావిషయముల దెలిసికొనుటయైన నావశ్యక మని చెప్పకతీరదు. కానిచో గానసభయందు నీ రేవాక్యమునైనను ధైర్యముతోఁ బల్కఁజాలరు. పలుకఁబోవుచో నది కొన్నిసమయములలో వెఱ్ఱిగానుండును. ఒక గాయకుఁడు కృతిని బాడుచుండఁగా నొక సభ్యుఁడు 'ఈ పాటలు వద్దు. ఒక కృతిని బాడండి.' అని గట్టిగా నడిగెను. 'నే నిపుడు పాడుచుండినది కృతియే' యని గాయకుఁడు ప్రత్యుత్తర మిచ్చెను. ఇతరులు నవ్విరి. ఇది పృచ్ఛకున కగౌరవము కాదా? మఱొకప్పుడు గాయకుఁడు సభారంభమందుఁ దన చేతిలోని ఫిడిలును శ్రుతి చేసికొని తల వంచుకొని, ఫిడిలుమీఁదనే యొక యరగంటసేపు రాగమును వాయింపఁగా నప్పటి కొకసభ్యుఁడు విసిగి 'అరగంటనుండియు శ్రుతి చూచుకొనుటయే పూర్తి కాలేదటండీ' అని పశ్నించెను. సభ్యులందఱును జెప్పటలు కొట్టిరి. ఆ గాయకుఁడు తొలుత గాత్రముచేత లేశమును బాడక యారంభమునుండి యరగంటసేపువఱకును ఫిడిలుమీఁదనే వాయించుట, వాయించునంతసేపును బూర్ణదృష్టితో సభ్యుల ముఖవిలాసములఁ గనిపెట్టుచుండుటకు బదులుగఁ దలవంచుకొని తన ఫిడిలువంకనే చూచుకొనుచు వాయించుట యనెడి రెండు దోషములఁ జేసినాఁడు. వీనిచేత నరగంటసేపును గాయకుఁడు తలవంచుకొని శ్రుతులను సరిచూచుకొనుచున్నాఁ డని యా సభ్యుఁడు భ్రమపడినాఁడు. గానశాస్త్రసంబంధములేని యొక దృష్టాంతముం దెల్పెదఁ జిత్తగింపుఁడు. ఒక జపాన్ దేశపు విద్యాధికునితో నొక యాంధ్రపండితుఁ డిట్లు ప్రసంగించెను.

పండి - అయ్యా! తమ దే గ్రామము? జపా - మాది జపాన్ దేశము.

పండి - అ దెక్కడ నున్నది? జపా - చీనా దేశమున కావల నున్నది.

పండి - హైదరాబాదునకు దగ్గఱగా నుండునా?

జపా - కాదు. ఇచ్చటికి హైదరబాదు మిక్కిలి దగ్గఱ. జపాన్ దేశము చాలాదూరములో నున్నది.

పండి - అట్లయిన కాశీపట్టణము దగ్గఱ నుండునా యేమి?

జపా - కాదు. కాశీపట్టణమును హిందూదేశములోనే యున్నది. మా దేశమునకు హిందూదేశము దాఁటి చాలదూరము పోవలయును.

పండి - ఓహో! అలాగా! హిమాలయపర్వతముల దగ్గఱ నుండును గాఁబోలు.

అని యిట్లు పలుకఁగా నా జపాను దేశస్థుఁడు విసుగుచెంది 'ఈ పండితుని వ్యాక్తి హిందూదేశమును దాఁటి యావలకుఁ బోవుట లేదు. ఇదంతయు నీతనికి భూగోళశాస్త్రపరిచయము లేని దోషము'. అని తలఁచుచుఁ దన ప్రసంగమును జాలించెను. భూగోళశాస్త్రపరిచయముఁ గలవారికీ పండితుని ప్రసంగ మెట్లుండునో చదువరులే యూహింతురుగాక. తాను దేశసంచారమును జేయఁదలఁపకయున్నను ప్రపంచజ్ఞానము నపేక్షించు ప్రతిమనుజుఁడును భూగోళశాస్త్ర పరిచయమును సంపాదించుట మహావశ్యకము. అట్లులే తాను గానవిద్య నభ్యసింపఁదలఁపకపోయినను శ్రోతృసుఖము నభిలషించు ప్రతిమనుజుఁడును గానశాస్త్ర విషయముల నెఱిఁగియుండుటైన నావశ్యకము. ఆ విషయముల నెఱుఁగుటకు మిక్కిలి శ్రమ మక్కఱలేదు. ఎక్కువకాలము పట్టదు. ధనమిచ్చి నేర్చుకొనుటయుఁ బనిలేదు. 'గానసారము' అను గ్రంథము నొక్కసారి చదువుఁడు. కన్నుల కంజనము వేసినట్లు అది గానప్రపంచమునంత నొక్కసారిగ నగపఱుచును. అది యుపన్యాసరూపమున బాలబోధవలె వ్రాయఁబడినది. కావున గురుబోధ యక్కఱలేకయే మిక్కిలి సులభముగఁ దెలియును. దానినే మఱియొక్కతూరి చదువుఁడు. గానవిద్యావిషయములను సభలందు ధైర్యముతోఁ జర్చింపఁ గలుగుదురు. మూఁడవసారికూడ దానిం జదువఁగలుగుదురేని గాయకసంఘసంస్కరణ కార్యభారము నుత్సాహముతో వహింతురు. కావున గానప్రపంచవైచిత్ర్యపరిచయార్థము గానసారముఁ జదువుట ప్రథమకర్తవ్యము

2. గానసభ కేగి కూర్చుండునప్పుడే 'నేను గానము నెఱుఁగను. మూఢుఁడను. గానమును వినుట కనర్హుఁడను' అనెడి యనర్థకాభిప్రాయములతోఁ గూర్చుండఁ గూడదు. 'శ్రోతలు గానమం దెఱుఁగఁదగినవి మాధుర్యభావములు. వాని నేను ధారాళముగ నెఱుంగఁగలను' అని తెలిసి యుత్సాహముతోఁ గూర్చుండి వినవలయు.

3. అప్రస్తుతగాయకుని గుణాధిక్యము నచటఁ బొగడఁ గూడదు. అప్పటి గాయకుని గూర్చియే ప్రసంగింపవలయు.

4. నాఁటి గానమందలి మాధుర్యభావములను, వాదకుని ప్రజ్ఞను గ్రహించుచున్నట్లు కించిచ్ఛిరఃకంపముచేత గాయకునకు సూచించుచుండవలయు. కాని మితిమించి తలఁద్రిప్పుట హాస్యాస్పదంబుగ నుండును. 'నేను గదిలోఁ బరుండి వినుచుండెద; తమరు బయటఁ గూర్చుండి పాడుఁడి;' అనుట మాత్ర మెప్పుడును బనికిరాదు. అన్యోన్యముఖావలోకన మావశ్యకము.

5. గానసభలం దితరప్రసంగములు మానవలయు. ఒక్కొక్క పాటను ముగించు నపుడు గాయకున కుత్సాహమును గలిగించు మాటల నొక్క నిమిష కాలము లోఁ బ్రసంగింపఁదగును.

6. ఇదిపాడుఁ డదిపాడుఁ డని సలహా లిచ్చుటను తగ్గింపవలయును. వీరు కోరెడి పాటలు కొన్ని సమయములలో గాయకులకు రాకపోవచ్చును. వచ్చినను ఆ పాట యితరసభ్యులను రంజించు నని తోఁచకపోవచ్చును. కావున నపుడు సలహాల నిచ్చుట మంచిదికాదు.

గానశ్రోత లీ నియమముల నవలంబించునెడ మన దేశమందలి ప్రకృతకాలపు గాయకసంఘము సంస్కరింపఁబడి దాని ప్రయోజనము సాహిత్యసంఘమునకు లభించుటయు, గాన మభివృద్ధిఁజెంది ప్రతి యాంధ్రుని హృదయమునను వ్యాపించుటయుఁ గలుగును కావున న ట్లవలంబింతురుగాక.

గానశ్రోతలు.

సీ. సంగీతమును విన ♦ సభ కేగునంతనే - యటు నిటు లొదిఁగి ధై ♦ ర్యంబు డింది
గానం బెఱుంగని ♦ కడు హీనుఁడనటంచుఁ - దల మున్గినంత సం ♦ తాప మంది
యలయికఁ జెందుచు ♦ నావులింతలు హెచ్చి - బయటికేగెదమంచు ♦ భ్రాంతిఁ జెంగి
వెడలిపోయినయెడ ♦ వెఱ్ఱివాఁ డనుకొందు - రని సివిల్ ఖైదులో ♦ నట్లు కుంది

గీ. బడల నేటికి? సంగీత ♦ భావ సుఖము
లనుభ వింప నెల్లరును స ♦ మర్థు లెపుడు;
క్రమత నొకతూరి గానసా ♦ రంబుఁ గనుఁడు
తెలియ దను లోటు మొదలంటఁ ♦ దీరి పోవు.

---

## 14. ఆంధ్రభాష.

ఆర్యమహాజనులారా! ఆంధ్రభాషాభిమానులారా!

ఆంధ్రభాషాభివృద్ధికొఱకుఁ బ్రకృతకాలమున నవలంబింపవలసియున్న పద్ధతులను నాకుఁ దోఁచినవఱకు వివరింపఁబూనుచు వానికిఁ బూర్వ మాంధ్రభాషయొక్క ప్రస్తుత స్థితిని, అందలి దోషములను, తద్దోషనివారణమునకై యవలంబింపఁదగు పద్ధతులను బ్రథమమున వివరించుట యావశ్యక మని తోఁచుటచే వానిని ముందుగ మనవిచేయుచున్నాఁడను. భాషయొక్క వృద్ధిక్షయము లెప్పుడును గవులపై నాధారపడియుం

డును. భాషను వృద్ధిచేయుట యనఁగాఁ గవుల స్థితిని జక్కఁబఱిచి యభివృద్ధిచేయుటయే. భాషాస్థితి యనఁగాఁ గవుల స్థితియే. కావున నట్టి యాంధ్రకవుల స్థితిగతులఁ జిత్తగింపుఁడు.

మన ప్రస్తుతాంధ్రకవుల నెల్లర నుభయభాషావిదులు గీర్వాణభాషావిదులు ఆంధ్రభాషావిదులు నని మూఁడు తరగతులుగ విభజింపనగును. ఆంధ్రగీర్వాణభాషల యందు సమమైన పాండిత్యమును సమమైన కవనసామర్థ్యమును గలిగి, తమ కొకభాష యందుఁ గల సామర్థ్యము నేదో యొక మిషచేతనో అక్రమముచేతనో మఱియొక భాషలో నిఱికించి చూపుకొనవలయు నను పెనఁగులాటలేక, యాయా భాషలందు వేఱువేఱుగ సహజమగు శైలిని గబ్బముల వ్రాయఁజాలువారు మొదటితరగతి కవులు. ప్రామాణికు లగు పూర్వకవు లెల్లరు నీతరగతిలోనివారే. ఇట్టివారు మన యాంధ్ర దేశంబునఁ బ్రకృతకాలంబున నొకరిద్దఱికంటె నెక్కువగ లేరని చెప్పవచ్చును. వీరి వలన మన సంఘమునకుఁ గొన్ని యుపకారములు కలుగుచున్నవి. అపకారము లెవ్వియుఁ గలుగుట లేదు. కలుగఁదగిన యుపకారాతిశయములఁగూర్చి వెనుక వివరింతును.

రెండవతరగతి కవులవలనఁ గొన్ని యపకారములు సంఘమునకుఁ గలుగుచున్నవి. కావున వీరి పాండిత్యము నిచటఁ గొంత విమర్శింపవలసియున్నది. ఎట్లనఁగా:—గీర్వాణ భాషాపాండిత్యమునే కోరెడి విద్యార్థి కేవల గీర్వాణభాషాపరిశ్రమమును జేసినఁజాలును. గీర్వాణభాషయం దాంధ్రపదములు లేవు. కాని యాంధ్రభాషాపాండిత్యమును గోరెడి విద్యార్థి మాత్ర ముభయభాషాపరిశ్రమమును జేయక తీరదు. ఏలయన నాంధ్రభాష యందలి తత్సమతద్భవపదము లన్నియు గీర్వాణభాషనుండి వచ్చినవే. ఆంధ్రవ్యాకరణ మందలి కొన్ని పరిచ్ఛేదములును, మఱియు విశేషభాగమును గీర్వాణభాషలోనివే. కావున విద్యార్థి గీర్వాణభాష నెఱుఁగనిచో వాని వ్యుత్పత్త్యర్థములును, సందర్భములును దెలియవు. అతని జ్ఞానము నిష్కళంకముగ నుండదు. కావున విద్యార్థి కుభయభాషా పరిశ్రమం బావశ్యకము. వీనిలో నాంధ్రము దేశభాష యగుటచేత నిది తనకు ముందే స్వాధీనమై యుండెనని భ్రమఁజెంది, మఱికొంత యభ్యసింపఁదగియున్నయెడఁ గాలక్రమమున నదియే వచ్చునని యు మఱియుఁ గొంత యున్నయెడ ననంతరమం దభ్యసింపఁదగునని యుఁ దలఁచి, విద్యార్థి ప్రథమమున గీర్వాణభాషాభ్యాసమునకే పూనుకొనుచున్నాఁడు. అం దొకటిరెండు నిఘంటువులను, కావ్యపంచకమును, గొంతవఱ కలంకారశాస్త్రమును, ఒకటిరెండు నాటకంబులను గురుముఖంబునఁ బఠియించి, కొంత

ప్రజ్ఞను సంపాదించి, పండితనామధేయుఁ డగుచు, నపుడు విలాసముగ నాంధ్రభాషా గ్రంథము లెట్టులుండునో యని చూడఁ బ్రయత్నించును. అపుడును విజయవిలాసము, ప్రభావతీప్రద్యుమ్నములవంటి గ్రంథము లాతనికి రుచింపవు. పేలవముగా నుండును. వసుచరిత్రవంటి గీర్వాణపదభూయిష్ఠములైన గ్రంథములే తృప్తికరములైయుండును. అట్టివాని నొకటిరెంటిని దీసికొని వానిలో నచ్చటచ్చటఁ జదివిచూచును. అవి యాత నికిఁ గొంతవఱకు సులభముగాఁ దెలియుచుండునట్లే యగపడును. అంతమాత్రముచేఁ దన కాంధ్రగీర్వాణభాషాకౌశలము లభించినదని పండితవేషధారియై బయలువెడలును. ఇట్టి పండితులనుండియే కొంద ఱనంతరమందుఁ గవులుగ బయలువెడలుచుందురు. ఇపుడు మనకు లభించు గ్రంథములలో నెక్కుడుభాగ మిట్టికవులచే రచింపఁబడినవే. వీరే రెండవతరగతి కవులు.

### వీరి పాండిత్యదోషములు.

1. గీర్వాణాధిక్యదోషము:—ఈ గ్రంథకర్తలకుఁ గల ప్రజ్ఞ యంతయు గీర్వాణ భాషయందుఁ గలదు. గ్రంథరచనకు మొదలిడునప్పటి నుండియు వీరి నోట వెలువడున దంతయు గీర్వాణభాషయే. దానిచేఁ బద్యము నంతను గీర్వాణభాషాపదముల తోడను దీర్ఘసమాసములతోడను బూర్తిచేసి, దాని చివర నొక తెలుఁగు విభక్తినో తెలుఁగు శబ్దమునో అంటించి యది తెలుఁగుకవిత్వ మనుచుందురు. ఒకవేళ వీరిలో నొకనికిఁ దెనుఁగు భాషయందుఁగూడఁ గొంత పరిచితి యుండినను అతఁడు తన గ్రంథమును గీర్వాణపదభూయిష్ఠముగనే వ్రాయును. ఏలయన నాతనికిఁ గల గీర్వాణాధిక్యమును జూపుకొనుటకు గత్యంతరము లేదు. గీర్వాణభాషయందు స్వతంత్రముగ గ్రంథమును వ్రాయుట కాతని శక్తి చాలదు. ఆ గీర్వాణమును దెలుఁగునందే యిఱికించి చూపుకొనవలయును. కావునఁ దెనుఁ గని చెప్పుచు గీర్వాణమునే వ్రాయును. అది యితరులకుఁ దెలియనపు డది వారి భాషాజ్ఞానలోపదోషమే యనుచుండును. ఇట్టి గ్రంథములు పెక్కు లుండుటచేఁ గవిత్వమున కిదియే లక్షణమయియుండు ననియు, దీని గ్రహింపఁజాలకపోవుట చదువువారిదోషమే యనియు రెండు దురభిప్రాయములు దేశీయుల హృదయములందు నాటుకొనును. ఇది వారికవిత్వమందలి గీర్వాణాధిక్యదోషమే. ఇపుడు గ్రామ్యభాషాప్రధానము లగు గ్రంథములను వ్రాయించి పాఠశాలలందు వానిని పఠనీయములుగ నొనర్చుట యనెడి విప్లవమునకుఁ గల ముఖ్యకారణమును మూలకారణమును నిదియే యని చెప్పఁదగియున్నది. దానిఁ గూర్చి వేఱుగ మనవిచేయుదును.

### గీర్వాణాధిక్యదోషము.

చ. కరమును మాతృభాష యని ♦ ఖ్యాతి వహించిన సంస్కృతంబు న
బ్బురముగఁ దెచ్చి యాంధ్రమునఁ ♦ బొందిక సేయుట లెస్స; కాని యు
ద్ధురగతి నూఱుమాటలకుఁ ♦ దొంబదితొమ్మిదికాఁగఁ జొన్పి, య
బ్బురమగునాంధ్ర మిద్ది యని ♦ పల్కుట మాత్రము దోషమౌఁ జుమీ.

కం. సర్వోత్కృష్టం బనుచును
గీర్వాణముఁ దెచ్చి యాంధ్ర ♦ కృతుల విరివిగన్
సర్వత్ర యిడుట కవిజన
గీర్వాణాధిక్యదోష ♦ కృత్యము చుండీ.

2. ఏకవిద్యాపరిచితి:—ఇది రెండవతరగతికవుల పాండిత్యమందుఁ గల రెండవ దోషము. వీరికిఁ గల పాండిత్య మంతయుఁ గేవలశబ్దార్థజ్ఞానము. మఱియొక విద్య యేదియును వీరికిఁ దెలియదు. సృష్టివైచిత్ర్యములను దాముగఁ బరిశీలించి యందలి గుణవిశేషముల నుగ్గడించుచు స్వతంత్రగ్రంథములను వ్రాయు శక్తి మొదటితరగతి కవులయం దుండునుగాని వీరియం దుండుననుట కవకాశము కన్పట్టదు. తర్కవ్యాకరణాది వివిధశాస్త్రజ్ఞానమయినను మొదటితరగతి కవులకే యుండుఁగాని వీరికుండదు. శిల్పగణిత దేశచరిత్రాదు లగు లౌక్యవ్యాపారానుకూలశాస్త్రములు వీరికి స్వప్నవృత్తాంతతుల్యములే. ఇఁక వీరి కవిత్వమం దేమియుండును? కేవలశబ్దార్థములే. కల్పనాచాతురికూడఁ గొంత యుండును. విషయమే లేనియపుడు శబ్దార్థము లెట్లు నిలుచును? విషయమును గూడఁ గల్పించుకొందురు. ఏదైనఁ జమత్కారకథను గల్పించుకొందురా? అట్లు చేయరు. అట్లు నీతిబోధకమగు నొక కథను గల్పించుటయందుఁ దమ బుద్ధిని వినియోగించినను గొంత ప్రయోజనకరముగనే యుండును. కుండలో నొక కొండ పుట్టె నని కల్పింతురు. పనితీరినవాఁడు రాళ్లు రప్పలు పెట్టుకొని యాటలాడుకొనునట్లు దానిని వర్ణించుచు వీరు శబ్దార్థములఁ బెట్టుకొని యాటలాడుకొనుటకుఁ బ్రారంభింతురు. దీని కొక్క దృష్టాంతముం జిత్తగింపుఁడు. "సీ. నాగ మా యొలనాగ ♦ నడ కెన కాలేక నూగారుతో సరి ♦ రాఁ గడంగి, యర్థ మిచ్చియు" అనఁగా నొక యేనుఁ గొకానొక స్త్రీయొక్క నడకతోఁ బోలఁ జూచి, పోలలేక దాని నూగారుతోనైనఁ బోలవలయు నని లంచ మిచ్చినదఁట; తన పేరైన నాగశబ్దమునకు సర్ప మను నర్థము నిచ్చినదనుట యర్థాంతరము. "అర్థ మిచ్చియుఁ గామి ♦ తార్థము గాకున్నఁ—గని హ్రస్వముఖ వర్ణ ♦ కలిత యగుచు" లంచమిచ్చియు విఫలమనోరథ యగుటచే ముఖమును జిన్నబుచ్చు

కొనినదఁట; నాగశబ్దము నగమైనదనుట యర్థాంతరము. "పాలిండ్ల సామ్యంబుఁ ♦ బడయఁగా నర్థించి - తల్లక్రిందు లగుచు" నగ మనఁగా బర్వతము గనుక ఆ యర్థముచే నాపె పాలిండ్ల సామ్యమును గోరి యందుఁ బూర్తిగ నోడి తల్లక్రిం దైనదఁట; నగ శబ్దము తల్లక్రిందై 'గనము' అయ్యెననుట యర్థాంతరము. ఘనశబ్దభవము గనము. "తలక్రిందు లగుచు గుం ♦ తలకులంబు తోడ నీ డర్థించి" ఘనశబ్దభవ మగుటచే గనశబ్దమునకును మేఘ మని యర్థముచేసి దానిచే వర్ణమునం దామె వెండ్రుకలతోఁ బోలఁజూచినదఁట. "తోడ నీ డర్థించి ♦ తుద కెన గాలేక—సగమయి కౌనుతో ♦ సమతఁ జెందె." కృశించి కౌనుతో సమ మయినదఁట. 'సగము' అనఁగా మఱియొక గవర్ణముతోఁ గూడినది అనఁగా 'గగనము' అయి కౌనుతో నెక్కెని సమత్వము నొందినదఁట. ఈ పద్యమందుఁ గవిసమర్థత మిక్కిలిగఁ గన్పట్టుచున్నది. ఇందు విషయ మేమి? శబ్దములతోడి యాటయే. భాషయం దావశ్యకములగు గ్రంథము లెన్నియో లేకయుండఁగా నిట్టి శబ్దఖేలనాలంకారమునకై వీరి బుద్ధిబలము నంతను వినియోగించుటఁ జూడఁ బనిపాటలు మానుకొని బంతులాడునట్లే యుండును.

కేవలశాబ్దికులు.

గీ. తనదు చదువెల్ల శబ్దశా ♦ స్త్రంబు తక్క
నన్య మెఱుఁగని కవి వ్రాయు ♦ నట్టి కృతుల
గాటముగ శబ్దములతోడి ♦ యాట తప్ప
నుచిత మగు బోధ యింక నే ♦ ముండఁ గలదు?

ఇఁక వీరు రచియించు గ్రంథము లెట్టివియో చూచెదరా? మొదటితరగతి కవులు వ్రాసిన స్వతంత్రగ్రంథముల (original books) ను దీసికొని పద్యకావ్యమును వచనకావ్యముగను, వచనకావ్యమును నాటకముగను, నాటకమును హరికథగను నిట్లొకటి నింకొకటిగ మార్చుచుందురు. కానిచో భాషాంతరీకరణ మొనర్తురు. ఈ గ్రంథకరణమందు వీరి వంతు శబ్దములుమాత్రమే. స్వతంత్రముగ మాత్ర మేమియు వ్రాయఁజాలరు.

వీ రితరవిషయములఁ దెలిసికొనుటకుఁ బ్రయత్నమయినను జేయరు. కేవలశబ్దార్థజ్ఞానమే సకలార్థసిద్ధి యనుకొనుచుందురు. సకలార్థసిద్ధికి శబ్దార్థజ్ఞానము సాధనము మాత్రమే యగుటను వీరు గ్రహించు నట్లు కన్పట్టరు. ఈ శబ్దార్థజ్ఞానసంపాదనమాత్రముచేఁ దృప్తిచెందిన పండితులే యిక్కాలమున నెక్కుడుగఁ గలరు. లౌక్యవిషయ

ములందు వీరి ప్రసంగములును ప్రవర్తనములును వెఱ్ఱిగా నుండును. వీరినే కొందఱు శ్రోత్రియు లని చెప్పుదురు. కేవలవేదాధ్యయనపరులగు శుద్ధశ్రోత్రియులకంటె వీరు కొంచె మతిశయు లని చెప్పవచ్చును. శుద్ధశ్రోత్రియుల కా యేకవిషయపరిచితియుండదు; వీరికి యనుశబ్దార్థజ్ఞానముకూడ లేదు. 'బుద్ధిజాడ్యజనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్' అని యల్లసాని పెద్దనకవిగారు చెప్పిన వాక్యము ను నా యభిప్రాయమునే స్థిరీకరించు చున్నది. వీరి బుద్ధిజాడ్యమును దెలుపుటకు రెండు చిన్ని దృష్టాంతముల నిచ్చెదను. 1. దొడ్డిలోని మామిడిచెట్టు కాయలను దొంగలు దినదినమును రాత్రివేళఁ గోసికొని పోవుటను జూచి యా దోషము నాపుటకై యొక శ్రోత్రియుఁ డొకనాఁటి రాత్రి గట్టి మడిధోవతి నా చెట్టుచుట్టును గట్టెనఁట. ఆరాత్రివచ్చినదొంగ మామిడికాయలను మడిధోవతిని గూడ దొంగిలించుకొనిపోయెనఁట. 2 ఒక శ్రోత్రియుఁ డత్తవారి యింటికిఁ బోయి వా రిచ్చిన రు 8 లు విలువగల ధోవతుల చాఁపును, ఆయూరిలోని మఱియొక దాత యిచ్చిన రు 8 ల రొక్కమును దీసికొని తన గ్రామమునకు వచ్చుచుండ దారిలో నొక దొంగ యడ్డమై బెదరించి మూటలోని ధోవతులచాఁపును దీసికొని పోయెనఁట. కొంత దూర మేగినవెనుక శ్రోత్రియునకు రొండినిగల రు 8 లును జ్ఞప్తికివచ్చి, అత్తవా రిచ్చిన చాఁపును బోఁగొట్టుకొనుటకు సమ్మతింపక, యా దొంగపోయిన జాడను బోయి యాతనిఁ గలిసికొని "ఆ చాఁపును అమ్ముకొందువా, దాఁచుకొందువా? అమ్ముకొందువా, దాఁచుకొందువా?" అని యఱచుచు నాతని వెంటఁ బరుగెత్తఁ జొచ్చెనఁట! కొంతసేపటి కా దొంగ యాశ్చర్యముతో నించుక నిలిచి, యీతని ప్రశ్నను విని, 'అమ్ముకొందు' నని చెప్పఁగా 'అట్లయిన నివిగో రు 8 లు; వీనిం దీసికొని యా చాఁపును నాకే విక్రయింపుమ'నెనఁట! అంతట దొంగ 'ముందే యీ రూపాయలు కూడ నా కేల యియ్యవైతి' వని యొక్క చెంపదెబ్బను గొట్టి యా రూపాయలను గూడ గుంజుకొని పాఱిపోయెనఁట !!

వీరి బుద్ధిజాడ్య మి ట్లెన్నియో విధములఁ బరిణమించుచుండును. దీని కంతటికిని వీరియందుఁ గల యేకవిద్యాపరిచితిదోషమే మూలకారణము. పురాణవిద్యాపాఠశాలల యందు విద్యార్థు లాంధ్రోపాధ్యాయుల నేల యలక్ష్యము చేయుదురు? వారు వివిధ విద్యాభ్యాసకులు; వీర లేకవిద్యాపరిచయులు. ఇంతకంటె వేఱు కారణము లేదు. శ్రుతిపాఠకుఁ డను పవిత్రార్థము నిచ్చు శ్రోత్రియశబ్దమునకు మూఢుఁడు, మూర్ఖుఁడు, వెఱ్ఱివాఁడు నను నపార్థములు కలుగుట కాస్పద మీ యే క వి ద్యా ప రి చి తు లే.

అట్లయినచో వివిధవిద్యలందు మాధుకరజ్ఞానమును సంపాదించుటయే మహోన్నత కార్య మగునా యని కొందఱు శంకింపవచ్చును. ఈ శంక యనావశ్యకమే యయినను నిది నూతనోద్యమ మగుటచేత నిచట సమాధానము చెప్పక తీరదు. కావున మనవి చేయుచున్నాఁడను. మాధుకరజ్ఞానము ప్రతిమానవునకు నావశ్యకమే. ఇట్టిది లేనిచో నెవఁడుగాని తన జీవయాత్రయందు వేలువేలగు తనకార్యములఁ దాను దృష్టిగ నెఱవేర్చుకొనఁ జాలఁడు. ఇంకొకరికి సాయము చేయఁజాలఁడు. వేలువేలగు విద్యలందు నిపుణులగువారు సంఘమందు బయలువెడలునపుడు వారివారి ప్రజ్ఞలఁ గని యానందింపఁ జాలఁడు. ప్రథమమున నెవరుగాని వివిధవిద్యలందుఁ బరిమితజ్ఞానసంపాదన మొనరించిన యనంతరమం దేకవిద్యానైపుణిక్కై ప్రయత్నింపఁదగును గాని కేవలముగ నేకవిద్యానైపుణినే సంపాదించునెడ నది యేవిద్యయైనను దానియం దాతఁ డెంత సామర్థ్యమును సంపాదించినను బై శ్రోత్రియశబ్దముయొక్క అపార్థముల కన్నిటికిని నాతఁడు లోను గాక తీరదు. మఱియు నా విద్యావంతుల సంఘమం దేమైన ప్రమాదజనిత దోషము లుండునెడ వానిని సవరించుటకుఁ గాని, అభివృద్ధిమార్గములఁ జూపుటకుఁ గాని, నూతనపద్ధతులఁ గల్పించుటకుఁ గాని దాని సన్నిహితవిద్యల నెఱుఁగకయుంటచేత నాతఁడు లేశమాత్రమును సమర్థుఁడు కాఁజాలఁడు. తా నభ్యసించినవఱకుఁ బ్రసంగించుటయందు మాత్రము సంపూర్ణాధికారిగనుండును. కావున నట్టి విద్యావంతుని నొక్క ముద్రితగ్రంథ మని చెప్పవచ్చును. ఎప్పుడు చూచినను హెచ్చుతగ్గులులేక యొక్కవిధముగనే యుండును. యుక్తాయుక్తవిచారజ్ఞానసంపన్నతచే నొప్పు మానవజన్మం బెత్తి విద్యావంతుఁడై జడరూపమైన గ్రంథముంబలె నియమితకార్యాచరణమాత్ర ప్రయోజకుండగుట విషాదకరముకదా. కావున నెవరుగాని వివిధవిద్యలందుఁ బరిమితజ్ఞానసంపాదన మొనర్చి, పిమ్మట వానిలో నొక్క విద్యయం దధికారి యగుటకుఁ బ్రయత్నించుట యుత్తమకార్యము. దీనికి దృష్టాంతము వలయుచో నొక్కటి ప్రత్యక్షముగనే యున్నది. ఇప్పటి పాఠశాలలందు మెట్రిక్యులేషన్ తరగతివఱకును వివిధవిద్యాభ్యాసమును జేయించి యనంతరము బి. యే. పరీక్షయందు జయమందుటకు వానిలో నొక్క విద్యయం దధికారిని జేయుచున్నారు. ఈ యధికారమును సంపాదించినను సంపాదింపకున్నను వివిధవిద్యలందుఁ బరిమితజ్ఞానసంపాదనము మాత్ర మావశ్యకము. అదియు లేనిచో విద్యావిహీనః పశుః అను న్యాయమునకుఁ బాత్రుఁడగును. కావున రెండవతరగతి కవుల యేకవిద్యాపరిచితి నొక్క దోషముగఁ జెప్పక తీరదు.

3. ఇఁక మూఁడవతరగతి కవులను గూర్చి మనవిచేయుదును. వీరు ప్రకృత కాలపు టాంగ్లేయవిద్యాపాఠశాలలయందు నూతనపద్ధతుల ప్రకార మభ్యసించిన వివిధ విద్యలలో నాంధ్రమునుగూడ నొకటిగ నించుక యభ్యసించిన విద్యార్థులనుండి బయలు వెడలువారు వీరికి వివిధవిషయములు తెలియును. గ్రంథకరణోత్సాహమును ఉండును. కాని వీరిలోఁ బలువురకు భాషాకౌశలము మిక్కిలి తక్కువ. అలంకారయుక్తభాష యందు వ్రాయలేకపోవుట దోషము కాఁజాలదు కాని పునరుక్తము, న్యూనోపమ, అధికోపమ, అశ్లీలము లోనుగాఁగల వాక్యదోషార్థదోషములతోడ గ్రంథమును వ్రాయుచో నది యసహ్యాకరముగ నుండుననుటకు సంశయము కలదా? ఈదృష్టాంతమును జిత్తగింపుఁడు.

నూతనకవులు.

సీ. సంసారంగి పిట్టలు ♦ సైకతంబు లటంచు - గజ్జ లంటఁగఁ జీరఁ ♦ గట్టె నంచు
రామాయణమున క ♦ రణ్యారోదనమంచు - వెన్నుని సిగఁ బట్టి ♦ తన్నె నంచు
ఘనబలుఁ డయ్యును ♦ కానిడ క్రీడంచుఁ - గడు నోర్పున కితండు ♦ గాడ్దె యంచు
మండిపోయిన యల్ల ♦ మదనుఁడే యితఁడంచు - మాను నాచరణంబు ♦ లాన యంచు

గీ. నిట్టి దుర్దోషముల నెల్లఁ ♦ జుట్టఁబెట్టి
కబ్బములఁ గూర్చి నూతన ♦ కవుల మంచు
భాష కిది వృద్ధిపథమంచుఁ ♦ బల్కుచుందు
రహహ యేమందు నిట్టి వి ♦ ద్యాధికులను!

ఇట్టి కబ్బములం దెవ్వరైన దోషములఁ జూపునపుడు విముఖులై భాషనుండి యా దోషవిషయిక సూత్రములను నియమసూత్రములను దొలఁగించుట యెట్లుకలుగునాయని యోచించుచుందురు. యతిప్రాసనియమము లక్కఱలేదనువారును గ్రామ్యభాషాగ్రంథముల నాదరింపఁజూచువారును నీతరగతిలోనివారే. కాని వీరివలనఁ గొన్ని యుపకారములు మన సంఘమునకు లభించుచున్నవి. వీరి కన్యదేశచారిత్రములును మనదేశచరిత్రయుఁ గూడఁ దెలియును. ఏయే దేశములం దేయేవిద్య లెట్లెట్లు లభివృద్ధిఁ జెందుచున్నవో, తత్తదభివృద్ధికై యేయే మార్గము లవలంబింపఁబడుచున్నవో, కొన్ని సమయములలో వానివాని కెట్టి విప్లవములు సంభవించినవో, వానిం దప్పించుకొనుట కెట్టి ప్రయత్నములు కావింపఁబడినవో, అన్యదేశసంఘములతోఁ బోల్పఁబడునపుడు మన సంఘ మేయే విషయములలో వెనుకఁబడుచున్నదో, మనకుఁ గల యే యాధిక్యములను

మన మిపుడు కోలుపోవుచుంటిమో ఇత్యాదివిషయము లన్నియు వీరలకుఁ జక్కఁగఁ దెలియును. ఆయా లోపములను సవరించి మన సంఘమును నూతనపద్ధతులలో నడిపించుటచేత నభివృద్ధిపఱుపఁజూచుచుందురు. దానికై వార్తాపత్రికలందు వ్యాసములు వ్రాయుటచేతను, మన భాషలో లేని గ్రంథముల నితరభాషలనుండి భాషాంతరీకరణ మొనర్చి ప్రచురించుటచేతను స్వదేశాన్యదేశచారిత్రముల నాంధ్రభాషలోఁ బ్రకటించుటచేతను బ్రజాభ్యుదయముల నూతనోద్యమంబుల కభిముఖంబు లగున ట్లొనర్చుచుందురు.

ఇట్టి మూఁడవతరగతుల కవులయొక్క స్థితిగతులను జక్కఁబఱిచి, వీరిగ్రంథలేఖన విధానములను సంస్కరించి, సంఘాభివృద్ధికి వలయు నూతన గ్రంథములను వీరిచేత వ్రాయించుటయే ఆంధ్రభాషాభివృద్ధికి మార్గములఁ గల్పించుట యగును. కావున నట్టి వృద్ధికై నాకుఁ దోఁచిన మార్గములను మనవిచేయుచున్నాఁడను.

1. కేవలకవిప్రజ్ఞను, కవిత్వాతిశయములను జూపఁదగు గ్రంథము లిపుడు మన కావశ్యకములు కావు. అట్టి గ్రంథము లుభయభాషలందును బ్రామాణికులగు మన పూర్వకవులచే లెక్కకు మిక్కిలిగ వ్రాయఁబడియే యున్నవి. వానికి వన్నెవెట్టునంతగ వ్రాయుదుమను సాహసికు లెవ్వరైన మొదటితరగతికవులనుండి బయలువెడలునెడ నట్టి వారా గ్రంథములను వ్రాయుదురుగాక. తదితరు లంతటి సమర్థత లేకయుండియు వారివారి గ్రంథములలోని పోకడలనే యేఱి, సంగ్రహించి, తమ గ్రంథమందుఁజొప్పించి, వ్రాయుచు, దమ కాలమును వ్యర్థపుచ్చుకొనుచు, నసమర్థమైన మార్గదర్శకగ్రంథమును బ్రకటించుట హాస్యాస్పదంబుగ నుండును. సృష్టివైచిత్ర్యములను, ప్రాపంచికవిశేషములను, మహాపురుషులజీవితములను, విద్యాధికుల ప్రజ్ఞను, బుద్ధిశాలుల ప్రతిభను, ధీరుల శౌర్యగాంభీర్యాదులను గన్నులారఁ జూచి, చెవులార విని, యందలి గుణదోషములను స్వచ్ఛందముగ విమర్శించి గుణమునకు వన్నెఁ గల్పించుచు, దోషమును నిరసించుచు, స్వప్రయోజకత్వ ప్రకటనాపేక్షావిరహితుఁడుగాక, సంఘోపయోగార్థము స్వతంత్రముగ నెవఁడు పాటలుగఁగాని పద్యములుగఁగాని వచనముగఁగాని గ్రంథమును వ్రాయునో యాతఁడు కవి యనఁబడఁదగును. కావున నట్టి గ్రంథకరణమునకై ప్రయత్నింతురుగాక యని మొదటితరగతి కవుల వినయపూర్వకముగఁ బ్రార్థించుచున్నాఁడను.

2. భావప్రకటనమున కావశ్యకమగువఱకు శబ్దజాలమును బ్రయోగించుచు వ్రాయు నదే యుత్తమకవిత్వ మగును. తిక్కనాది పూర్వకవుల మత మిదియే. స్వప్రయోజకత్వ ప్రకటనార్థముగ శబ్దజాలముం బ్రయోగించిన నది విజ్ఞుల దృష్టియందుఁ బరిహాసాస్పదం

టుగ నుండును. క్రొత్తగ నుంగరములను మురుగులను బెట్టికొను వారు వానిం జూపుకొనుటకై పలుమారు చేతుల నెత్తుచు మాట్లాడునపు డితరులు వారిం జూచి నవ్వుట లేదా? మఱియు మదనతాపము అనుటకు పద్మారిజనకపుత్రీరమణకుమారతాపము అని చెప్పుట దోషాస్పదము కాదా? అది ప్రపంచానుభవము (nature) నకు మిక్కిలి దూరముగ నుండదా? ఆంధ్రకవిత్వ మని చెప్పుచు నాంధ్రపదములకంటె గీర్వాణ పదముల నెక్కువగఁ బ్రయోగించుట ధర్మమగునా? కావున రెండవతరగతి కవులు స్వప్రయోజకత్వప్రకటనాపేక్షాదోషమునకు మాత్రము లోనుగాక యుందురుగాక.

### ప్రజ్ఞాప్రకటనాపేక్ష.

ఉ. అజ్ఞులు భూషలం దెలుప ♦ హస్తము లెత్తుచు మాటలాడుచో
విజ్ఞులు చూచి దాని నొక ♦ వెఱ్ఱి యటంచు దలంచు రీతిగన్
ప్రజ్ఞలకై పెనంగు కవి ♦ వర్యుల వ్రాతలఁ జూచునప్పుడున్
దజ్ఞులు వాని నన్నిటి న ♦ నర్థకకార్యము లంచు నెంచరే?

మఱియు సంఘోపయోగార్థము వీరు రచియింపఁ దగు గ్రంథము లెన్నియో కలవు. వానివలన దేశమునకు మేలును గ్రంథకర్తలకు భుక్తిముక్తులును నొనగూడును. ఎట్లనఁగా:—మన దేశమందు కమ్మరము, వడ్రంగము, బంగారపుపని లోనగు ప్రఖ్యాతి వహించిన విద్యలెన్నియో కలవు. మచిలీబందరు నందలి కలంకారిపని, కాకినాడ చెంగావి, మైలవరమునందలి యిత్తడిపని, కొండపల్లి బొమ్మలు, ఏలూరు హనుమకొండల యందలి రత్నకంబళములు, కుంభకోణమునందలి పాత్రసామగ్రి, డక్కా మజిలిన్, బనారసు పట్టుపని, కాశ్మీరపు సాలువులు లోనగునవి నేటివఱకు నన్యదేశములందుఁ గూడ నెంతో గౌరవపాత్రము లగుచున్నవి. పాలకొల్లు గోపురముమీఁదను హనుమకొండ దేవళమునందు నల్లరాతి విగ్రహములమీఁదను చిత్రకారులచేఁ జేయఁబడిన పనియు నేటివఱకును బ్రజాహృదయముల మిక్కిలిగ నాకర్షించుచు నద్భుతామోదజనకమగుచున్నది. కాని యావిద్యలు మన దేశమునం దొక్కొక్క భాగమునందు మాత్రమే కలవు. వాని నీ దేశమునందే మఱియొక భాగమునందలివా రభ్యసింపఁజూచునెడ వాని కాధార మేమియు లేదు. గ్రంథసాహాయ్య మేమియు లభింపదు. అవి యుండిన భాగమందైన మఱియొకతరమువా రభ్యసించుటకైనను గ్రంథసాహాయ్యము కావలయును. నోటిమాటలతోడ బోధింతు రందు రేమో. అది సరికాదు. బోధనకౌశల మందఱకును గలుగదు. కావున సక్రమమైన గ్రంథసాహాయ్య మావశ్యకము. అట్టి గ్రంథము లింతవఱకుఁ బ్రచురింపఁబడియుండలేదు. ఈ కారణముచేతనే మన విద్యలు

పెక్కు లంతరించిపోయినవి. వానిని బునరుద్ధారణ మొనర్చుటకు గ్రంథకరణమే ప్రథమ కర్తవ్యము. అట్టిగ్రంథములను వ్రాయుట కాయా విద్యావంతులకు సమర్థత లేదు. దీనికి మనదేశపు విద్యాభ్యాసనపద్ధతియే కారణమని నా యభిప్రాయము. ఏలయన నేకవిద్యాభ్యసన మొనర్చి యొక్కొక్క విద్యయం దొక్కొక్కఁడు సంపూర్ణాధికారిగ నుండుట వీరి కిష్టము. అట్టిసంపూర్ణాధికారి వేయిమందిలో నొక్కఁ డుండినఁజాలును. ఒక్కఁడే యుండును. తక్కిన 999 మందియు వివిధవిద్యాభ్యసన మొనర్పవలసియున్నారు. అట్టి యభ్యాసము మన దేశమందు లేదు. వారువారు వేఱువేఱు విద్యలఁ జేకొనుటలో సాహిత్యవిద్య యొక తెగవారియందును శిల్పము లితర తెగలవారియందును బడిపోయినవి. సాహిత్యపరులకు గ్రంథకరణసామర్థ్యము కలదు. దానితోఁ జేర్చి చెప్పుటకు వారి యొద్ద నితరవిద్య యేదియు లేదు. కావున కేవలశబ్దములతో నాటలాడుకొందురు. శిల్పులకు విద్యలు కలవు. సాహిత్యము లేదు. కావున వారు గ్రంథముల వ్రాయఁజాలరు. ఈ లోపముల నివారించుట కిపుడు శిల్పులనందఱును సాహిత్యము నభ్యసింపుఁడనుట కాని సాహిత్యపరుల నందఱును శిల్పముల నభ్యసింపుఁడనుట కాని సహేతుకముగ నుండదు. వివిధవిద్యాభ్యసనపద్ధతిని బ్రోత్సాహపఱుచునెడఁ గొంతకాలమున కా లోపములు క్రమంబుగఁ దీరును. కాని ప్రకృతమందు శిల్పియు సాహిత్యపరుఁడును జేరి గ్రంథమును బ్రకటింపఁదగియున్నది. స్థూలదృష్టిచేఁ జూచువారి కిది దుర్ఘటకార్యంబుగఁ దోఁచును గాని సూక్ష్మదృష్టిని జూచువారికిఁ గరతలామలకమై యుండును. న్యాయవాది తనప్రశ్నలకుఁ బ్రత్యుత్తరముగా వానిప్రతివాదులవలన రాఁబట్టు మాటలచేత సక్రమమైన చరిత్రను సిద్ధముచేయుట లేదా? అట్లే వీరును జేయవచ్చును. ఇంత యేల? వివిధవిద్యానైపుణిచేత నారితేఱిన యాంగ్లేయులు, వారి పద్ధతుల ప్రకారము మనపండితుల సాహాయ్యముచేఁ దమ పేరున నాంధ్రభాషయందు గ్రంథములఁ బ్రకటించుచుండుట లేదా? వానిని మనము తలను ధరించుచుండుట లేదా? అట్టులే యీసాహిత్యపరులును శిల్పకారుల సాహాయ్యంబున గ్రంథములఁ బ్రకటింపవచ్చును. అవి వచనగ్రంథములుగ నుండినఁ జాలును. అవి మిక్కిలిగ వ్యాపించిన యనంతరము వానిలోని ముఖ్యాంశముల నేటి యొవ్వరైనఁ బద్యములుగ నొనరింతురు. అందలి సారమును మఱొక్కరు నాటకముగ వ్రాయుదురు. దానియందలి ముఖ్యాంశముల నింకొకరు పాటలుగ వ్రాయుదురు. ఇవన్నియు సులభకార్యములు. మొదటిదే దుర్ఘటము. దీనియందు గ్రంథకర్తలకుఁ గొంత యెక్కుడుశ్రమ కలుగును. వారికిఁ దగిన జీవనాధారములు లేవు. అయిన నట్టివారిఁ బోషించు భారము స్వదేశాధిపతులయందుఁ గలదు. అట్టి రాజానుగ్రహసంపాదనార్థము

భాషాభిమాను లెల్లరును బ్రయత్నించి యాయా గ్రంథకర్తలకుఁ బ్రోత్సాహమును సుఖజీవనమును గలిగింపవలసియున్నారు. ఇట్టి వివిధవిద్యోద్ధరణకార్యమునకుఁ బై రెండవతరగతి కవు లెల్లరును బూని వారివారి శక్తికొలఁదిని దేశసేవ నొనరింతురుగాక.

### గ్రంథకరణము.

ఉ. ఎంతటివిద్యలైనను గ ♦ వీశులసాయము నందకున్నచో
వింతగఁ గార్శ్య మొంది, పురి ♦ వీడి, విరూపము నొందుఁ; గాన న
త్యంతము సత్కవీశులు త ♦ దర్థము గ్రంథములన్ రచింప మే
లెంతయుఁ గాంచు విద్యలు; క ♦ వీశులు కాంతురు భుక్తిముక్తులన్.

3. ఇఁక మూఁడవతరగతి కవులకు గ్రంథకరణవ్యవసాయమునుగూర్చియు దాని ప్రయోజనమునుగూర్చియు నేను మనవిచేయవలసిన దంతగాఁ గనఁబడదు. మన యాంధ్రభాషయం దింతవఱకు లేని కొన్ని గ్రంథములను అనఁగా వృక్షశాస్త్రము, జంతుశాస్త్రము, రసాయనశాస్త్రము మొదలగు శాస్త్రములను, కొందఱు మహాపురుషుల జీవితములు లోనుగాఁగల గ్రంథములను, స్వదేశాన్యదేశచారిత్రములను గొంతవఱకుఁ బ్రకటించుచునే యున్నారు. మఱియు వలయువానిని బ్రకటింతురు. కాని యొక్క భాషావిషయమున మాత్రము వీరిలోఁ గొందఱితో నించుక యభిప్రాయభేదము రెండు విషయములందు సంఘటించుచున్నది. అందు భాషానియమములఁ దొలఁగించుమనుట యొకటి; నియమరహితమైన గ్రామ్యభాషయందే గ్రంథములను వ్రాయవలయు ననుట మఱియొక్కటి. ఈ రెండుకోర్కులును దాదాపుగ నేకాభిప్రాయమునే సూచించుచున్నవి. ఇట్లు కోరుటయందు భాషను జెఱుపవలయు ననెడి దురుద్దేశము వీరి కిసుమంతయు లేదు. భాషను సర్వజనానుభవయోగ్యముగఁ జేయవలయు ననుటయే వీరల మహోద్యమము. ఇది కడుంగడు శ్లాఘనీయము. ఈ ప్రయత్నమందు వీ రవలంబించు పద్ధతులు మాత్ర మించుక శోచనీయము లైయున్నవి. ఏలయన వీ రాంధ్రభాషను బాఠశాలయందు వివిధపాఠములలో నొకటిగఁ బఠించుటచే సంపాదించిన భాషాజ్ఞానలేశము గ్రంథకరణమునకుఁ జాలకపోవుటచేత భాషానియమములఁ దొలఁగింపవలయు ననుట న్యాయమగునా? నియమరహితకార్య మేదికాని ప్రకాశించునా? బహుపండితాచారసమ్మతంబుగ నమర్పఁబడిన నియమములను భాషాజ్ఞానహీను లగు కొందఱి సౌకర్యముకొఱకుఁ దొలఁగింపఁదగునా? ఒకవేళఁ బ్రస్తుతనియమముల దొలఁగించినను వీరు మఱికొన్ని నియమములనైన నేర్పఱుచుకొనక తీరునా? అనియమములైనను శ్రమచేసి

యభ్యసింపనిదే ఊరకయే సర్వజనులకును స్వాధీనము లగునా? కావున నియమము లెప్పుడును సర్వకార్యములకు ను నావశ్యకములు. ఒక్కొక్కనికిఁ గష్టముగఁ దోఁచునప్పుడెల్లను వానిని దొలఁగింపుమనుట సమంజసము కానేరదు. త్రాడు చాలదని నూతినిబూడ్పు మనున ట్లుండును.

నియమములు.

గీ. బహుళతర పండితాచార ♦ పద్ధతులనె
యరసి కూర్పఁగ నియమము ♦ లయ్యె జగతిఁ;
గాని యెల్లర బాధింపఁ ♦ గఠినుఁ డొకఁడు
సంతరించిన నిర్బంధ ♦ సమితి కాదు.

గీ. ఇట్టి నియతులు విద్యార్థు ♦ లెల్లరకును
గార్యసిద్ధిప్రదంబులై ♦ క్రాలుఁ గాన
వాని నేరను దొలఁగింపఁ ♦ బూను టనఁగ
గొడ్డుకాపరి పొత్తును ♦ గోర నట్లు. కవులు, పుట 15.

ప్రకృతకాలానుకూలంబుగ గ్రామ్యభాషయందు గ్రంథములను వ్రాయవలయు ననుట వీరి రెండవ ప్రయత్నము. ఇది యెంతవఱకాచరణీయ మను సంగతి నిటఁ జర్చింపవలసియున్నది. గ్రామ్యభాష యొకజిల్లాయం దుండునట్లు మఱియొకజిల్లాయం దుండుట లేదు. కావున నొకజిల్లావారికొఱకు వ్రాయఁబడు గ్రంథములు మఱియొక జిల్లావారికి ధారాళముగఁ దెలియవు. ఒకజిల్లాయందు లేని పదములును బ్రయోగములును ఇంకొక జిల్లాయందుఁ బెక్కులు కనవచ్చుచున్నవి. అట్టి పదములును బ్రయోగములును దెలియనపుడు వానిం దెలిసికొనుటకు నిఘంటుసాహాయ్య మేమాత్రమును లభింపదు. కావునఁ బ్రతిజిల్లాకొఱకును గ్రంథములను వేఱువేఱుగ వ్రాయవలసివచ్చును. వానికొఱకు నిఘంటువులను వేఱువేఱుగ వ్రాయనలసివచ్చును. మఱియు నట్టిప్రయోగముల కనుకూలముగనుండు సూత్రములతో వ్యాకరణమును గూడ వ్రాయవలసి వచ్చును. ప్రత్యేకనియమములతో చందస్సును నప్పుడే యావశ్యకమగును. ఇట్లు ప్రతిజిల్లాకును వేఱు వేఱుగ వ్రాయఁబడవలయును. ఒకవేళ దేశాభిమానాతిశయముచేత వీరుశ్రమపడి జిల్లా కొకటిచొప్పునఁ బెక్కులుగ వ్యాకరణములను, చందస్సులను, నిఘంటువులను గొల్ల గోవిందముగ నిర్మించినను వీరు విఫలమనోరథులే యగుదురు. ఏలయన నీ గ్రంథములు మాత్రము చదువనిదే స్వాధీనము లగునా? ఈ నియమములుమాత్ర మభ్యసింపనిదే

యలవడునా? అట్లు చదివి యభ్యసించునెడఁ సర్వసామాన్యములగు ప్రకృతనియమములే పనికివచ్చునుగదా. వీరి కీప్రయాస మెందుకు? ప్రకృతనియమాభ్యాసమునకంటె నూతన నియమాభ్యాసము సులువుగ నుండు నందురేమో. ఆమాటయు నీళ్ల మూట యే. ఒక వ్యాకరణమునకు బదులుగఁ బది వ్యాకరణములను, ఒక నిఘంటువునకు బదులుగఁ బది నిఘంటువులను జదువవలసివచ్చును. దానిచే మఱింత శ్రమ మెక్కుడగును. కలవరమును గలుగును. అంత శ్రమపడి చదువక యొకజిల్లాగ్రంథములతోడనే తృప్తిం జెందునెడ వారల జ్ఞానము కూపస్థమండూకజ్ఞానమే యగు ననుటకు సంశయ మేమియు నుండదు. కావున గ్రామ్యభాషాసహిత గ్రంథకరణోద్యమము మన కిసుమంతయుఁ బ్రయోజనకారి కాఁజాలదు. మీఁదమిక్కిలి నష్టకారి యగును. ఎట్లనఁగా మన పెద్దలు మనకొఱకు రచియించియుంచిన శాస్త్రపురాణకావ్య నాటకాదిగ్రంథముల గ్రహించు శక్తి మనకుఁ గ్రమక్రమంబుగ దూరమయి యంతరించును.

### గ్రామ్య భాష.

చ. పలువురు గ్రామ్యభాషకయి ♦ పంతములాడుచు దానఁ గబ్బముల్
వెలయఁగఁజేయఁగా మిగుల ♦ వేడుకఁ జెందుచు నున్నవార; లీ
తలఁపునఁ గల్గు బాధలు శ ♦ తంబులు వేలుగ నున్న; వన్నిటిం
దెలుప నసాధ్యమా నిట; సు ♦ ధీజను లెల్ల రెఱుంగునట్లుగన్
దెలిపెద నొండురెండు; గుణ ♦ ధీరులు సాదరదృష్టిఁ జూడుఁడీ;
కలిగిన భాష యెల్లెడల ♦ గ్రామ్యము గ్రాంథికమంచు రెండుగా
వెలయును; గ్రామ్య మెప్పుడును ♦ వే ఱగుచుండును బల్లెపల్లెకున్;
గలయఁగఁజూచి యెల్లెడలఁ ♦ గల్గిన గ్రామ్యమునందు శుద్ధమై
యలరెడి శబ్దరూపముల ♦ నన్నిటిఁ గబ్బములందుఁ గూర్పఁగా
వెలసెను గ్రాంథికం బనుచు ♦ వేఱుగ నిర్మలభాష; దీనిఁ గా
వలసినవార లెల్లరును ♦ వారల గ్రామ్యమునందుఁ గొన్ని మా
ర్పులఁ బచరించుకొంట కడు ♦ ముఖ్యము; గానను గ్రామ్యభేదముల్
తొలఁగుఁ; బ్రజాళికెల్లగ కె ♦ దో యొకభాషయెనిల్చు; దానికై
వలయు నిఘంటువుల్ మఱియు ♦ వ్యాకరణాదులు వార లెల్లరుం
గలిసి రచింత్రు; గాని యిది ♦ కాదని వెన్కను నీ ప్రపంచమున్
మలఁచి, యశుద్ధమైన తొలి ♦ మార్గములందుఁ బునఃప్రవేశమున్
గలుగఁగఁజేసి, గ్రామ్యమునఁ ♦ గబ్బములన్ రచియింపఁజేయఁగా

దులదుల పోవుటల్ ప్రజకు ♦ ధోగతిఁ జూపుటకాదె చూడుఁడీ!
పలసినఁ గొన్నిమార్పులన ♦ వారిగఁ బండితసమ్మతంబుగన్
సలుపుట యొప్పుఁగాని యొక ♦ వాఁడును దాని స్పృశింపనట్టి యా
యలఁతులత్రోవఁ బట్టి జగ ♦ మంతయు మార్చెదమంచుఁ బోయినన్
గలవరమౌను; దొల్తఁ జిర ♦ కాలసమార్జితమైన గ్రంథముల్
తోలఁగును; వ్యర్థమౌను; గుణ ♦ దోషవిమర్శనలేక భాషయున్
గలుషితమౌను; దోడనె జ ♦ గంబున నూరికి నొక్క భాషయై
తల కొక గ్రామ్య మాచు నిది ♦ తప్పిదియొప్పను దిక్కులేక క
ట్టలు తెగఁదీయఁగాఁబడు త ♦ టాకమురీతిని భాష యంతలం
తలఁబడి నామరూపములు ♦ తప్పి నిరర్థకమౌను; గాన నీ
విలయపు గ్రామ్యపద్ధతిని ♦ వీడుచు గ్రాంథికమైన భాషనే
కొలిచి సమస్తమానవుల ♦ కుంఠితభాగ్యముఁ గాంతు కావుతన్.

బ్రాహ్మణాద్యుత్తమజాతులవారు ప్రసంగించెడి యనింద్యగ్రామ్యమందైన గ్రంథముల వ్రాయఁగూడదా యందురేమో. అదియు సరికాదు. ఏలయనఁగా:—ఒక్కొక్క సంఘమునఁ గల యాచారములందును విద్యలందును నప్పటప్పటికిఁ గొన్ని దోషములు బహుకారణమూలములగుచుఁ జేరుచుండును. ఈ దృష్టాంతములఁ జూడుఁడు. పొగచుట్టలను బీడీలను సిగరెట్లను గాల్చుట, కల్లుసారాయులను త్రాగుట, నల్లమందుమాత్రలను మ్రింగుట, పొడుమును బీల్చుట, పసిపిల్లలకుఁ బెండ్లిండ్లు చేయుట, బాలికలను జారవృత్తికై వేశ్యలకు విక్రయించుట మొదలగునవి సంఘాచారదోషములు. 2 చిత్రలేఖకుఁ డొక సింగమును రంగులతో వ్రాసి దాని వక్షస్థలమం దొక చిన్న పద్మమును విలాసముగ వ్రాయును. దానిం జూచి యింకొక లేఖకుఁ డా ప్రదేశమందే యొక చిలుకను వ్రాయును. మఱియొకఁడు దాని కన్నులచుట్టును రంగులచుక్కలతో నగిషీపని చేయును. వేఱొకఁడు దాని తోఁకపొడుగునను రంగులచాఱలను వ్రాయును. ఇట్టివి చిత్రలేఖనవిద్యాదోషములు. 3 వ్యాయామవిద్యాభ్యాసకుఁడు గట్టి యాహారమును దినునెడ గట్టిబలము పట్టునని జలపానమును తగ్గించి గట్టిపదార్థములనే భుజింప మొదలుపెట్టును. ఎక్కువ బరువు గల యుపకరణములతో సాధకముఁ జేసిన యెడ నెక్కువబలము కలుగునని తన శక్తికి మించిన బరువుగల సాధనములతో సాధకమును జేయును. ఇత్యాదులు వ్యాయామవిద్యాదోషంబులు. 4 గాయకుఁ డొకఁడు నోరుమూసికొని ముక్కుతో ఉంఉండోండోం అనుచు గానమును బాడును. ఇంకొ

కఁడు మహాసవ్యాకరముగనుండు ముఖవికారదోషములతోఁ బాడును. ఇట్టివి గానవిద్యాదోషములు. 5 ఈలాగే ప్రాసంగికుఁ డొకఁడు తాను నిర్దుష్టభాషావిదుఁడయ్యు 'వెళ్లెదను, వెళ్లుదును' అనుటకు బదులుగ వెళ్లుతాను, వెళుతాను, వెళతాను, వెళ్తాను, వెళ్తా అనెడి యాభాసరూపములను బ్రయోగించును. ఇంకొకఁడు వెడలెదను వెడలుదునుఅనుటకు వెడుతాను, వెడతాను, వెడతా, వెడ్తా అను నాభాసరూపములఁ బ్రయోగించును. ఇట్టివి సాహిత్యవిద్యాదోషములు. ఇవ్విధంబుగ సంఘాచారములందును, వివిధవిద్యాపద్ధతులందును దోషములు కన్పట్టునపుడు గ్రంథములందు వానిని ద్యజించుటచేతను నిరసించుటచేతను వాని నిరుత్సాహపఱుచుచు, గుణము లుండునపుడు పన్నెట్టి ప్రకాశింపఁజేయుటచే వానిని బ్రోత్సాహపఱుచుచు నిట్లు దోషరాహిత్యమునకును గుణాధిక్యమునకును బ్రయత్నించుట సంఘకర్ణధారులగు గ్రంథకర్తలకుఁ దగిన ధర్మ మగును. కాని వానియందలి దురాచారములకును, దోషములకును బ్రాముఖ్యమును గల్పించి, వానిని, గ్రంథస్థముచేసి, వానికి శాశ్వతత్వమును గల్పించుట యుచితధర్మ మగునా? కావున నుత్తమజాతులవారును బ్రసంగింతు రను కారణముచే గ్రామ్యమును గ్రంథస్థము చేయుట యుక్తము కానేరదు.

## దోషము దోషమే.

ఉ. దోసమ దే రొనర్చినను ♦ దోసమె యయ్యెడుఁగాని పెద్దలుఁ
జేసిరటన్న కారణము ♦ చే గణనీయముకాదు; కాన న
భ్యాసముచేతఁ బెద్దలును ♦ బల్కినమాత్రముచేత గ్రామ్యపుం
బాస విశుద్ధమౌచుఁ గవి ♦ పండితగణ్యము కాఁగనేర్చునే?

ఈ విషయమునే దృష్టాంతసహితముగఁ గూడ నొక్కింత మనవిచేయుదును. "నీ వేమి చేయుచున్నాఁడవు? నీ వేమి చేయుచున్నవాఁడవు?" ఈ రెండు రూపములును సాధువులు; స్వభావోక్తులు. "భవదీయ చిత్తం బే దుర్ఘటకార్యఘటనావ్యవసాయంబునం దగిలి నొగులుచున్నయది?" ఇదియు సాధువే; పైయభిప్రాయమునే తెలుపుచున్నది. కాని యిందుఁ బ్రధానవిషయంబునకన్నఁ గవిప్రజ్ఞయే యెక్కుడుగఁ గలదు. ఎప్పుడుగాని, యే విద్యయందుఁగాని ప్రధానవిషయమునకు మించిన ప్రజ్ఞా

---

☞ బాలురకొఱకును బాలికలకొఱకును సంధుల విడదీయుట, ద్రుతముమీఁద సరళాక్షరప్రయోగమును వదలుట లోనగు నియమములతో గ్రంథముల వ్రాయుట యీ గ్రామ్యభాషాపద్ధతిలోఁ జేరదు.

ప్రకటనము విజ్ఞుల దృష్టియందు తలకు మించిన తలగుడ్డవలె హాస్యాస్పదంబుగనే యుండును. ఈ వాక్యమందు "దుర్ఘట, నొగులు" అనుపదములు యమకముకొఱకును డంబముకొఱకును జేర్పఁబడినవి. ప్రజ్ఞాప్రకటనాపేక్ష యను మనోదౌర్బల్య మెచట నుండునో వ్యర్థకార్యాచరణ మచటనే యెడబాయక నీడవలె నుండును. కావున నిది యుక్తము కాదు. ఇచటఁ బ్రజ్ఞను నిరసించుచుంటి నని మాత్రము చదువరులు భ్రమయఁ జనదు. అలంకార మెప్పుడును బ్రధానవిషయమునకు వన్నెవెట్టి ప్రకాశింపఁజేయుచుండ వలయుఁగాని ప్రధానవిషయమును మఱుఁగుపఱిచి తాను ప్రకాశించుచుండుట తగ దని మాత్రమే నా యాశయము. పైవాక్యమునే గ్రామ్యభాషయందుఁ జెప్పి చూచెదను. ఎట్లు చెప్పుదును! ఏ తప్పురూపమును జెప్పుదును! ఒప్పునకు నియమము కలదుగాని తప్పునకును నియమముకలదా? ఇం కెన్ని తప్పులను జేర్తును! అయినను బ్రయత్నింతును. "నీ వేమి చేస్తున్నావు? నీ వేమి చేస్తూన్నావు? నీ వేమి చేస్తూ వున్నావు? నీవేమి చేస్తూ యున్నావు? నీ వేమి శాస్తా వుండావు? ను వ్యాంయి శాస్తుండావు?" అబ్బో! భయ మగుచున్నది! ఇందలి యొక్కొక్క యక్షరముపైని మూఁడు నాలుగు దోషములఁ జేర్చుచు వ్రాయునెడ సుమారు రెండువందలకుఁ దక్కువకాని రూపము లేర్పడునని కన్పట్టుచున్నది. ఇట్టి నియమరహితమైన మార్గమందు భాషను బెట్టుట న్యాయము కాదు. కావున మొదటి సాధువులయిన రెండు రూపములను అట్టులే గాని వాని కించుక మెఱుఁ గిడికాని యుపయోగించుకొనునెడ వీరి యభిప్రాయము చక్కఁగా నెఱవేఱును. భాషాసాంకర్యదోషము తొలఁగును.

స్వభావశైలి.

జనులకు భాష నైజమగు; ♦ సంఘవశంబున గ్రామ్య భేదముల్
గనుపడు దానిలోనఁ; దన ♦ ప్రజ్ఞయటంచును మాతృభాషనే
ఘనముగ వ్రాయఁ దక్కవి; జ ♦ గంబున భాషల నివ్వి రెండునుం
బెనఁగొని, క్రిందుమీఁదులకు ♦ మిక్కిలి యీడ్చి, స్వభావసిద్ధమై
తనరెడి నైజపద్ధతికి ♦ దవ్వుగఁ జేయును; వీని రెంటినిన్
జనులు త్యజించుచుండెదరు; ♦ చక్కనిభాషను సంకరంబుగాఁ
బొనరుచు గ్రామ్య మెప్డుఁ; దగు ♦ బోధనలేని వృథాప్రశంసచేఁ
దనరు కవీశుదంభ; మివి ♦ తప్పని బంధము లయ్యె భాషకున్;
గనుక సమస్తమానవులు ♦ కైకొనఁజాలు స్వభావశైలినే
బనిగొని గద్యపద్యములఁ ♦ బాటల వ్రాసిన భాష కష్టమం

-నను కవిదంభదోష మడు ♦ గంటును; భాషకు గ్రామ్యసంకరం
బనియెడి దోష మూడు; జను ♦ లందఱు దాని గ్రహింత్రు; భాష బం
ధనరహితంబునొంది తన ♦ ధర్మముఁ బూర్తిగఁ జేయు; గాన ధీ
జనులు స్వభావశైలి నని ♦ శంబును వ్రాయుచు నుంద్రు కావుతన్.

ఈ మూఁడవతరగతి కవులు వివిధవిద్యాపరిశ్రమ చేయుటయం దన్యభాషను ప్రధానముగఁ జేకొని యాంధ్రభాషయందు మాధుకరజ్ఞానమును మాత్రము సంపాదించువారు. కావున వీరిలోఁ బెక్కండ్ర యాంధ్రశబ్దార్థజ్ఞానము గ్రంథీకరణమునకుఁ జాలి యుండదు. ఆ లోపమును బూర్తిచేసికొనుట మిక్కిలి కష్టము. ఎవనికిఁగాని సర్వజ్ఞత్వము లభించుట దుర్ఘటము. కావున వీరు తమ గ్రంథములను శబ్దశాస్త్రవేత్తలచే సవరించుకొని వీలగునంతవఱకు వానిని నిర్దుష్టముగనే ప్రచురించుచుండవలయుఁ గాని విస్సప్ప చెప్పినదే వేదము అనునట్లు తాము వ్రాసినదెల్ల శాస్త్రమును సవరించుకొమ్మనుట ధర్మముకాదు.

## ఉపన్యాససారములు.

1. స్వతంత్రగ్రంథములఁ బ్రోత్సాహపఱుచుట.

2. ఆంధ్రగ్రంథములం దాంధ్రపదములకంటె గీర్వాణపదములు తక్కువగ నుండున ట్లొనర్చుట.

3. పండితులందు వివిధవిద్యాజ్ఞానమును బ్రోత్సాహపఱుచుట.

4. కేవలకవిప్రజ్ఞను జూపు గ్రంథములకంటె విషయతత్త్వబోధకములగు గ్రంథముల నెక్కుడుగ మన్నించుట.

5. శిల్పవిద్య లన్నిటియందును గ్రంథముల వ్రాయించుట; అట్టి గ్రంథముల వ్రాయువారికిఁ దగు ప్రోత్సాహమును గలిగించుట.

6. మూఁడవతరగతికవులనుండి భాషాసాంకర్యములేక నిర్దుష్టముగనుండు గ్రంథములే వెలువడునట్లు శ్రద్ధపుచ్చుకొనుట.

ఈ పద్ధతులను దేశాభిమానులు భాషాభిమానులు నగు చదువరు లెల్లరు నవలంబించునెడ మన యాంధ్రభాష శీఘ్రకాలముననే యభివృద్ధి నొందఁగలదు. అట్టి సంకల్పము నాంధ్రమహాజనుల కొసంగును గాక యని పరమేశ్వరుఁ బ్రార్థించుచు నీ విషయము నింతటితో ముగించుచున్నాఁడను.

### భాషావృద్ధి.

సీ. తలి తోఁక మార్చి పె♦ద్దల పోకడలఁ దూర్చి - కబ్బముల్ వ్రాసెడి ♦ఘను డొకండు
పదిట నొండునునాంధ్ర♦పదముంచకయె వ్రాసి - తెలుఁగిదియనియాడు ♦ధీరుఁడొకఁడు
బోధ నంతయు లేని ♦ పొల్లు నుద్దులతోడ - నాటలాడఁగఁ జూచు ♦ మేటియొకఁడు
తన కవిత్వంబె సి♦ద్ధాంతంబు శాస్త్రముల్ - ససరింపు మనియెడి ♦ జాణయొకఁడు

గీ. కవులుకాఁగ భాషావృద్ధి ♦ కలుగు టెట్లు?
[1] తాను లోకముఁ దరిచి, [2] స్వ ♦ తంత్ర ముంచి,
[3] సహజశైలిని [4] సద్బోధ ♦ సలుప నెంచి,
కవిత [5] నిర్దుష్టముగఁ గూర్పఁ ♦ గలుగు మంచి.

---

## 15. రైతులు.

ప్రపంచమునందుఁ గల వృత్తు లన్నిటిలోను మిక్కిలి ముఖ్యమైనదియు, గౌరవపాత్రమైనదియు, సర్వదేశములందును సర్వకాలములందును సర్వజనులయొక్క సుఖజీవనమునకు మూలాధారమైనదియు నగు వృత్తి సేద్యము. దీనిని, కృషి, వ్యవసాయము ననియుఁ జెప్పుదురు ఈ వృత్తిని జేయువాతఁడు రైతు. ఈతఁడు సేద్యకాఁడు, కర్షకుఁడు, కృషికుఁడు, కృషకుఁడు, కృషాణుఁడు, కృషీవలుఁడు అనియుఁ బిలువఁబడుచున్నాఁడు. ఈతఁడు నిష్కాపట్యము, అమాయికత్వము, దైవభక్తి యను గుణములకుఁ దన వృత్తిచేతనే అలవాటుపడుచున్నాఁడు. ఈ వృత్తి చేయువారిలో మాయావి నూటికొక్కరుఁడైన నుండఁడు. రైతునకు మాయికులతోడి సంబంధము ను మిక్కిలి తక్కువ. ఈతనికి భూమితోడనే నిరంతర సంబంధముకలదు. ఈతఁడు తన యాలుబిడ్డలఁ గూడి తన యెద్దులతో శ్రమపడి, పనిచేసి, భూమిని జక్కఁజేసి, దున్ని, విత్తనములను జల్లి, వర్షసాహాయ్యంబుఁ గోరి మిన్నుచూచుచుఁ, బరమేశ్వరుఁ గృపాప్రాప్తికై ధ్యానించుచుండును. కొన్ని సమయములందు బావి, చెఱువు, కాలువ లోనగువాని నీటిచేఁ బండింపఁజూచినను ఆపంటకు చీడ తెగులు అతివృష్టి లోనగు నవాంతరప్రతిబంధకములచే నష్టము కలుగకుండ నొకగింజకు నూఱుగింజలు ఫలించున ట్లనుగ్రహింపు మని యా పరమేశ్వరుఁ బ్రార్థించుచుండును. ఇట్లీతఁడు సర్వదా భూమిని, ఈశ్వరసాహాయ్యమును మాత్రమే నమ్ముకొని జీవించువాఁడుగ నుండుటచేత నీతని వృత్తియం దీతనికి మోసము

తోడ నావశ్యకమే కన్పట్టుట లేదు. శ్రద్ధ, ఓపిక, జాగరూకత, స్వాభిమానరాహిత్యము లోనగు విధినిర్వహణావశ్యకధర్మములందు రైతునకు సాటి మఱియొకఁడు సాధారణముగ నుండఁడు. ఈతఁ డెండవానలకు వెఱవఁడు. పగలు రాత్రి యని భేదమెంచఁడు. అనావశ్యకసౌఖ్యములకయి భ్రాంతిఁ జెందఁడు. నడుము కట్టుకొని, పాఱ చేతఁ దీసికొని, రొంపిలోనైన దిగి, పనిచేయును. ఒక్క దుప్పటిఁ గప్పుకొని చేని దరిని రాత్రులు కావలికై చొప్ప, వరిగడ్డి, తాటాకులు లోనగువానిపైఁ బరుండును. పంటకాలములో నచటనే యొక చిన్న గుడిసెను వేసికొని, యీతఁడు తన భార్యతోడను బిడ్డలతోడను రేలుంబవళ్లచటనే నివసించి, యా పైరును గోసి కుప్పవేయువఱకు నేమఱక, కంట వత్తిడుకొని కావలికాయును.

అమాయికుఁడు.

సీ. కడునోర్పుతోఁ గాయ ♦ కష్టంబు నొనరించు - పనులతో నేప్రొద్దుఁ ♦ బాటు పడును
పృథివి నెంతయు దున్ని, ♦ విత్తి, నాటి, సకాల - వృష్టి కీశ్వరు కృపా ♦ వృష్టి వేఁడు
అమ్మ! భూదేవి! మా ♦ యమ్మ గింజకు నూఱు - గింజ లిమ్మని కొల్చి ♦ కేలు మోడ్చు
పసిపిల్లలను దల్లి ♦ పాలఁ బెంచెడిరీతి ♦ పైరు నేవేళఁ గా ♦ పాడి పెంచు
గీ. నిట్టి దినచర్య రైతున ♦ కెల్ల గతుల
నోర్పు భక్తిని శ్రద్ధనిం ♦ పొనరఁ గూర్చు
ననుధఁ గల బహు వృత్తుల ♦ వారి లోన
మాటికిని రైతు మిగుల న ♦ మాయికుండు.

ఈదేశపు రైతునం దొక దోషము ప్రబలముగ నున్నది. అది విద్యాజ్ఞానలోప దోషము. ఎప్పుడు చూచినను భూమిఁ, నాఁగలి, యెద్దులు మొదలగువానితో మాత్రమే తనకు సంబంధ ముండుటచేత భూమిని దున్నుటకుఁ గాని, నాఁగటిని బట్టుకొనుటకుఁ గాని, యెద్దులను దోలుటకుఁ గాని తనకు విద్యతో నావశ్యక మేమియు లే దని తలఁచుచున్నాఁడు. తనకు విద్య రాకయుండినను దన కొమరుని విద్యనుగూర్చియైన జాగ్రత్తపుచ్చుకొనక యుపేక్షించుచున్నాఁడు. విద్య లేనియెడఁ దనకును దాను దోలెడి పశువులకును భేదము లేకపోవు నను సంగతిని గ్రహించుట లేదు. ఈ రైతుల స్థితిని జక్కఁబఱుపఁ బ్రయత్నించెడు కొందఱు విద్యాధికుల ప్రోద్బలముచేత వీరి గ్రామమందు వీరి పిల్లలకొఱకుఁ బాఠశాల యొక్కటి తఱచుగా నేర్పఱుపఁబడుచుండును. కాని వీరి పిల్లలా పాఠశాలకు నెలలో నైదుదినములయినను బోవుదురని తలఁచుటకు వీలు లేదు. దీనికిఁ గారణములు రెండు కలవు. 1 రైతు తన పిల్లవానికి విద్య యనావశ్యక మని తలఁచుట.

2 ఈ పిల్లవాఁ డైదేండ్లవయస్సుననుండియుఁ బొలపుఁబనులయం దక్కఱకువచ్చుట. ఈ రెండుకారణములచేత నీతనికి బాల్యమునుండియు విద్య యబ్బుట లేదు. ఈతని నైదేండ్ల ప్రాయముననుండియుఁ బశువుల మేపుకొనివచ్చుటకును, పొలమునొద్దఁ బిట్టలను దోలుచుఁ గావలియుండుటకును, చేనిలోని కలుపుని దీయుటకును, పొలమునొద్ద నుండువారి కాహారమును దీసికొనిపోవుటకును దలిదండ్రులు తఱచుగా నియమించుచుందురు. ఇట్టి పనుల నుండి తప్పించి యీతని బడికిఁ బంపవలసివచ్చుటచేతఁ జదువు తమ పాలిటి కొక ప్రతిబంధకముగఁ దలఁచుచుందురు.

## ప శు మా న వ భే ద ము.

చం. చదువిది యేల మాకు వ్యవ ♦ సాయముఁ జేయఁగ? నేల దున్ననో!
మొదవులఁ గాయనో! కసవు ♦ మోయనో! నాఁగటి మేడిఁ బట్టనో!
యిది యని పల్కుఁగాని యర ♦ రే! పశుమానవభేద మెంచఁగాఁ
జదు వొకటే యటం చెఱుఁగఁ ♦ జాలఁడు పాపము రైతు చూడుఁడీ!

ఇట్లు చిన్నతనమునుండియు విద్యాహీనుఁడుగఁ బెరుఁగుటచేత నీతని వేషభాషల యందుఁ గాని వృత్తివ్యవహారములందుఁగాని లేశమాత్రమును నభివృద్ధి కనవచ్చుట లేదు. దేశమునందలి ప్రతివిషయమును నిరంతరమును మార్పును జెందుచు దినదినాభివృద్ధి నందుచున్నది. పదివత్సరముల క్రిందటిస్థితికిని బ్రస్తుతస్థితికిని తారతమ్యమును జూచినయెడ వర్తకము, చేతిపనులు, చదువు మొదలగువానియం దభివృద్ధిసూచకము లగు మార్పు లెన్నియో ప్రత్యక్షముగఁ గనవచ్చుచున్నవి. రైతుమాత్ర మేఁబదివత్సరముల క్రిందట నెట్లుండెనో నేఁడు ను నట్లే యున్నాఁడు. పొలమున కెరువువేయుట, నీరుకట్టుట, దున్నుట, నాఁగలి నమర్చుకొనుట, విత్తనముల సేకరించుకొనుట లోనగు కార్యములం దెల్లను బూర్వపుఁబద్ధతినే యవలంబించుచున్నాఁడు. లేశమాత్రమును మార్పును జెందుట లేదు. ఈపను లన్నిటియందును రైతు గ్రహింపవలసిన యభివృద్ధికరపద్ధతు లెన్నియో లెక్కకు మీఱియున్నవి. ఆ పద్ధతుల నన్నిటిని రైతు గ్రహించునెడ నాతనివృత్తి మిక్కిలి జయప్రదముగ నడువఁగలదు ఆ పద్ధతు లీతనికి లభించుట యెట్లు? వాని నన్నిటిని గూర్చి వేఱువేఱుగ విపులముగ వ్రాయఁబడిన గ్రంథము లాంగ్లేయభాషలో ననేకములు కలవు. ఇటీవలఁ గొందఱు బుద్ధిశాలు లందలి విషయములను భాషాంతరీకరణమొనరించి యాంధ్రభాషలోఁ బ్రచురించుచున్నారు. అట్టిగ్రంథముల సారమును రైతు ముఖ్యముగఁ గ్రహింపవలసియున్నది. మఱికొందఱు వార్తాపత్రికలందు వ్యాసరూపముగఁ గొన్ని విశేషములఁ బ్రకటించుచున్నారు. రైతు వానిని ముఖ్యముగ నెఱుఁగవలసియున్నది. దేని నెఱిఁగినను

అది యెంత యుపయోగకరముగ నుండినను రైతు దాని నవలంబించుటకు మాత్రము సాహసింపఁడు. తన తాతగా రవలంబించిన ప్రాత పద్ధతినే తాను నవలంబింపఁ జూచు చుండును. కాని యా రైతులలో నెవ్వరైన నొక్కఁ డొక నూతనపద్ధతి నవలంబించి పదిరూపాయల లాభమును సంపాదించినట్లు కన్పట్టునెడ నెట్టెట్టులోఁ బెనఁగులాడి దాని గుట్టెల్లఁ గనిపెట్టి తాను నట్టి లాభమును బడయ క్షమకట్టును. దీనిం బట్టి చూడ మార్గదర్శకు లెవ్వరైన నుండునెడ నిప్పటిరైతు వారి నూతనపద్ధతులను జూచి, యలవఱుచుకొని, కొంత యభివృద్ధి నొందఁగలఁ డని కన్పట్టుచున్నది. అట్టి మార్గదర్శకు లెట్లు లభింతురు? ప్రభుత్వమువారే మార్గదర్శకు లగుటకు సంకల్పించి కొన్ని జిల్లాలలో వ్యవసాయశాలల నేర్పఱిచి కొంత ప్రయత్నించిరి. కాని ప్రజలు వానిని విదేశానుకూల పద్ధతులుగ భ్రమసి స్వీకరింపరైరి. ఇప్పుడిప్పుడు వీరి పిల్లలలోఁ గొందఱు పెద్దపరీక్షలవఱకును జదివి విద్యాధికు లగుచున్నారు. కాని వారు కృషి నీచమైనవృత్తి యని కొని పదియిరువదిరూపాయల జీతమునకై యెచ్చటనో సేవావృత్తి నవలంబించుచున్నారు. వార లీ పొరపాటును దిద్దుకొని, దురభిప్రాయమును వదలుకొని, వ్యవసాయసంబంధమగు గ్రంథములఁ దెప్పించి, చదివి, యా నూతనపద్ధతులను దేశకాలపాత్రానుగుణముగా నవలంబించి, తామే యితరులకు మార్గదర్శకులైనచో మిక్కిలి మేలు కలుగును. సాటి రైతులు వీరి పద్ధతులను దప్పక స్వీకరింతురు.

## సే వా వృ త్తి.

గీ. ఒకని యాజ్ఞకుఁ దలయొగ్గి ♦ యొదిఁగి యొదిఁగి
చేతు లను గట్టుకొని చేయు ♦ సేవ ఘనమొ;
దైవదత్తంబు మఱియు స్వ ♦ తంత్ర మైన
కృషివి దున్నెడి వ్యవసాయ ♦ వృత్తి ఘనమొ.

రైతు గ్రహింపవలసిన ముఖ్యవిషయము మఱియొకటి కలదు. వ్యవసాయమునకు వర్తకముతోడ నెడతెగని సంబంధము కలదు. రైతు తాను బండించు పంట నంతను దానే భుజించుట లేదు. విశేషభాగమును వర్తకులకు విక్రయించుచున్నాఁడు. ఆ వర్తకుఁడు తాను విక్రయింపఁదలఁచిన దేశమందే సరకునకు మిక్కిలి యావశ్యకము కలదో యా సరకు నచట నెక్కువవెల పెట్టియైన వెంటనే కొనును. కావున రైతు తానే యాయా దేశవృత్తాంతములను ముందే తెలిసికొని అచ్చట వెంటనే విక్రయమగు పదార్థములను గనిపెట్టి, వానివాని కనుకూలమగు నెరువులను దన పొలమునకు వేసి, యాయా పదార్థములను బండించునెడ నతనికి లాభము తప్పక కలుగుచుండును.

ఇట్లన్యదేశవృత్తాంతముల నెఱుఁగుటకు రైతునకు మార్గ మెద్ది? పత్రికాపఠనమే. వార్తాపత్రికలవలె నింత సులువుగా నింత శీఘ్రకాలములో నన్యదేశసమాచారములఁ దెచ్చి చేతి కందిచ్చు మార్గ మింకొకటి లేదు. రైతులు పత్రికాపఠనమున కలవాటుపడునెడఁ బత్రికాధిపతులు ప్రతిపర్యాయమును వీరికి వలయు విషయమును గొంత వ్రాయుటకు వెనుదీయరు. కొంతకాలములో వీరికొఱకుఁ బ్రత్యేకపత్రికలే వెలువడ వచ్చును.

మనదేశమందలి ప్రకృతకాలపు రైతు లభివృద్ధినొందుటకు రెండు ప్రతిబంధకములు కలవు. వానిం దొలఁగించినఁగాని రైతు బాగుపడఁడు. అవెవ్వియనఁగా:—రైతు ధనహీనుఁడు. వ్యవసాయదినములలోఁ దన పనిపాటలవాండ్ర కిచ్చుటకు ధనములేక మిక్కిలి చిక్కులుపడుచుండును. అట్టి సమయమందు వర్తకుఁ డాతనికి నెల 1 కి రూపాయకు అణాచొప్పునను మఱియుఁ జిక్కుగల సమయములందు రెండేసి యణాల చొప్పునను వడ్డీమీఁద సొమ్ము నప్పిచ్చుచుండును. మఱియుఁ బంట చేనిమీఁద నుండఁగనే యా పంటనంతను దనకు విక్రయించునట్లు మిక్కిలి చౌకధరతో నప్పుడే బేరమును దీర్మానించుకొని కొంత ధనమును రైతున కప్పుడే యిచ్చుచుండును. అనంతర మా పంట నంతను దీసికొని బజారునందు గిరాకీగల సమయమందు విక్రయించుకొని దాని లాభము నంతను వర్తకుఁడు పొందుచుండును. కావుననే మనదేశమందు శరీరకష్టము పడి పనిచేసెడి రైతు పేదవాఁడుగను, కూర్చుండి వ్యవహారమును నడపించెడి వర్తకుఁడు ధనవంతుఁడుగను నున్నారు. ఈ కారణముచేత రైతు వృద్ధినొందఁజాలకయున్నాఁడు. అతని యభివృద్ధి కిదియే ప్రథమప్రతిబంధకము.

గీ. చౌకగాఁ బొలముపైపంట ♦ జట్టి యిచ్చి
విధుల నెఱవేర్చుకొని రైతు ♦ పేద యగును;
ప్రియమ్ము గలయప్డు దాని వి ♦ క్రయ మొనర్చి
ప్రబల ధనవంతు డగుచుండు ♦ వర్తకుండు.

2. పొలములకు ఎరువువేయుటకు పాటిమన్ను నుపయోగించుటతప్ప మఱియొక పద్ధతి వీరికిఁ దెలియనే తెలియదు. ఆ పాటిమన్ను వీరి కెంతకాలము లభించును? పెరటిదొడ్లయందును, ఇండ్లచెంతలను ద్రవ్విద్రవ్వి చేలలోఁ బోసిరి. ఇంకఁ ద్రవ్వనెడ నట్టి గోతులు బావు లగును. దొరకునంతవఱకుఁ బెంటకుప్పలను బోయుదురు. అవి పొలములకుఁ జాలవు. ఇం కేమి చేయుదురు? ఏమియు లేదు. పంట దైవాధీన మని యూరక యుందురు. ఎముకల పొడి, సూపర్ అను పొడి, కానుగ మొదలగు కాయల

పిప్పి, ఆముదము, సల్ఫేట్ ఆఫ్ పొటాసు మొదలగు పదార్థములతో నెరువులను సిద్ధము చేసికొను పద్ధతులు వీరికిఁ దెలియవు. ఒక్కొక్కఁడు వీనిని బ్రత్యేకముగ సిద్ధముచేసి కొనుటయు దుర్లభము. మఱియుఁ బూర్వకాలపు నాగటికి రెండెద్దులను గట్టి సుమారు అఱుగులోతు మాత్రము తెగునట్లు దున్నుట తెలియును. నాలుగైదు జతల యెద్దులను గట్టి సుమారు గజములోతువఱకును తెగెడి నాగటితో దున్నుట యీ రైతునకుఁ దెలియదు. తెలిసినను ఒక్కొక్కఁ డంత ధనమును వెచ్చించి యట్టి నాగటిని బెట్టుకొని భరింపఁజాలఁడు. మఱియు మంచి విత్తనములకొఱకైనఁ బ్రయత్నింపఁడు. తన చేనిలోఁ బండిన గింజలలోనే కొన్నిటిని దీసి విత్తనములుగా నుపయోగించును. పూర్వపుఁబద్ధతి నే యవలంబించి యేదోవిధముగ దున్ని, యేదో యెరువు వేసి, యేవో గింజలను జల్లి, యూరకుండును. ఇది ద్వితీయప్రతిబంధకము.

ఈ రెండు ప్రతిబంధకములను దొలఁగించుట కొక్క సులభమార్గము కలదు. ఒక్కొక్క గ్రామమునందలి రైతులు గాని రెండుమూఁడు గ్రామములందలి రైతులు గాని యొకటిగాఁ జేరి "అన్యోన్యసాహాయ్యసంఘము" అను పేర నొక సంఘముగా నేర్పడవలయు. అందఱును వారివారి శక్తికొలఁదిని చందాలువేసి కొంత మూలధనమును జేర్పవలయు. దానితోడ విలువగల నాగలి, యెద్దులు మొదలగువానిని గొని యుంచి భరించుచు రైతులకు ఎకరమున కొక్కటికిఁ గొంత నియమిత ధనమును దీసికొని వీని నొసఁగుచుండవలయు. మంచి విత్తనములను దెప్పించి రైతులకు విక్రయించుచుండ వలయు. ఎరువులను సిద్ధముచేయించి రైతుల కమ్ముచుండవలయు. పంటదినములలో బీదరైతులకు నూటికి నెల కెనిమిదణాలకు మించని మితమైన వడ్డికి ధనము నప్పిచ్చుచుండ వలయు. ఇట్టి సంఘము లేర్పడి యివ్విధముగఁ బనిచేయుచుండునెడ రైతులు తప్పక బాగుపడుదురు. వారి పంటలు చక్కఁగఁ బండును. వడ్డినష్టము తగులదు. తన పంటను బజారునందు గిరాకీగల సమయములోఁ దానే స్వయముగ విక్రయించుకొని దాని లాభమును దానే పొందఁగలఁడు.

కావున రైతులు చదువు నభ్యసించి, గ్రంథపఠనమూలమునఁ గృషిధర్మముల నెఱుఁగుచు, వార్తాపత్రికాపఠనమూలమున గ్రామాంతర దేశాంతర సమాచారములఁ దెలిసికొని యాయా దేశములం దావశ్యకములగు పదార్థములనే పండించుచు, అన్యోన్య సాహాయ్యసంఘముల నేర్పఱుచుకొనుటచేఁ దమ వృత్తియందు నూతనసౌకర్యములఁ జేర్చుకొనుచుఁ గృషిచేసి తాము మేలొందుటయగాక దేశమునకును మేలొనరించునట్లు పరమేశ్వరుఁ డనుగ్రహించునుగాక.

రైతు.

సీ. నేల దున్నెడివారి ♦ కేల మా కీ విద్య? - యని నిరక్షరకుక్షి ♦ యగుచు నిలిచి
తాతకాలమునాఁటి ♦ ప్రాఁతపద్ధతితప్ప - నన్య మెట్టిదియైన ♦ నవలఁ ద్రోచి
కడఁగి వార్తాపత్రి ♦ కలఁ జూడ నెఱుఁగక - యల కూపమండుక ♦ మట్లు బ్రతికి
యే దేశమున నెప్పు ♦ డెయ్యది వలయునో - కని దానిఁ బండింపఁ ♦ గడఁగలేక
గీ. విద్య నేర్చిన సేవకా ♦ వృత్తి కేగి,
యకట రైతు నిరర్థకుఁ ♦ డగుచు నిలిచె;
చదువ నేరిచి, దేశంపు ♦ జాడ లరసి,
వలయు రీతిని బండింప ♦ వలయు రైతు.

---

## 16. వైశ్యులు.

దేశమున కావశ్యకమగు వృత్తిద్వయములో వర్తకము రెండవది. దీని నిపుడీ దేశమున దాదాపుగ సర్వవర్ణములవారును జేయుచుండినను దీనినే తమ కులవృత్తిగఁ జేకొని బహుతరములనుండి యనాదిగఁ జేయుచుండినవారు వైశ్యులు. ఆర్యు లొనరించిన వృత్తివిభజనప్రకారను పూర్వమందుఁ గృషివాణిజ్యవృత్తుల రెంటిని వైశ్యులే యొనరించుచుండిరి. కాలక్రమాగతమైన మార్పులచేత నేలయో కృషి శూద్రులవంతునకుఁ బోయి వాణిజ్యముమాత్రమే వైశ్యులలో నిలిచినది. ఇటీవల వీరిలోఁ గొంద ఱితరోద్యోగములచేతను, సేవావృత్తిచేతను జీవించువారుగ నుండినను వీరిలోఁ బెక్కండ్ర కిప్పటికిని వణిగ్వ్యాపారమే వృత్తిగ నున్నది.

ఈ వర్తకముచేతఁ బ్రజలకుఁ గలుగు ప్రయోజనము లిన్ని యని చెప్ప నలవి కాదు. ఇది కృషికి సన్నిహితమిత్రము. దీని సాహాయ్యము లేనిచోఁ గృషీవలుఁడు తాను బండించిన యొకటిరెండు పదార్థములనే సదా భక్షించి జీవింపవలసివచ్చును. అది యసాధ్యము. మఱియుఁ దన పదార్థము నెవ్వరికో తక్కువవెల కిచ్చుకొనవలసి యుండును. కృషి కేతరజనంబులకో సమస్తపదార్థములును సర్వసౌకర్యములును వర్తకుని చేతినుండియే రావలసియున్నవి. తినుట కాహారము, కట్టుకొనుటకు బట్ట, వసించుటకు గృహనిర్మాణసామగ్రులు, చదువుకొనుటకు గ్రంథములు, వ్రాసికొనుటకుఁ గలములు కాగితములు లోనగు పదార్థము లన్నియు వణిగ్జనహస్తములనుండియే వచ్చుచున్నవి. ఇంగ్లండు, ఫ్రాన్సు, అమెరికా, జర్మనీ, జపాన్ మొదలగు దూరదేశములనుండి రమ్యతరపదార్థముల నెల్లఁ దెచ్చి మన చేతుల కందిచ్చుచున్నవారు వణిజులుకాక మఱెవరు? వీర లిచటి

నుండి పదార్థములఁ గొనిపోయి యన్యదేశములందు విక్రయించి, యిచట లేని నూతన పదార్థముల నచటినుండి కొనివచ్చి యిచట విక్రయింతురు. దీనిచేత నుభయదేశస్థులకును స్వదేశవస్తువిక్రయలాభంబును, బరదేశాపూర్వవస్తు ప్రాప్తియు సుకరముగ లభించును. ఇది వణిగ్వ్యాపార ప్రయోజనము.

వర్తకమునకై సరకులు సాధారణముగ నెద్దులమీఁదను, గుఱ్ఱములమీఁదను, కంచరగాడిదలమీఁదను, బండ్లమీఁదను, ఎడారిప్రదేశములందు ఒంటెలమీఁదను, గొన్ని కొండదేశములందు గొఱ్ఱెలమీఁదను, నదీసాహాయ్యము కలచోట్లఁ బడవలమీఁదను దీసికొనిపోఁబడుచున్నవి. ఇపుడు రైలుమార్గములు దేశమం దంతట నమర్పఁబడినవి. వాని సాహాయ్యమున వస్తుసామగ్రు లాయా భాగముల కతిసులభముగఁ గొనిపోఁబడుచున్నవి. విదేశవర్తకము పొగయోడల సాహాయ్యమున విశేషముగ జరుపఁబడుచున్నది. వర్తకుఁ డెల్లప్పుడును దన సరకును దానే తీసికొనిపోయి విక్రయించు నని తలంపఁజనదు. తానే వెళ్లుట సాధారణముగ నుండనే యుండదు. తఱచుగ భారవాహులచేతనే పంపుచుండును. లంబాడితండాలు వణిగ్భారవాహులే. కొందఱు బండ్లవాండ్రును నిట్టి భారవాహవృత్తిచేతనే జీవించుచుందురు. ధూమశకటములను ధూమనౌకలను నడపువారును, పడవలవాండ్రును వణిగ్భారవహన కార్యమునే ప్రధానముగఁ జేయుచున్నారు. వారీ వణిజుల సరకులను నియమితప్రదేశమునకు గొనిపోయి, నిర్దిష్టపురుషున కొప్పగించుచుందురు. కావున వర్తకుఁ డూరూరు తిరుగవలసిన యావశ్యకము లేదు. తన యింటనే యుండి వివిధదేశవృత్తాంతముల నెఱుఁగుచు, వివిధదేశములకుఁ దన సరకుల నెగుమతి చేయుచు, వివిధదేశాపూర్వపదార్థములఁ దెప్పించుచు, వ్యాపారము చేయుచుండును. ఈ వ్యాపారమంతయు బుద్ధిబలముచేతనే నడపింపఁబడుచుండును. లేశమాత్రము పొరపాటు చేయునెడ నది విశేషనష్టమునకుఁ గారణమగును. కావున వీరికి ధనము వచ్చుటయుఁ బోవుటయుఁ గూడ నతితీవ్రముగ జరుగుచుండును. నేఁడు ధనవంతుఁడుగ నుండినయాతఁడు రేపే దరిద్రుఁడగును. దివాలెత్తును. 'ఓడలు బండ్లగును; బండ్లోడలగును' అను సామెత వీరియందే మిక్కిలిగ వర్తించుచున్నది. కావున వర్తకుఁ డింటనే యుండి వ్యాపారమును నడపినను దేశవృత్తాంతములఁ బత్రికాపఠనమూలమున ననర్గళముగ గ్రహించుచు, బుద్ధిచాకచక్యమును గలవాఁడై, దేశకాలపాత్రముల నెఱిఁగి, సమయానుకూలముగఁ జాగరూకుఁడై వర్తింపవలసియున్నాఁడు.

ఈ వ్యాపారమును జేయు వర్తకులందు సర్వసామాన్యముగ నొక్క దోషము కనబచ్చుచున్నది. అది కల్లలాడుట. దీనికిఁ బ్రారంభము బేరమునందుఁ గలుగుచున్నది.

విక్రయికుఁడు క్రయికునొద్దఁ దన విక్రీతపదార్థముపైని వీలగునంత లాభమును రాఁబట్టుటకుఁ జేయు ప్రసంగము బేరమాడుట యనఁబడుచున్నది. దీనికి గోరంత యవకాశ మిచ్చుటచేత నిది కొండంతలేసి యబద్ధములకుఁ జోటుచేయుచున్నది. మొట్టమొదట బేరమే యనావశ్యకము; మఱియు నష్టకరము. ఎట్లన బేరమనఁగా వీలగునంత లాభమును రాఁబట్టుట యని కదా పైని జెప్పఁబడియె. వీలగునంతలాభ మనఁగా క్రయికవిక్రయికు లిద్దఱును దమ యుభయుల మనోబలములకును బోరాటముఁ బొసఁగించి యం దెవ్వరి మనోబల మించుక లొజ్జుపడునో వారివలన రెండవవా రించుక లాభముఁ బొందఁగోరుట. ఈ ప్రయత్నము విక్రేత కెంత నష్టమునైనఁ గలిగించును. విక్రేత కొనవచ్చువారితో నెల్లను వారు కొనినను కొనకున్నను ఇట్లు మనోబలసంఘర్షణం బొనరింపవలసియున్నాఁడు. ఈతని మనోబలం బిట్లు వ్యర్థపఱుపఁబడఁదగినది కాదు. ఈతని వ్యాపారమే మనోబలాధీనమైయున్నది. తాను మితభాషిగ నుండి దానిని నేకరించుకొనుచుండునెడ నది తన కెంతగనైన నుపకరించును. అది సత్వహీనమయి యొక్క పొరపా టొనరించునెడఁ దాను మఱునాఁడే దివాలెత్తవలసివచ్చును. తనకు సంపత్కారంబయిన మనోబలమును వృథాసంఘర్షణంబునఁ గోలుపోవుట నష్ట మని చెప్పవచ్చును గదా. మఱియు మితభాషిగ నుండక వ్యర్థప్రలాపి యగుటచేత నీతని గౌరవము లోటుపడుచున్నది. ఈతఁ డెంత సత్యము పల్కినను క్రయికున కీతనియందు విశ్వాసమే యుండదు. కావున నెంతయు నమ్మఁడు. ఇంతకంటె నగౌరవం బింక నేమి కావలయు? ఈ బేర మనుపద్ధతివలన విక్రేతకు మానధననష్టములు రెండును గలుగుచున్నవి.

బేరము.

ఉ. బేరము లాభకారి యని ♦ పెల్లుగ భ్రాంతిని జెంది, పట్టి ని
స్సారపుఁ గంఠశోషపడి ♦ సౌఖ్యముఁ గోల్పడి, కల్లలాడు టా
చారముగాఁగ, వర్తకుఁ డ ♦ జస్రముఁ గుందఁగ నేల? బేర మెం
తే రహి వీడి తాఁ గ్రయికు ♦ లిద్దఱున్ సుఖియించు టొప్పదే?

కావున వీరీ పద్ధతిని మార్చుకొని, తమ లాభమునకు మితి నేర్పఱుచుకొని ఒక్క వెలకే విక్రయింపఁ జొచ్చునెడఁ గ్రయికవిక్రయికుల కుభయులకు నెంత సౌకర్యము కలుగును. ఎంతశ్రమ నివారణమగును! ఎంత మేలొనఁగూడును! విక్రేయపదార్థముల వెలల నొక పత్రముపైని వ్రాసి విక్రయప్రదేశమునం దొక్కచో నెదురుగఁ దగిలించినఁ జాలును. క్రయికునితోడి మనోబలయుద్ధము తొలఁగుటచేఁ దాను దూరముగఁ గూరుచుండి తన వస్తువిక్రయకార్యము నొక్క బాలునిచే సులభంబుగఁ జేయింపఁగలఁడు.

తాను గార్యాంతరములఁ గూడఁ జక్కఁబెట్టుకొనవచ్చును. మనోబలయుద్ధాభావకారణంబునఁ గ్రయికుఁడును దాను స్వయముగఁ బోవు నావశ్యకత తొలఁగును. అతఁ డొక బాలుని బంపును. ఈ విక్రేతయొద్ద సామగ్రులు నిర్ణీతమూల్యములకే దొరకు నను నమ్మకము ప్రజలందు వ్యాపించుటచేతఁ బెక్కండ్రీతనియొద్దనే కొనుటకు వత్తురు. దానిచేత విక్రేతకు ధనలాభమును గౌరవలాభమును గూడఁ గలుగును.

నిష్కర్ష పద్ధతులు.

సీ. బేరముల్ వీడిన ♦ విక్రేత కెంతయు - సౌఖ్యంబు మీఱు; ని ♦ శ్చలత కల్గు
కంఠశోషము తప్పు ♦ కాలవ్యయ మడంగు - బాలుఁ డొక్కనిచేతఁ ♦ బనులు తీరు
పదిమందిలో నెంతొ ♦ ప్రఖ్యాతి కల్గును - పలువుర ఖాతాల ♦ పట్టు దొరకు
చిత్తశాంతి లభించు♦సిరిసంపదయుఁ గూడు - ధర్మంబు నిల్చు స♦త్యంబు పొల్చు
గీ. ఆత్మగౌరవమబ్బు. ధై ♦ ర్యంబు నుబ్బు;
క్రయిక విక్రయికులకు సౌ ♦ ఖ్యంబు కల్గు
గనుక నిష్కర్ష పద్ధతు ♦ లనుసరించి
కీర్తి సుఖములఁ గొనుఁగాత ♦ వర్తకుండు.

ఈ బేరంపుఁ బద్ధతివలనఁ గలిగెడి వ్యర్థప్రలాపాభ్యాసముచేత నీతఁ డింకఁ గొన్ని ప్రత్యక్షాసత్యంబులకుఁ గూడ లోఁబడుచున్నాఁడు. సెట్టీ! బియ్యము నెంత వెల కిచ్చుచున్నా వని యడుగునెడ నొక్క మాటతోఁ బ్రత్యుత్తర మిచ్చుటకు బదులుగా నిట్లు పలుకును. "మీకు మాకు బేర మేమిటండీ! మీ యిష్టమువచ్చినంత యియ్యండి; మీ దయ; మేము తెచ్చిన ధరపైని రూపాయ కొక్కణా లాభ మియ్యండి చాలును." అని చెప్పుచు నాతఁడు తన మాటలను నమ్మునెడఁ దాను దెచ్చినవెలనే యెక్కువ చెప్పి, దానిపైని లాభముకట్టి, కొలుచుటలోఁ గొంత దిగఁదీసి, మొత్తమున నెట్లేని దాదాపుగ రెట్టింపు వెలకు వాని కంటఁ గట్టును. నీయొద్ద మంచి కందు లున్నవా? యని యడుగునెడ నొక్క మాటతో బదులు చెప్పక యిట్లు మొదలువెట్టును. "మీరు మా దగ్గిర సొమ్ము నాణెముచూడవలెనటండీ! మేలిమిసరకు కాదటండీ! మీ మామయ్యగారెప్పుడూ మాదగ్గరనే కొంటారు. మీరు వారికంటే యెక్కువ పరీక్షలు చేస్తారే! బాబో! మీతో గెలువలేమండీ!" అని యిన్ని మాటలు చెప్పుచు నే పుచ్చుచచ్చుగింజలనైనను అతని యొడిలోఁ బోయును. సవానేరు (నేరుంబావు) చింతపండు నిమ్మని యడుగునెడ నెడమచేతితో తరాజును బట్టుకొని, దాని యెడమసిబ్బియందు సవానేరు రాతిని బెట్టి, కుడిసిబ్బియందు రమారమి నేరుమాత్రము తూఁగఁగల చింతపండు

నుంచి, యా సిబ్బి యంచును గొంచెముగ బొట్టనవ్రేలితోఁ బట్టుకొని, తాను గ్రయికుని మొగమునంకఁ జూచుచుండును. ఆతఁడు పండువంకఁ జూచుచుండునెడఁ దాను ఎడమ చేతి చిటికెనవ్రేలితోఁ దరాజుయొక్క దండెను బై కెగఁద్రోయును. ఆతఁడు దండె వంకఁ జూచుచుండునెడఁ దాను కుడిచేతి బొట్టనవ్రేలితోఁ జింతపండున్న సిబ్బిని గ్రిందికి దిగఁద్రోయును. అది మఱలఁ బైకి లేచునంతలోపలనే సరిగా నుండెనని పండును దీసి యీవలఁ బెట్టును. ఈ మధ్యను "తమ రాఫీసు కెన్నిగంటలకు వెళ్లుతారండీ?" అని యడుగుచుఁ గ్రయికుని చిత్తము నన్యప్రసంగములోని కాకర్షించుచుండును. ఈ త్రిప్పు లన్నిటిని నేరును సవాసేరుగాఁ దూఁచుటకై పడును. 'అయ్యా మా దగ్గిర నెయ్యి మంచి సర కున్నది. మళ్లీ యిటువంటి సరకు దొరకదు. రెండు వీసెలు తీసుకొని పొండి' అని సలహా చెప్పును. పైక మిపుడు లేలే దనునెడ "పైకమునకేమిలెండి? తరువాతఁ బంపించండి. పోనీ మీ జీతములు వచ్చినవెనుకఁ బంపించండి. తమరి దగ్గిర సొమ్మెక్కడికిపోతుందండీ! మాడబ్బాలోనే పోసి యిస్తాను. తీసికొని పొండి" అని వలయు నుపపత్తు లన్నియుఁ జెప్పి యెట్టులో తన సరకు నప్పుగానైన నిచ్చి పంపును. ఆ యప్పుఁ దీర్చుటలోఁ గొంచె మాలస్య మగుచోఁ దొందర పెట్టుటయం దినుమంతయు వెనుదీయఁడు. "ఏమండీ! పైక మింకను బంపలేదేమండీ! ఇచ్చ్యారాని సొమ్మనుకొన్నారటండీ? కడుపుకుఁ దినలేదూ? పోనీ యియ్యమని చెప్పండీ. బాకీ యెఱుగమనండీ. పద్దు చించెయ్యండీ.' అని యెదుటివాని స్థితి ననుసరించి పైవాక్యములలో నెట్టువరుసను ఆవశ్యకమగువఱకుఁ బ్రయోగించి, వలయు పట్ల నలువురిలో నిట్టి మాటల చేత నవమానపఱిచి, యెట్టులేని సాధ్యమగువఱకుఁ గచ్చేరికిఁ బోవ నక్కఱలేకయే తన పైకమును రాఁబట్టుకొనును. ఒకవేళ నాతఁ డీ మాటలకుఁ గోపించి తిరుగఁబడు నెడఁ దానే తగ్గి 'బాబూ! పైకము జరుగురై మనివిచేశాను; త్వరలోఁ బంపించండి' అని బతిమాలుకొనును. ఆతనియొద్దఁ బైకమును నయముచేతనే రాఁబట్టుకొనును. అప్పిచ్చుటలో వర్తకునివలె నంత చొరవగా నితరుఁ డీయఁజాలఁడు. పెద్దవర్తకులు వందల కొలఁది సొమ్మునుగూడఁ దఱచుగా నోటిమాటల నమ్మకముమీఁదనే యిచ్చి పుచ్చుకొను చుందురు. చిన్నవర్తకులు సరకులను ధారాళముగా నప్పిచ్చి పైకము ననంతరమం దొకగవ్వయైనను బోకుండ నయభయములచే లగాలగిచేసి వడ్డితోఁ గూడను వసూలు చేయుదురు.

అపరిమిత దేశోపకారకమును, అతిసులభధనసంపాదనమార్గమును, గౌరవార్హ స్వాతంత్ర్య జీవనప్రదమును నగు వర్తకమును నడపించుట కిన్ని కల్లలఁ బల్కుటయు, నిన్ని

యక్రమముల నొనర్చుటయు నావశ్యకమా? ఈ కల్లలచేతను, కపటవర్తనములచేతను వీ రేమైన నధికధనవంతు లగుచున్నారా? లేదు. కల్లల నెంతయెక్కుడుగఁ బ్రయోగించువా రంతగ నధోగతిపా లగుచున్నారు. ఒక్క యనృతముం బల్కునెడ దానిం గప్పుకొనుట కింకొక యనృతముం బలుకవలసివచ్చును. ఇట్లొకదాని కుపబలముగా నింకొకటిచొప్పునఁ బ్రయోగింపఁగా వీరి కంఠస్థాన మెల్లప్పుడు ననృతమాలాభరితమై యుండును. ఈ యనృతవాక్యాభ్యాసము హేతుజ్ఞానమును మొదలంట రూపుమాపి వేయును. చిత్తస్థైర్యమును జెడఁగొట్టును. మనోదౌర్బల్యమును బూర్తిగఁ గలిగించును. వివేచనాశక్తి నడంచును. ఆత్మగౌరవము నంతరింపఁజేయును అధికారధ్వనిసహిత వాక్యమును నోట రానీయదు. ప్రత్యక్షసమాధానవాక్యమును బలుకనీయదు. నియోగికి నీటు, వైదికునకు చాదస్తమును వలెనే వీరికిఁ గలిగిన పిఱికితన మనెడి సాంఘికదౌర్బల్యమునకు మూలకారణ మీ యనృతవాక్యదురభ్యాసమే.

ఇట్టి మహాపకారకమగు దురభ్యాసమును దొలఁగింపఁబూనుట యనావశ్యకము కాదుకదా. దొలఁగించు టెట్లు? అది మహాకఠినమా? కాదు. మిక్కిలి సులభము. ధనవ్యయ మక్కఱలేదు. ఈ యనృతవాక్యమహాభూత మారణహోమసంకల్ప మొక్కటి మాత్రము వీరి హృదయమందుఁ బదిలంబుగ నుండినఁ జాలును. త న్మారణహోమ విధానము రెండు చిన్నవాక్యములలో నేను మనవిచేయుదును. అ దెద్దియనఁ 'జేరమును మానుట; నిష్కర్ష పద్ధతుల నవలంబించుట' ఇది సమస్తదుర్దోష పరిహారమంత్రము. దీనిం జేకొనునెడ వీరివృత్తియందలి యితరదోషసహస్రము లన్నియు వేరు తెగిన వృక్షములవలెనే పస చెడి నిర్జీవములై క్రమంబుగ నంతరించిపోవును. ఆత్మగౌరవమునకుఁ బునరుద్ధారణము కలుగును. మనోబలసిద్ధి యబ్బును. చిత్తస్థైర్యము లభించును. ధైర్యసాహసము లుద్భవించును. వ్యాపార మభివృద్ధియగును. ధనలక్ష్మి ప్రేమించును. కీర్తిప్రతిష్ఠలు ప్రకాశించును. సర్వసౌఖ్యములును గలుగును. కావున వర్తకు లీ నిర్దిష్ట మార్గము నవలంబించి మేలొందునట్లు పరమేశ్వరుఁ డాశీర్వదించుఁగాక.

వర్తకము.

సీ. మీకుమాకును బేర ♦ మేకాలమున లేద - టంచు డబ్బిలు ఛార్జి ♦ కంటఁగట్టి
అయ్యొ! నా ణెముచూడ ♦ నక్కఱ లేదంచు - నే దుమ్ముసరకైన ♦ మీఁద వేసి
యీచేత నాచేత ♦ నెగఁద్రోసి దిగఁద్రోసి - సేరుసొమ్మును సవా ♦ సేరుతూఁచి
అప్పుసప్పులనైన ♦ నాతురంబున నిచ్చి - పైల గాలగి చేసి ♦ పైక మూడ్చి

గీ. అందినను జుట్టుపట్టుచు ♦ నందకున్నఁ
గాళ్లుపట్టుచు ధనమును ♦ గడనసేయఁ
బాటుపడుదురు కొందఱు ♦ వైశ్యులకట
న్యాయమున వర్తకం బిలి ♦ నడవకున్నె?

:o:

## 17. విద్యార్థులు.

విద్యను గోరువారు విద్యార్థులు. విద్యలు పెక్కులు కలవు. ఆయా విద్యలఁ గోరువారు వానివానియందు విద్యార్థు లనఁబడుదురు. ప్రకృతకాలపు టాంగ్లేయవిద్యాపాఠశాలలయందు నూతనపద్ధతులప్రకారము వివిధవిద్యాభ్యాస మొనరించు విద్యార్థులను గూర్చియే యిటఁ దెలుపఁబడుచున్నది. దేశముయొక్క పురోవృద్ధి యీబాలురమీఁదనే యాధారపడియున్నది. నేఁడు విద్యార్థులుగనుండిన వీరు రేపు పురమహాజనులగుచు నిలచి దేశాభివృద్ధికర కార్యములనెల్ల నొనరింపవలసియున్నారు. ప్రజలయందు సంఘీభావమును నెలకొల్పి తత్సహాయమున దుర్ఘటకార్యఘటనానైపుణ్యము నెల్లెడ వెలయింపవలసినవారీవిద్యార్థులే. మనదేశమం దిపు డంతరించిపోవుచుండిన శిల్పాది విద్యలన్నిటికిని దగు మార్గము లవలంబించి పునరుద్ధారణ మొనరింపవలసినవారీవిద్యార్థులే. జారచోరాది దుష్టజనులవలని బాధలఁ దొలఁగించుటందుఁ దాముసు గత్తి కట్టుకొని నిలిచి ప్రభుత్వమువారికిఁ దోడ్పడవలసినవారీవిద్యార్థులే. తాము విద్యాసంపన్నులగుచుఁ బ్రజల కెల్లరకు నైహికాముష్మిక విద్యాఫలంబుల దేశోద్ధరణ మార్గచతుష్కంబున వెదఁజల్లవలసినవారీవిద్యార్థులే.

గీ. సంఘమును భావి దినముల ♦ సంస్కరించి
వలయు నభివృద్ధిపథముల ♦ నెలవుకొల్పి
వాసిఁ గాంచఁగఁ దగు పుర ♦ వాసు లెవరొ
యరయుఁడీ వారు నేఁటి వి ♦ ద్యార్థులెసుఁడె.

ఇట్టి విద్యార్థులకు నేర్పఁబడు విద్య యెట్టిదిగ నుండవలయును? విద్యార్థి తన ప్రపంచయాత్రయందుఁ దన కార్యములఁ దాను సమర్థముగ నెఱవేర్చుకొనుటకును, దన చెంతనుండువారికి సాయపడుటకును వలయు శక్తిని గలిగించునదిగ నుండవలయును. అందుకు వీరి కిపుడు నేర్పఁబడుచుండెడి విద్య యెట్టులుండెనో యొక్కింత విచా

రింపవలసియున్నది. ప్రైమరీతరగతివఱకు విద్యార్థికి నేర్పఁబడున దేమనఁగా ఉత్తర ప్రత్యుత్తరములను బజారుసరకుల పద్దులను వ్రాసికొనుటకు వలయు శబ్దార్థజ్ఞానమును, దస్తూరియు, గణితమును, రాజధాని భూగోళమును నేర్పఁబడుచున్నవి. అనంతరమందు సెకండరీపాఠశాలలో నీవిషయములే కచ్చేరిలో గుమాస్తా పని చేయుటకు వలయు వఱకు నేర్పఁబడుచున్నవి. శబ్దార్థజ్ఞానము హూణాంధ్రభాషలయందుఁ గలిగింపఁబడుచున్నది. గణితమందు అంక క్షేత్ర బీజగణితములును, భూగోళమందుఁ బ్రపంచభూగోళమును, దానితోఁ జేర్చి హిందూదేశచరిత్రయు నేర్పఁబడుచున్నవి. పిమ్మటఁ గాలేజియందుఁ బైవిషయములలో నొకదానియందుఁ బండితుఁ డగునట్లు నేర్పఁబడుచున్నవి. అక్షరాభ్యాసము ప్రారంభించునప్పటినుండియుఁ బండితుఁ డగువఱకును విద్యార్థికి నేర్పున దంతయు నాతనికి మనోవికాసమును జక్కఁగఁ గలిగించును. ఈ మనోవికాసమునకు వలయు వివిధ విద్యాబీజము లీతని హృదయభూమియందుఁ బ్రారంభ విద్యాస్థానమగు ప్రైమరీపాఠశాలయందే నాటఁబడి మొలకలెత్తింపఁబడినవి. అవి యనంతరమందు సెకండరీపాఠశాలలో నభివృద్ధినొందింపఁబడినవి. పిమ్మటఁ గాలేజియందు ఫలవంతములుఁగ నొనరింపఁబడినవి. చక్కని మనోవికాసము కలిగినది. కాని విద్యార్థికీ ప్రపంచయాత్రయందు వలయున దొక్క మనోవికాసమును, తజ్జనితమైన శబ్దార్థజ్ఞానమును మాత్రమే! ఈతనికిఁ గరచరణాద్యవయవవిశిష్టమైన శరీర మొకటికూడఁ గలదుకదా. మనఃపరిశ్రమము నెంతగఁ జేసినను దాని సుఖస్థితి యీ శరీరముయొక్క సుఖస్థితిపైనే యాధారపడియుండెఁగదా. అట్టి శరీర మేల యుపేక్షింపఁబడినది? ఇది యొక గొప్ప పొరపాటు. దీని కింతకన్న మఱియొక సమాధానము లేదు. ఈ విద్యార్థి బాల్యమునుండియు మహాపరాధం బొనరించియున్నాఁడు. దాని శిక్ష ననుభవించుచునే యున్నాఁడు. కాలుసేతులు లేనివాఁ డైనాఁడు. ఇంతకన్న మఱేమి శిక్ష కావలయును? తన మూఁటను దాను బది గజముల దూరము మోసికొనిపోవుటకుఁగాని, తన చిన్ని ధనపుఁబెట్టెను నిచ్చెనపై కెక్కి వెలిసెపైని బెట్టుటకుఁగాని, బండిక్రిందఁ బడఁబోవు బిడ్డను పదిగజముల దూరము పరుగెత్తి తప్పించుటకుఁగాని సమర్థుఁడు కాకయున్నాఁడు. ఈ పనులను నౌకరులచేతఁ జేయించుకొందు మని యేరైనఁ జెప్పుదురేమో. కుక్క కఱవవచ్చునపుడు కొట్టుటకుఁ దనచేయియే కావలయును. కొంప కాలునపుడు ప్రాణమును రక్షించుకొనుటకుఁ దనకాళ్ళతోనే పరుగెత్తవలయు. అచట నవుకరు పరుగెత్తు నెడఁ బ్రయోజన ముండదు. నవుకరులు వచ్చువఱకును ఆపదలు కాచుకొని

యుండవు. ఆపత్కాలమందుఁ దన్నుదాను రక్షించుకొనుటకును దన చెంతనుండువారిని రక్షించుటకును బ్రబలమానవుఁడును సమర్థుఁడై యుండవలయు. అట్టి సమర్థత యీ విద్యార్థికి లేదు. కాఁబట్టి యీతనియందు సంపూర్ణమానవధర్మము లేదు. మనుజునకుఁ గల దేహేంద్రియములలో మొదటిదగు దేహమును బూర్తిగ నుపేక్షించి యింద్రియములను మాత్రము పరిశ్రమచేత బలపఱిచి యర్ధమానుషశరీరుఁడై తుదకు వ్యర్థుఁడగుచున్నాఁడు. కాళ్లు కచ్చేరివఱకు నడచుటకును, కుడియెడమ కరంబులు లేఖినీపత్రములఁ బట్టుకొని వ్రాయుటకును మాత్ర మభ్యాసపఱుపఁబడినవి. ఇంతకన్న వీరి దేహావయవముల కింకొక పని నేర్పఁబడుట లేదు.

అర్ధమనుజత్వము.

గీ. ఈశుఁ డొసఁగినయట్టి దే ♦ హేంద్రియముల
మొదటి దగు దేహవిషయంబు ♦ మూలఁ ద్రోచి
యింద్రియ పరిశ్రమము మాత్ర ♦ మెఱిఁగి చేసి
యర్ధమనుజత్వ మందె వి ♦ ద్యార్థి యహహ!

ఇపుడు పాఠశాలలందు వ్యాయామవిద్యయు నేర్పఁబడుచుండెఁగదా యని కొందఱు తలఁపవచ్చును. అదియు నభఃపుష్పముగనే యున్నది. సుమారైదువందల విద్యార్థులుగల పాఠశాలయందు బహువత్సరములవఱకును నిద్దఱు వ్యాయామోపాధ్యాయులఁ బెట్టి నేర్పించినను వారియం దైదుగురైనను అనఁగా వారిలో నూటి కొక్కరైనను ఆ విద్యయందు సమర్థులుగ వెలువడకపోవుచున్న దది వ్యర్థముకాక మఱేమగును? కొందఱు విద్యార్థుల విషయములో నిది యనర్థకముకూడ నగుచున్నది. ఆ కారణములన్నియు వ్యాయామమును గూర్చిన యుపన్యాసమందుఁ గొంతవఱకు వివరింపఁబడును. ఈ విద్యార్థి పాఠశాలయందు వ్యాయామమును లేశమాత్రమును జేయుటయే లేదని మాత్ర మిచటఁ జెప్పవచ్చును. ఈతఁడు దేహపరిశ్రమము నుపేక్షించుటయే గాక దేహావయవములతోఁ జేయఁదగిన శిల్పాదివృత్తుల నన్నిటినిగూడ నిరసించి యుపేక్షించుచున్నాఁడు. దీనిచేత వృత్తివలనఁ గలుగఁదగిన దేహపరిశ్రమం బయినఁ గలుగక యీతఁడు పూర్ణముగ వ్యర్థుఁ డగుచున్నాఁడు. ఈతని కెవ్వనిపైనైనఁ గోపమువచ్చునెడ నేమిచేయఁగలఁడు? నోటికొలందిగఁ దిట్టఁగలఁడు. కలము దీసికొని పఱపఱ వ్రాయఁగలఁడు. మఱేమియుఁ జేతకానేకాదు. సంఘీభావ మన నేమో యీతనికిఁ దెలియనే తెలియదు.

మన విద్యార్థు లెల్లరు నిట్లు వ్యర్థులై పోవలయునా? వీరిని సంస్కరించు మార్గము లేవియు లేవా? వీరిని సంపూర్ణమానవధర్మముఁ గలవారుగఁ జేయుట సాధ్యము కాదా! అనెడి పరితాపపూర్వకసంశయము లెల్లరకు నిచటఁ గలుగకమానవు. సంశయములకుఁ దోడుగ గుణదోషవిమర్శనస్వాతంత్ర్యమును, నవీనమార్గావలంబనోత్సాహమును గూడఁ జేరునెడ సంస్కరణమును విశేషశ్రమలేకయే చేయవచ్చును. కార్యసిద్ధి నొందవచ్చును. ఈకాలపుఁ జదువరులలోఁ బెక్కండ్రు కేవలపరాధీనవర్తనులుగాక బుద్ధిస్వాతంత్ర్యమును గలవారుగనే యున్నారు. కావున మదీయాశయముల నిట మనవిచేయుచున్నాఁడను.

అభివృద్ధిపద్ధతుల నవలంబించుటకుఁ బూర్వ మనావశ్యకశ్రమములఁ దొలఁగించుకొనుట ప్రథమకర్తవ్యము. కావున మన విద్యార్థు లొనరించుచున్న యనావశ్యక కార్యము నెక్కుడానిని గొంత తగ్గింపవలసియున్నది. అదెద్దియన కేవల శబ్దార్థజ్ఞాన సంపాదనప్రయత్నము. ఇది మన సాహిత్యపరుల యేకవిద్యాభ్యసనమార్గదోష మని ఆంధ్రభాషావిషయికోపన్యాసంబునఁ దెల్పియుంటిఁగదా! ఈ విద్యార్థులెల్లరు నట్టి సాహిత్యపరుల వంశజులును, బంధువులును, మిత్రులు నే. కావున వారలయభ్యాసమే వీరివలనను వ్యాపించినది. చదువుటకుఁ దెల్లవారుజామున నాలుగుగంటలకుఁ గూర్చుండి యుదయమునఁ దొమ్మిదిగంటలవఱకుఁ జదువును. మరలఁ బదిగంటలకు మొదలిడి సాయంకాల మైదుగంటలవఱకును జదువును. మరలఁ రాత్రి యేడుగంటలు మొదలుకొని పదిగంటలవఱకును జదువును. సాయంకాలమున నొక యరగంటసేపు జిమ్నాస్టిక్సు తరగతికి రమ్మనుఁడు! సెలవుచీటిని బంపును. కొంచెముసేపు బంతియాడుటకు రమ్మనుఁడు! ఆసమయములో నింటికిఁ బోయి లెక్కలనో వ్రాఁతపనినో చేయును. కొందఱుబాలురు బంతులాడుచుందురుకదా; అది దేహపరిశ్రమము కాదా యని యిటఁ గొందఱు శంకింపవచ్చును. అదియు నట్టిమాటయే. వాదమునకొఱ కిదియుఁ బరిశ్రమమే యని యొప్పుకొన్నను దీని నాడెడివా రేపాఠశాలయందైనను నూటికిఁ బదిమంది కంటె నెక్కువ లేరు. కొదవవా రందఱ గతి యేమి కావలయును? కావున నిది ప్రయోజనము లేదు. విద్యార్థి దీని నంతను గోరుట లేదు. ఈతనికిఁ జదు వొక్కటియే కావలయును. చదువనఁగా నీతని దృష్టియందుఁ గేవల శబ్దార్థజ్ఞానసంపాదనమే. తుట్టతుదకు దీని పర్యవసాన మేమిగాఁ బరిణమించెనో చూచితిరా! వీరు శ్రమపడి చదివి పరీక్షకేఁగెడివారిలో బహువిద్యార్థులు కృతార్థులగుట; ఇంతయెక్కువమంది

కృతార్థులగుటను జూచి వీరి కీపాఠములు చాలలే దని తలంచి విద్యాశాఖాధికారులు మఱినాలుగు పాఠములను వీరిపైఁ బడవేయుట; వానినిఁ గూడ శ్రమపడి చదివి వీరు కృతార్థులగుట; వారు మఱినాలుగు పాఠములను పైనిఁ బడవేయుట. ఇట్లు జరుగుటచేత నిపుడు విద్యార్థి కుత్తుకబంటి విద్యావ్యాసంగములోఁ మునిఁగియున్నాఁడు. దీని భారమును మోయఁజాలకయున్నాఁడు. మానసికవ్యాపారములందుఁ గాని దైహిక వ్యాపారములందుఁ గాని దైనందినాచరణయందు భార మెక్కుడైనచో మనశ్శరీరములు రెండును నానాటికిఁ గ్రమంబుగ లోలోనఁ గృశించి, నీరసించి, సత్వహీనములగును. ఇది సర్వజీవసామాన్యధర్మము. ఈ దైనందినవ్యాపారభారాతిశయం బెడతెగని దైనందినాహ్వానములచేత మృత్యుదేవతను గొంచెముకొంచెముగ సమీపమునకుఁ గొనివచ్చి తుదకీ జీవు నా దేవతకుఁ గానుకగ నర్పించును. ఇట్లు మన విద్యార్థు లెందఱో పట్టపరీక్షయందును, న్యాయవాదిత్వాద్యుత్తమపరీక్షలందును గృతార్థత నంది తమ దీర్ఘవ్యవసాయఫలకాలము సమీపించునప్పటికి దాని ననుభవించు ప్రాప్తిలేక మధ్యవయస్సునందే యీ మృత్యువువాతఁ బడుట మీ రెఱుంగనిది కాదు. మనుజుని విద్యాభ్యసనాది సమస్తప్రయత్నములయొక్క పరమావధి (Ideal) దీర్ఘాయువు. అట్టి దానికి భంగము కలిగించుచున్నపు డది విద్యాధికుల కెల్లరకు విచారణీయాంశ మగుచున్నది. ఆయువునకు సహకారియు సాహాయ్యకారియు నగు నారోగ్యమును గలిగించు దేహపరిశ్రమ ముపేక్షింపఁబడునపు డీ మనఃపరిశ్రమభాగముయొక్క క్రూరత్వ మతిశయించి మేర మీఱుచున్నది. ఇది యంతయు విద్యాశాఖాధికారుల దోషమని యిట నెవ్వరైన భ్రమయవచ్చును. కాని వారి దోష మిందు సుంతయు లేదు. ఒక యుపాధ్యాయుఁడు తన శిష్యులకు, గొంత పాఠము నిచ్చె ననుకొనుఁడు. వారు దినమంతయు నచ్చటచ్చటఁ దిరుగుచున్నట్లగపడి మఱునాఁడు పాఠము మాత్రము నిర్దుష్టముగ నొప్పగించునెడ వారి కీయఁబడిన పాఠము చాలలే దని తలంచి యేయుపాధ్యాయుఁడు మఱికొంత యెక్కువపాఠము నీయక మానుకొనును? కాఁబట్టి యీ దోషము మానవత్వమునకు వలయు సర్వప్రయత్నములను వదలుకొని కేవల శబ్దార్థజ్ఞానసంపాదనమే సకలార్థసిద్ధి యనుకొని పెనఁగులాడెడి విద్యార్థిదే కాని మఱెవ్వరిదియుఁ గాదు. విద్యార్థియే తనను గట్టఁ ద్రాళ్లు తాఁ దెచ్చుకొన్నాఁడు. ఇంత శ్రమపడి సంపాదించెడి విద్యకు ఫలమేమి? లోవర్ సెకండరీపరీక్షయందుఁ గృతార్థులగువారు చేయఁదగిన నకళ్లవ్రాయు పనికి బి. యే, పరీక్షయందు గెలుపొందినవారిని గొద్ది జీతముతో నియ

మించుచున్నారు. ఎక్కువయోగ్యతఁగలవారు సులభముగ లభించుచుండఁ దక్కువ యోగ్యతఁ గలవారి నెవ్వరైనఁ జేకొందురా? అట్లు చేకొమ్మనుట ధర్మ మగునా? ఈతని విద్యాతిశయ మితరమానవధర్మసహిత మగునెడ శ్లాఘనీయమే యగును. తద్ధర్మాభావమందే యిది యనావశ్యక మని చెప్పవలసివచ్చుచున్నది. కావున విద్యార్థి కేవలశబ్దార్థజ్ఞానసంపాదనము సంపూర్ణవిద్యాగ్రహణమునకు లక్షణము కాదనియుఁ, దన దినచర్యయందు విద్యాయుతకార్యము లొక్కభాగము మాత్రమే యుండుననియు గ్రహించి, కేవల వాగ్రూప విద్యయే కావలయు ననెడి పెనగులాటను గొంత తగ్గించుకొనవలయును.

వారపాటు.

గీ. విద్య యనఁగనె వాగ్రూప • విద్య యంచు
భ్రమసి యూరక శ్రమములఁ • బడెద రేల?
పక్షి పాఠంబు నావలఁ • బాఱఁ ద్రోలి
పూర్ణవిద్యకుఁ గడఁగుఁడీ • పూజ్యులార!

అట్లయిన నీ విద్యార్థి సంపూర్ణవిద్యావంతుఁ డగుట కీతని విద్యాభ్యాసపద్ధతి యెట్లుండవలయును? ఆ నిర్వచన మీ యుపన్యాసారంభమందే చెప్పఁబడినది. అదియే యిట మరలఁ జెప్పఁబడును. విద్యార్థి తన ప్రపంచయాత్రయందుఁ దన కార్యములఁ దాను సమర్థముగ నెఱవేర్చుకొనుటకును, దన చెంతనుండువారికి సాయపడుటకును వలయు శక్తిని గలిగించునదిగ నుండవలయు. అయినచో నీతని దైనందినవ్యాపారము లెన్ని తరగతులుగ విభజింపఁబడఁదగియున్నవి? ఆయాతరగతుల కార్యములను సమర్థముగ నెఱవేర్చుట కీతనియం దేయేశక్తులు వలసియున్నవి? అట్టి శక్తులఁ గలిగించు సాధనము లెవ్వి? అను మూఁడుశంక లీ విద్యానిర్వచనమువలనఁ గలుగుచున్నవి. వానికి సమాధానముల నిటఁ దెలుపుచున్నాఁడ. ప్రపంచమం దేమానవుఁడు 'గాని' యేవృత్తి నొనరించునాతఁడుగాని చేయుకార్యము లన్నియు నాలుగు తరగతులుగ విభజింపఁ బడఁదగియున్నవి. అవి యెవ్వియన 1 సంఘీభావకృతములు; 2 దేహావయవకృతములు; 3 దేహబలకృతములు; 4 జ్ఞానబలకృతములు. 1 సంఘీభావము అనఁగా నొక్కఘనకార్యమును నెఱవేర్చుటకుఁ బలువు రేకీభవించుట. అందుకు విద్యార్థి తా నితరులతోఁ జేరి యేకముగాఁ బనిచేయుటకును, ఇతరులను దనతోఁ జేర్చి యేకముగాఁ బని చేయించుటకును దగిన శక్తిని సంపాదింపవలసియున్నది. 2 దేహావయవకృతము

లనఁగాఁ జేతులు, కాళ్లు, భుజములు, దండచేతులు, ముంజేతులు, తొడలు, మోఁకాళ్లు, పిక్కలు, పాదములు, ఎదురురొమ్ము, తల మొదలగు వివిధావయవములతోఁ జేయు కార్యములు. ఆకార్యములఁ నొనరించుటకు విద్యార్థి యా వివిధావయవముల ధారాళముగను హేరాళముగను ఉపయోగించు శక్తిని సంపాదింపవలసియున్నాఁడు. 3 దేహబలకృతము లనఁగా నీశ్వరదత్తమైన సహజదేహబలమును మానవయత్నముచేతఁ గాఁదగునంతకుఁ బ్రబలఁజేసి తత్సహాయమున నొనరింపఁదగు జనసామాన్యాశక్యకార్యములు. వీని నొనర్చుటకు విద్యార్థి జనసామాన్యాధికదేహబలమును సంపాదింపవలసియున్నది. 4 జ్ఞానబలకృతము లనఁగా నీశ్వరదత్తమైన జ్ఞానమును మానవయత్నముచేత నభివృద్ధి నొందించి యా జ్ఞానబలముచే నొనరింపఁదగు జనసామాన్యాశక్యకార్యములు. వీని నొనరించుటకు విద్యార్థి జనసామాన్యాధికజ్ఞానబలమును సంపాదింపవలయును. ఈచతుర్విధశక్తులను గలిగించు సాధనము లేవి యను శంక యింకను నిలిచియున్నది. ఇది దుస్తరమైన శంకయే. అయినను వివరింతును. 1 సంఘీభావశక్తిని గలిగించు సాధనము సంగీతము. 2 వివిధావయవధారాళప్రయోగశక్తిని గలిగించు సాధనములు శిల్పాది పరిశ్రామికవృత్తులు. 3 జనసామాన్యాధిక దేహబలసంపాదనసాధనము వ్యాయామము. 4 జనసామాన్యాధికజ్ఞానబలసంపాదనసాధనములు లోకానుభవమును, విద్యయు.

చతుర్విధసాధనములు.

గీ. అరసి 1 సంగీత 2 శిల్పంబు ♦ లభ్యసించి
పైని 3 వ్యాయామ 4 విద్యలఁ ♦ బ్రజ్ఞఁ గాంచి
యొగిఁ జతుర్విధశక్తిసం ♦ యుక్తుఁ డగుచుఁ
బూర్ణ మనుజత్వ మొందుట ♦ పూజ్యతమము.

ఈ సాధనచతుష్టయసంపత్తిచేఁ బైనాల్గు శక్తులును గలుగునా? విద్యార్థి సంపూర్ణవిద్యావంతుఁడు కాఁగలఁడా? అను మహాసంశయ మిచటఁ గలుగుచున్నది. ఈ సంశయము నివారింపఁబడునేడఁ గార్యసిద్ధి కింకఁ దడ వేమియు నుండదు. కాఁబట్టి తత్సంశయనివృత్తికై యిటఁ బ్రయత్నింతును.

సంగీతమువలన సంఘీభావము కలుగునా యనుట మొట్టమొదటి సంశయము తప్పక కలుగును. సంఘీభావమును గలిగించుశక్తి సంగీతవిద్యకు మాత్రమే కలదు మఱియొకవిద్య కట్టి స్వాతంత్ర్యము లేశమును లేదు. ఎట్లనఁగా:—సంఘీభావము అనఁగా

యొక్క ఘనకార్యాచరణమం దనేకులు చేరి యేకముగాఁ బనిచేయుట కదా. ఏకముగా నొనర్చుట యనఁగా నేక కాలమం దొనర్చుట. ఏక కాలమం దొనర్చుట యనఁగా నిరువదిమంది చేరి మేయినెలలో నీలగిరికిఁ బోవుటకాదు. పదిమంది చేరి ఆదివారమునాఁడు ఫలహారముచేయుట కాదు. నాలుగువందలమంది యొక్కసారి రైలుబండి నెక్కుట కాదు. ఈ కార్యములకు సంగీత మక్కఱలేదు. ఇది యేకత్వమునకు లక్షణము కానేరదు. పలువు రేకక్షణమం దొక్కఁడుగనే యొనరించుట యేకకాలాచరణమగును. అట్టి కాలమును గూర్చిన జ్ఞానము నొసఁగు శక్తి సంగీతశాస్త్రమునకే కలదుకాని తదితరశాస్త్రములకు లేదు. సంగీతశాస్త్రమునకు శృతి ర్మాతా పితా లయా అని చెప్పఁబడుచున్నది. నాదముయొక్క ఆరోహణావరోహణాదిభేదములను గూర్చి చెప్పునది శృతి. తదంతర్వ్యాప్తియైన కాలమును గూర్చి చెప్పునది లయ. సాకారపదార్థదైర్ఘ్యమును గణితశాస్త్రజ్ఞుఁడు గజములుగను అంగుళములుగను గొలుచునట్టులు కార్యాంతర్వ్యాప్తియగుచు నిరాకారమైన కాలమును సంగీతశాస్త్రజ్ఞుఁడు లయనుదెల్పు లఘుద్రుతాది పరిమాణములచేఁ గొలుచును. సంగీతవిద్యకుఁ బ్రధానాంగములైన భావ రాగతాళములలో తాళాంగమీ లయను గూర్చి చెప్పుటకే వచ్చినది. ఇది మన మొనరించు సమస్తకార్యములందును జేరియున్నది. ఈలయస్వరూపమును ఒక్క దృష్టాంతముచేత స్పష్టపఱచెదను. ఒకఁడు దారిని బోవుచుఁ బదియడుగులు మిక్కిలి వడిగను నాలుగడుగులు మిక్కిలి నెమ్మదిగను అయిదడుగులు కొంచెము వడిగను మఱి కొన్ని యడుగులు కొంచెము నెమ్మదిగను ఇట్లు వేగము పలువిధములుగ నుండునట్లు నడచుచుండు ననుకొనుఁడు. అతనిం జూచి మీ రేమనుకొందురు? వెఱ్ఱివాఁ డనుకొందురు. మఱియు 'నట్లు నడచెదవేమి' యని కూడఁ బ్రశ్నింతురు. 'ఎట్లు నడచుచుంటి' నని యాతఁ డడుగునెడ 'మిక్కిలివడిగను మిక్కిలినెమ్మదిగను కొంచెమువడిగను గొంచెము నెమ్మదిగను నిట్లు పలువిధములగు వేగముతో నడచెదవేమి' యని మఱలఁ బృచ్ఛ సేయుదురు. 'మీ రెట్లు నడువుమనెద' రని యాతఁడు మరల నడుగునెడ సరిగా నడువు మని మాత్రము మీరు ప్రత్యుత్తర మిత్తురు. అంతకంటె స్పష్టముగా మీ యభిప్రాయమును మీరు చెప్పఁజాలరు. 'సరిగా నడువుము' అను మాటల కర్థ మేమి? 'లయచొప్పున నడువుము' అనియే అర్థము. లయచొప్పున ననఁగా అడుగడుగుమధ్యను నడుచుకాలము సమంబుగ నుండునట్లని యర్థము. ఈ సమకాలజ్ఞానమునకే సంగీత శాస్త్రపరిభాషయందు 'లయ' అని పేరు పెట్టఁబడినది. ఈ లయజ్ఞానాంకురము

ప్రతిమనుజుఁడొనరించు ప్రతికార్యమునందును వారివారికిఁ దెలియకయే వారియందు సహజముగఁ జేరియున్నది. అది సంగీతశాస్త్రజ్ఞునకు మాత్రము ప్రత్యక్షముగఁ గన్పట్టుచునే యుండును. ఈ లయ నెడబాసిన కార్య మెవ్వనియందైనను వెల్తిగఁ గన్పట్టక మానదు.

"శ్లో. లోకే వేదేచ వచసాం - పాదయో ర్గతి రుత్తమా
తాళేనైవ; వినాతేన - స్ఖలనం తేషు దృశ్యతే.

లోకమందును వేదమందును వాక్కులకును పాదములకును తాళముచేతనే యుత్తమగతి కలుగుచున్నది. ఆ తాళము నెడబాయుచో వాని యన్నిటియందును దొట్రుపాటు కనఁబడుచున్నది." గానసారము.

ఈ లయజ్ఞానాంకురము ప్రతిమనుజునందును సహజముగనే యుండినను ఒకఁడు మరియొకనితోఁ జేరి యేకముగాఁ బనిచేయఁదలఁచునపుడా యిరువురి సహజశక్తిని యేకముగా నడిపించుటకు బహిర్లక్ష్యస్థాన మొకటియావశ్యకమగుచున్నది. ఆ లక్ష్యస్థానమే గానమందలి ద్వితీయార్థభాగమగు తాళము. ఒక్కఁడుగ నుండునపుడు బహిర్లక్ష్య మక్కఱలేదు. ఒక్కనికంటె నెక్కుడుగ వేలకొలఁది నెంతమంది యుండినను వారి శక్తి నీ లక్ష్యసాహాయ్యంబున నేకముగ నొనరింపవచ్చును. వారిలో నొకరి నొకరనుసరించుట యుండనే యుండదు. అందఱును బహిర్లక్ష్యమగు తాళమునే యనుసరింతురు. దీనిచేత నణుమాత్రమును భేదము కలుగదు. ఈ దృష్టాంతమును జూడుఁడు. పడవలవాండ్రీ తాళసాహాయ్యముచేతనే పడవలను లాగఁగలుగుచున్నారు. వారందఱును జేరి పడవత్రాటిని భుజములపై మోపుకొని యొక పాటను బాడుచు, దాని తాళముతోఁ జేర్చి యడుగును బెట్టి నడుచుచు, లాగుదురు. దీనిచేత వారందఱును ఏకకాలమందే యడుగును ముందుకుఁ బెట్టుదురు. అడుగును ముందుకుఁ బెట్టునపుడే పై శరీరభారమును ముందుకు ఊఁచుట సహజగుణము. కావున నందఱును పడవభారమును వహించిన త్రాటితోఁగూడఁ దమ శరీరభారమును ఏకకాలమందే ముందున కూఁచెదఱు. దానిచే వారిశక్తి యేకమయి పడవయనెడి భారమును గదలించును. ఇదియే యథార్థమగు సంఘీభావము. ఇట్టి దానిని గలిగించు శక్తి సంగీతమునకే కలదు.

కొందఱి కిచట నొక సంశయము కలుగవచ్చును. ఏమనఁగా "పడవలవాండ్రెల్లప్పుడును పాటను బాడుట లేదు. ఎప్పుడో వారి యుల్లాసముకొఱకుఁ బాడుచుందురు. కావున సంగీతసాహాయ్యంబుననే లాగుచుండి రనుట సత్యము కాఁజాలదు"

అని సంశయింతురు. ఈ సంశయ మనావశ్యకము. ఏలయన వారు నోటితోఁ బాడుటను గొంతసేపు విడిచినను లయనుమాత్రము విడుచుట లేదు. అందఱును అడుగును గలిపియే నడుతురు. అట్లు పాడని సమయములయందు లయను సూచించు బహిర్లక్ష్యముగ నుండుటకై వారిలో మొదటివాని చేతిలో నొక గజ్జలకఱ్ఱ నుంచెదరు. దాని నతఁడు లయప్రకారముగాఁ గ్రిందఁ గొట్టుచుండును. దాని ననుసరించి వా రందఱును అడుగుగలిపి నడుతురు. ఇది కేవలతాళమును సూచించును. ఉత్సాహజనకమగు గానము మాత్ర మిందు లేదు. కొందఱీ కఱ్ఱనుగూడ నుపయోగింపకపోయినను అంతర్గత సాహాయ్యముచేతనే లయ ననుసరించి యందఱును ఏకకాలమం దడుగును గలిపి నడుచుట విధి. అది తప్పదు. తప్పనెడ నందఱిశక్తియు నేకకాలమందుఁ బ్రయోగింపఁబడదు. భిన్నకాలములయందుఁ బ్రయోగింపఁబడునెడ నది మొత్తముకాఁజాలదు. మొత్తము కాని యొకరిద్దఱి శక్తికి పడవ కదలదు. అట్లు కదలుట యసాధ్యము. కావున వా రందఱు నడుగును గలిపియే నడుచుచున్నారు. ఇంకను సంశయము కలవారు పడవల యొద్దకుఁ బోయి విచారించుకొందురు గాక.

బరువులను ఎత్తుట లాగుట, వడ్లను దంచుట, కవాతు చేయుట, సైన్యమును నడిపించుట లోనగు కార్యములన్నియు తాళాంతర్వర్తియగు లయయొక్క సహాయము చేతనే జరుపఁబడుచున్నవి. దీని కొఱకుఁ గొన్నివేళలఁ బాటలను బాడుదురు. కొన్నివేళలఁ బాడకయే తాళమును మాత్రమే చేకొని హృదయమందు నిలుపుకొందురు. ఆ పాటలలోఁ గొన్ని పెద్దవి; కొన్ని మిక్కిలి చిన్నవి. కొన్నివేళల నర్థవిహీనములైన రెండు మాటలనే చిన్నపాటగ నుపయోగింతురు. 'షమ్మలే డమ్మసే' అనునది కూడ వీరి కొక పాటయే. తమ శక్తి నెంత యెక్కువగఁ బ్రయోగింపవలసియుండునో పాట నంతకుఱుచగఁ జేసికొందురు. ఈ లయజ్ఞానమునకు మన మొనరించు ప్రతిపనియందును సంబంధము కలదు. మన మొనరించు వానిలోఁ బైనిఁ జేర్కొనఁబడినవానివంటి యనేక సంఘకార్యములు లయసాహాయ్యము లేనిది మొదలే సాగవు. కావున సంఘీభావమునకు లయ మహావశ్యకము.

మఱొక్క విషయము కలదు. సంఘీభావమునకు సంగీత ప్రథమార్థభాగమైన శ్రుతితో సంబంధము లేదనిమాత్రము తలంపఁగూడదు. భాషతోఁ గూడిన కార్యములందు శ్రుతి లయలు రెండును ఆవశ్యకములే. ఎట్లనఁగా:—పలువురు చేరి యొక మహా కార్యసిద్ధికై యేకగ్రీవముగఁ బరమేశ్వరుఁ బ్రార్థింపఁదలఁచి రనుకొనుఁడు. అది యెట్లు

సాధ్యమగును? వారి ప్రార్థనము వచనముగా వ్రాసి యందఱు నేకగ్రీవముగాఁ జదువ గెంతురా? వచనమునకు శ్రుతిలయ నియమములు రెండును లేవు గనుక నది యసాధ్యము. పద్యముగఁ జేసికొని ప్రయత్నింతురా? అదియు సాధ్యముకాదు. పద్యములందు లయ మాత్రము కలదు. శ్రుతిసంబంధమైన రాగసంగతి భేదము లైచ్ఛికము లైయున్నవి. కావున నందఱి యొక్క శబ్దము నే యొకరు మృదువుగను, మఱొకరు కఠినముగను, నింకొకరు సంతోషకరముగను, వేఱొకరు జాలికరముగను, మఱికొంద ఱిట్లే పలువిధ ములుగను బలుకుదురు. అందఱు నేకరాగంబుననే పాడుట కేర్పఱచుకొనినను అందఱి ధ్వనుల యారోహణావరోహణ డాలు స్ఫురిత కంపితాది గమకము లనిర్దిష్టము లగుటచే స్వేచ్ఛగాఁ బలుగతులఁ బాడుదురు. కావున నేకగ్రీవముగఁ బాడుట కేకరాగ నియమము చాలదు. మఱి యే మొనర్పవలయు? ఆ ప్రార్థనను పాటగఁ జేసికొని పాడ వలయు. అందఱు నేకగ్రీవముగఁ బాడ నగును. ఒకరు దానిలోని యొక యక్షరము నెట్టి గమకముతో నెంత సౌమ్యముగ నందురో కొదవవా రెల్లరు నట్లే యేకగ్రీవముగ నందురు. ఒక రెచ్చట నాపుదురో అంద అచ్చటనే యాపుదురు. ఒక రొకచోట నొక యక్షరము నెన్నిమాత్రల దీర్ఘముతోఁ బల్కుదురో అందఱు నట్లే పలుకుదురు. ఇంతయేల? ఎందరు పాడినను ఒక్కఁడు పాడునట్లే యుండును. ఒక్కని కంఠధ్వనిగనే వినఁబడును. దీనినే యేకగ్రీవ మని చెప్పుదురు. ఇది సంగీతసాహాయ్యముననే సాధ్యమగును. సంగీతమే లేకపోవునెడ నీ యేకగ్రీవశబ్దము భాషనుండి లేకపోవలసి వచ్చును. ఇతరశాస్త్రము లేవియు దీనిని భాషలో సార్థకముగ నిలుపఁ జాలవు.

## గానకార్యములు.

క. ఏకగ్రీవీకరణము,
లోకంబున వివిధకృతుల • లో నెల్లపుడుం
బ్రాకట సంఘీభావము,
నేకరణిం గలుగు గాన • మెఱుఁగకయున్నన్?

ఇందు మఱియొకవిశేషము కూడఁ గలదు. ఈ యేకగ్రీవప్రార్థనమునందు వారి మనోభావము లా శబ్దార్థముల నాశ్రయించి యుండును. శబ్దము లేకగ్రీవమగుటచే తదాశ్రితమనోభావములును ఏకమగును. వారి కరచరణంబులును తద్భావానుకూలంబుగనే చలించుచుండును. ఇట్లు మనోవాక్కాయముల నేకముచేయుటయే త్రికరణశుద్ధి యనఁబడును. ఇట్లు త్రికరణశుద్ధిగఁ జేసిన బహుజనప్రార్థనము నంగీకరించి భక్తవత్సలుఁ

ఉను సత్యస్వరూపుఁడు నైన యీశ్వరుఁడు కార్యసిద్ధి నొసఁగును. ఇందు బహుజనమనోభావము లేకమగుటచే నిందఱ మనోబలము (Will-force) ను ఏకమగును. ఏకమైన బహుజనసంకల్పబలముచేఁ గార్యసిద్ధి కలుగును. కావున నిరీశ్వరవాదులును దీనిని బూర్వపక్షముచేయరు.

ఇట్టి త్రికరణశుద్ధియుతమైన సంఘీభావమును శృతిలయసహితమైన సంగీతవిద్య కలిగించుచున్నది. సంగీతము నెడఁబాసి ప్రపంచమున నిజమగు సంఘీభావమే లేదు. సంఘీభావముయొక్క ప్రయోజనమునుగూర్చి నేను వివరించుట యనావశ్యకమగును. అది యెల్లరకును గొల్లగోవిందముగఁ దెలియును. అట్టి సంఘీభావమును గోరెడి విద్యార్థి సంగీతవిద్యాభ్యాసమును జేయవలయు. సంగీతవిద్యానైపుణ్య మిచట విషయముకాదు. సంగీతవిద్యాపరిచయము మాత్రమే విషయము. కావున విద్యార్థి సంఘీభావముయొక్క ప్రాముఖ్యము ననుసరించి సంగీతవిద్యను దా నభ్యసించు విద్యలలో మొదటిదానిగ గ్రహించి శక్తికొలఁది నభ్యసింపవలసియున్నది.

గా న ము.

ఆ. వె. గాన విద్య చేయు ♦ ఘనకృతుల్ విద్యార్థి
తెలిసి, శ్రద్ధ తోడ ♦ దినదినంబు
బహుళ విద్య లందుఁ ♦ బనివడి గానంబు
మొదటి విద్య కాఁగఁ ♦ బూన వలయు.

2. శిల్పములు - వివిధావయవధారాళప్రయోగశక్తిని గలిగింపఁగలవా యనుట రెండవసంశయము. ఇది మిక్కిలి సులభముగనే నివారణమగును. శిల్పులలో నొకఁడగు వడ్లంగి నిచట దృష్టాంతముగఁ జేకొందము. ఈ వడ్రంగి తన ఉలి, బాడిస, బరమా, చిత్రికగుల్ల, చేఅంపము, పెద్దఅంపము, లోనగు వివిధాయుధముల నుపయోగించునప్పు తన చేతులను వివిధగతులఁ బ్రయోగించుచున్నాఁడు. ఇట్టి వివిధచలనములకు దిన దినము నలవాటుపడుచున్న చేతులకు ధారాళప్రయోగానుకూలశక్తి కలుగుననుట నిర్వివాదాంశము. ఈ శక్తివలనఁ బ్రయోజన మేమి యనియు సంశయము కలుగవచ్చును. తత్సంశయనివృత్తికై యొక యుదాహరణము నిచ్చెదను. కేవల భాషాపిదుఁడగు నుద్యోగి యింటిలోని కొక పాము వచ్చె ననుకొనుఁడు. ఆ యుద్యోగి దానిం జంప సాహసించునా? సాహసింపఁడు. మ రేమి చేయును? గగ్గోలుపడి వీధిలోనికిఁ బరుగెత్తి యే బండివానినో యే పనిపాటలవానినో సాయమురమ్మని కేకలు పెట్టును. ఆ

సర్పమే యొక వడ్లంగి యింటిలోనికి వచ్చెననుకొనుఁడు. అతఁ డన్యసాహాయ్యమునకై పరుగెత్తునా? పరుగెత్తఁడు. ఉద్యోగి యేల పరుగెత్తును? ఈతఁ డేల పరుగెత్తఁడు? దీనికిఁ గారణములు ప్రత్యక్షముగ నేయున్నవి. ఉద్యోగి యొక మేకును గోడకుఁ గొట్ట నెంచును, నెడమచేతితో మేకును గట్టిగాఁ బట్టుకొని, కుడిచేతితో సుత్తెను బట్టుకొని, కొట్టఁబోవునపుడు మేకుపైని గొట్టుటకు బదులు చేతిపైఁ గొట్టుకొనెడి మహానుభావుఁడు. ఇట్లొకటిరెండు పర్యాయము లనుభవించి యుండుటచేఁ దన చేతులయం దాతనికి నమ్మకము చెడినది. తన కన్ను చూపిన ప్రదేశమందుఁ దన చేయి కొట్టదనియుఁ దన కంటికి చేతికి సంబంధమే లేదనియు, ఈ చేతు లుండియు వ్యర్థమనియు నాతని కనుభవపూర్వకముగఁ దెలిసినది. కావున నతఁడు పరుగెత్తెడి పామును గొట్టుటకు సాహసింపఁడు. వడ్రంగియో తన కన్ను చెప్పినట్లెల్లఁ దన చేయి నుచితముగఁ బనిచేయుటను దాను దినదినమును జూచుచున్నాఁడు. తన చేతు లాపత్కాలమందుఁ దనకుఁ దోడ్పడునను నమ్మిక మాతనికి దృఢంబుగఁ గలదు. కావున సర్పమును సాహసముతో డీకొని చంపును. దీనిచేత నేమి తెలియుచున్నది? వివిధములగు శిల్పములచే వివిధావయవములకు ధారాళచలనశక్తి కలుగును. ఆ శక్తి యాపత్కాలమందును, ఆవశ్యకమగునపుడును మిక్కిలిగఁ బనికివచ్చును. కావున విద్యార్థి వీని నభ్యసింపవలసియున్నది అభ్యసింపనియెడఁ గాలుసేతులు లేనివాఁడుగఁ బరిగణింపవలసివచ్చును.

## శిల్పములు.

గీ. శిల్పములు వాని విధులను ♦ జేసి మఱియు
నవయవములకు ధారాళ ♦ మైన చలన
శక్తి నొసఁగి, యారోగ్యముఁ ♦ జక్కఁ బఱుచుఁ
గాన విద్యార్థి వీనికై ♦ కడఁగ వలయు.

విద్యార్థు లీ శిల్పముల నభ్యసించుటచేత మఱియొక గొప్ప ప్రయోజనమును గలదు. ఆయా శిల్పము లన్నియు మనదేశమందు సాహిత్యవిద్యాహీనుల చేతులలోఁ బడుటచే వానియందు గ్రంథములులేక యవి యంతరించిపోవుచున్నవి. వానిని విద్యార్థులు నేర్చునెడ వీరిలో ననంతరమందుఁ గవులుగ వెలువడువా రాయా శిల్పములందుఁ గూడ గ్రంథములు వ్రాయుట కనువుపడును. ఇది మన దేశమునకు మహావశ్యకము. విద్యార్థు లీ శిల్పాభ్యాసమును దమ కావశ్యకములగు విద్యలలో రెండవదానిగ గ్రహించి చేకొనవలయును.

3. వ్యాయామముచేత జనసామాన్యాధిక దేహబల సంపాదనము కల్గుగునా యను శంక మూఁడవది. దీనిని గూర్చి సంగ్రహముగ మనవిచేయుదును. విద్యాపరిశ్రమ చేసి బి. యే. పరీక్షయందుఁ గృతార్థులగువారియందసామాన్య బుద్ధిబలము కన్పట్టుచుండుట లేదా? అట్లే దేహపరిశ్రమచేయువారియందు అసామాన్యదేహబలము ను గలుగును. అట్టివారి నెందఱనో చూచుచున్నాము. (ఈ విషయము వ్యాయామమును గూర్చిన ప్రత్యేకచర్చయందు మఱికొంత విపులముగ వ్రాయఁబడును). దీనివలనఁ బ్రయోజనమేమి యందురేమో. దానికొక దృష్టాంతమును జెప్పెదను. ఒక మేడలో దిగువ భాగమందుండిన బస్తాలకు నిప్పు తగులుకొని యది మెట్లయొద్దనుండి కాలుచు వచ్చుచున్నది. మేడపైని స్త్రీపురుషులు పండ్రెండుగురు కలరు. దిగుటకు వేఱొక త్రోవ లేదు. రక్షించుఁడు రక్షించుఁడని వారచటినుండి కేకలు వేయసాగిరి. ఆ మేడచుట్టును నాలుగువందలమంది స్త్రీపురుషులు మూఁగియుండిరి. కాని యేమియుఁ జేయఁజాలక పోయిరి. ఆ మేడమీఁది పండ్రెండుగురును బ్రత్యక్షముగ నిప్పులలోఁ బడి కాలిపోవలసి యుండిరి. మంటలు మిక్కిలిగ సమీపించుచున్నవి. అప్పుడు వారిపాలిటికి దేవునివలె నా గుంపునుండి యొకవ్యాయామవిద్యానిపుణుఁడు పరుగెత్తుకొని వచ్చెను. అతనిఁ జూచినతోడనే జను లందఱు నానందపరవశులైరి. 'రక్షించుము రక్షించుము' అని యొడలెఱుఁగక యాతురముతో నఱచఁజొచ్చిరి. అపుడా నిపుణుఁడొక నులక త్రాటిని ఒక మోకును దెప్పించి, నులకత్రాటి యొకకొనకొక రాతిని గట్టి మేడపైకి విసరి, దాని రెండవకొనకు మోకును గట్టి పై కీడ్చుకొమ్మని, యామోకును మేడపై స్తంభమునకుఁ గట్టించి, దాని రెండవకొనను బట్టుకొని త్రాటిమీఁదనుండి మేడపై కెక్కెను. అపుడా మోకును బైకీడ్చుకొని దాని రెండవకొనను అర్ధగజము కొలత గల యొక కఱ్ఱయొక్క మధ్యను గట్టి, దానిమీఁద నొక్కొక్కరినే మోకు తొడల మధ్య నుండునట్లు కూర్చుండఁబెట్టి, మోకును గట్టిగఁ బట్టుకొమ్మని, భయముచేఁ జేతులు విడిచిపెట్టుదురేమో యని మఱియొక త్రాటితో వారి నడుమును మోకునకు బిగువుగఁ గట్టి, క్రిందికి దించెను. ఇట్లా పండ్రెండుగురిని దించి సమీపించుచున్న మంటలు తనకుఁ దగులకమునుపే తానును దిగివచ్చెను. జనులందఱును మహానందభరిత హృదయులగుచుఁ గరతాళములతో జయజయధ్వానము లొనర్చిరి.

ఇట్టి వ్యాయామవిద్యానిపుణులు సంఘమునకనావశ్యకమని యే బుద్ధిశాలియైనఁ జెప్పఁగలఁడా? ఆపద లెప్పుడువచ్చునో యెట్లువచ్చునో యెవ రెఱుంగుదురు? అవి

చెప్పి వచ్చునా ? వానిం దప్పించుకొనుటకై ప్రయత్న మక్కఱలేదా? శీతోష్ణబాధఁ దప్పించుకొనుట కిండ్లను గట్టుట లేదా? జారచోరబాధలఁ దప్పించుకొనుటకుఁ దలుపులను గట్టి గడియలను గట్టి తాళములను బెట్టుకొనుట లేదా? అట్లేయీ వ్యాయామ విద్యానిపుణులకొఱకును బ్రయత్నింపవలయు. వీ రచట లభింతురు? ఎట్టి నిపుణు లయినను విద్యార్థులనుండియే లభింపవలయు. విద్యార్థు లందఱును నభ్యసించు నెడ వారిలోఁ గొంద ఱాత్మరక్షణమాత్రప్రయోజకులును, మఱికొందఱు స్వపరరక్షణ సమర్థులును నూటికిఁ బదిమందియైన వెలువడుదురు. కావున. విద్యార్థు లెల్లరును వ్యాయామవిద్యను శ్రద్ధతో నభ్యసించుట తృతీయావశ్యకము.

వ్యా యా మ ము.

సీ॥ శీతోష్ణబాధలఁ ♦ జేరనీయకయుండ - ఘన సౌధముల నిండ్లఁ ♦ గట్ట లేదె ?
జారచోరాదిదు ♦ ర్జనబాధలను నాఁగ - బీగాల గడియలఁ ♦ బెట్ట లేదె ?
జ్వరవాతపిత్తాది ♦ బాధలఁ దొలఁగింప - మందుమాకులను న ♦ మర్ప లేదె ?
శ్వానవృశ్చికసర్ప ♦ జంబుకాదుల నాఁగ ♦ కరదండముల త్రోవ ♦ లరయ లేదె ?

గీ॥ ఇట్టి మఱికొన్ని బాధల ♦ నెట్టుకొఱకు
దేహబల మెంతముఖ్యమో ♦ తెలియఁబడదె ?
అద్ది వ్యాయామమునఁ గాక ♦ యలవి యగునె ?
దానిఁ బడయంగ విద్యార్థి ♦ పూన వలదె ?

**4.** జనసామాన్యాధికజ్ఞానబలసంపాదనము లోకానుభవముచేతను విద్యచేతను గలుగునా యనుట చతుర్థసంశయము. ఈ సంశయమును వారించుటకు విశేషశ్రమ మక్కఱలేదు. జ్ఞానసంపాదనమునకు లోకానుభవమును విద్యయు రెండును సాధనములే. ఈ రెండుసాధనములును రెండుపాఠశాలలయందు లభించును. లోకానుభవము నిచ్చునది యీశ్వరస్థాపితమైన ప్రపంచపాఠశాల. విద్య నిచ్చునది మనుష్యస్థాపితమైన కల్పితపాఠశాల. ప్రపంచపాఠశాలయందు లభించునది యుత్తమవిద్య. కాని యందు బోధకులు లేరు. పాఠములుమాత్రము చిత్రింపఁబడిన ట్లుండును. విద్యార్థి వానిని, స్వాధికారానుసరణంబుగ గ్రహించుకొనవలసియున్నది. కావున నిందలి విద్య తీవ్రబుద్ధులకు మాత్రమే స్వాధీనమగును. ఇట్టి తీవ్రబుద్ధులచేత మందబుద్ధులులోనగు సర్వజనుల యుపయోగార్థము ప్రపంచపాఠశాలకుఁ బ్రతినిధిగ నేర్పఱుపఁబడినది కల్పితపాఠశాల.

## పా ఠ శా ల లు.

గీ. మానవుల కభ్యుదయ మగు ♦ జ్ఞానబలము
వెలయు లోకానుభవమున ♦ విద్యచేత
అట్టి రెంటికి స్థానంబు ♦ లగుఁ బ్రపంచ
పాఠశాలయుఁ గల్పిత ♦ పాఠశాల.

అచటిపాఠములే యిచట బోధింపఁబడును. దీనియందు బోధకులుఁ కలరు. ఇందు తిట్టి, కొట్టి, కోదండమును బట్టించి సామ దాన భేద దండ చతుర్విధోపాయములచేతను ఎట్టి మందబుద్ధికైనను సాధ్యమగువఱకు విద్య నేర్పఁబడును. ఈవిద్యనే ప్రతివిద్యార్థియు నభ్యసింపవలసియున్నాఁడు. పశువునకును మనుజునకును గల భేదము విద్యయందే కలదు. ఇట్టి విద్య నభ్యసింపనివాఁడు విద్యావిహీనః పశుః అను న్యాయమునకు లోఁబడవలసివచ్చును. ఆ పశుత్వమునుండి తప్పించి మానవత్వమునుగూడ నతిక్రమింపించి దేవత్వమువఱకును మనుజు నభివృద్ధిచేయఁదగిన సాధన మీ విద్యయే. ఇది కొదవ శక్తిత్రయమునకును వన్నెఁ గల్పించును. మనుజునకు నాగరికతను, జ్ఞానాధిక్యమును, ఆనందమును నిచ్చును.

మన ప్రకృతకాలవిద్యార్థి యీ విద్యయందలి నాగరికతాధికజ్ఞానానందములకు భ్రమపడి కొదవ శక్తిత్రయము నుపేక్షించుచున్నాఁడు. ఇది యొక గొప్ప పొరపాటు. సంపూర్ణమనుజత్వమున కీ నాల్గుశక్తులును వలసియున్నవి. ఇవి యొకటివెనుక నొకటిగ సంపాదింపఁదగినవియుఁ గావు. ఈ నాల్గుశక్తులను సంపాదించుటకును బ్రయత్నము లేకకాలావచ్ఛేదములుగనే జరుగవలసియున్నవి. కానిచో నొక్కొక్కదానియందు వీరొనరించెడు నభివృద్ధి బానకడుపు, బోదకాలు వలెనే పరిణమించును. కాని మన యాంధ్రపండితాచారానుసరణముగ వారి సంతతివారగు విద్యార్థులొకెల్లరకును కేవల శాస్త్రీయ విద్యయందే కుతూహల మెక్కుడు. దానంజేసి తదితరవిద్యార్థు లెల్లరు నంధపరంపరగా నదేమార్గము నవలంబించుచున్నారు. ఈ పొరపాటును సవరించుకొని విద్యార్థులు సంపూర్ణవిద్యాపద్ధతుల నవలంబించుట యావశ్యకము.

## పూ ర్ణ మ ను జ త్వ ము.

సీ. సతతసంఘీభావ ♦ కృతములు గానవి - ద్యాసహాయంబున ♦ నలవి యగును
దేహావయవకృత ♦ దివ్యకార్యప్రజ్ఞ - శిల్పాదివృత్తుల ♦ చేతఁ గలుగు

దేహబలకృతముల్ ♦ దినదినవ్యాయామ - సాధనంబున నట్టె ♦ సాధ్యమగును
జ్ఞానబలకృతముల్ ♦ ఖచితలోకానుభ - వమున వాగ్విద్యను ♦ బట్టువడును

గీ. ఈ చతుర్విధకృత్యంబు ♦ లెల్లరకు న
వశ్యమగుఁ; దత్క్రరణశక్తిఁ ♦ బడయు కొఱకు
నల చతుర్విధ విద్యల ♦ నభ్యసించి
పూర్ణమనుజత్వ మందుట ♦ పూజ్యతమము.

ప్రపంచమందలి సమస్తదేశాచారముల నెఱింగి నాగరికతఁ జెందిన మన ప్రభుత్వము వారి కీ విద్యాభ్యసనమర్మము లన్నియుఁ జక్కఁగఁ దెలియును. వారి పిల్లలకు విద్యనీ శక్తిచతుష్కసంపాదనానుకూలముగ విభజించి నేర్పుకొనుచున్నారు. మన పిల్లలకును నట్లే నేర్పుటకు సర్వప్రయత్నములఁ జేయుచున్నారు. నిర్బంధపద్ధతుల నవలంబించుట వారి మతము కాదు. ప్రజాభిప్రాయానుసరణముగఁ బోవుటయే వారి పాలనముయొక్క మూలసూత్రము. కానఁ బ్రజలకుఁ బూర్తిగ సమ్మతమగు వాగ్రూప విద్యను నిర్బంధవిద్యగ నుంచి, ప్రజల కరమనసు గల దైహికవిద్యలను ఐచ్ఛికవిద్యలుగ నుంచిరి. ఇచ్ఛాధీనమే ఐచ్ఛికము. మనవారికి దైహికవిద్యలం దిచ్ఛ మొదలే లేదు. కావున వానిని బూర్తిగ నుపేక్షించిరి. వీరిని సోమరులుగ నుంచుట కిష్టములేక ప్రభుత్వమువారు వానికి బదులుగ వీరి వాగ్రూపవిద్యాపాఠములనే హెచ్చించిరి. ఈపాఠములందు మాత్రము మన విద్యార్థి యాంగ్లేయవిద్యార్థిని మించుచున్నాఁడు.

ఈ దోషములు సవరింపఁబడుటకు మార్గమేమి? ప్రజాభిప్రాయము మారుటయే మార్గము. ఇంతకన్న మార్గాంతరము లేదు. ప్రభుత్వమువా రెప్పుడును ప్రజాభిప్రాయము ననుసరించియే యున్నారు. అట్లయిన నిపుడు ప్రజాభిప్రాయ మెట్లున్నది? కూలి కొఱకు విద్య నేర్చుటగా నున్నది. ఒక్క దృష్టాంతమును జిత్తగింపుఁడు. ఒక విద్యార్థిని సంగీతమును నేర్చుకొమ్మనుఁడు. 'నేను తంబుర బుజ్జను దీసికొని డబ్బు సంపాదించుకొనఁబోవుదునా? నాకు సంగీత మెందుకు? అని ప్రత్యుత్తరమిచ్చును. వడ్రంగమును నేర్చుకొమ్మనుఁడు. 'నేను బల్లలు కుర్చీలు చేసి యమ్ముకొని బ్రతుకఁబోదునా?' అని చెప్పును. సామును నేర్చుకొమ్మనుఁడు. 'నేను సర్కసుచేసి జీవింపఁబోదునా?' అనును. చదువుకొమ్మనుఁడు. ఉత్సాహముతో వినును. తన శంకల నడుగును. ఈ దిగువ గురుశిష్యసంవాదమును జిత్తగింపుఁడు.

గురు—నాయనా నీవు బాగుగఁ జదువుకొని పరీక్షయందుఁ గృతార్థుఁడవు కమ్ము.

శిష్య—ఏపరీక్షకుఁ జదువుదును?
గురు—ఓవర్‌సియరు పరీక్షకుఁ జదువుము.
శిష్య—ప్యాసుఅయితే జీత మేమిచ్చెదరు?
గురు—నాకు జ్ఞప్తిలేదు. పోనీ ప్లీడరుపరీక్షకుఁ జదువుము.
శిష్య—దానిలో డబ్బు చాలా దొరకునా?
గురు—దొరకును కాని నీవు ఉరుదు నేర్చుకొమ్ము.
శిష్య—ఉరుదు నేర్చుకొనిన జీతము చాలా యిచ్చెదరా యేమి!

పోలీసు ఇనస్పెక్టరును దస్తూరిపరీక్షను ప్యాసుకమ్మనుఁడు. అతఁడు చేయఁడు. కచ్చేరిలోని గుమాస్తాను గుఱ్ఱపుసవారిపరీక్షను ప్యాసుకమ్మనుఁడు. అతఁడును జేయఁడు. తమనౌకరీని స్థిరపఱచుకొనుటకు పోలీసు ఇనస్పెక్టరు గుఱ్ఱపుసవారీపరీక్షను, గుమాస్తా దస్తూరిపరీక్షను ప్యాసుఅగుదురు. ఇట్లు విద్యార్థి యెంతదూరమైనను కూలికొఱకు శ్రమపడుచున్నాఁడు. విద్యయొక్క ప్రయోజనము మాత్ర మిది కాదు. తనకుఁ దా నుపయోగించుట, తన సంఘమునకుఁ దా నుపయోగించుట యనునవే విద్యాప్రయోజనములు. వీనికై యొక్కసారిగ దుముకుట పనికిరాదు. విద్యార్థు లీప్రయోజనముల నెఱిఁగి విద్య నభ్యసించుటకు మొదలిడు నెడఁ గ్రమక్రమంబుగఁ గలిగిన యవరోధకుద్యము లెల్లఁ గ్రమక్రమంబుగఁ దొలఁగిపోవును. విద్యార్థులకు చతుర్విధశక్తులును గలిగి సంపూర్ణ మానవధర్మము లభించును. అట్టి భాగ్యమును మన యాంధ్రవిద్యార్థులకుఁ బరమేశ్వరుఁ డనుగ్రహించుఁ గాక.

విద్యార్థులు.

సీ. సీ! గానమేల? నాకెం ♦ సెన్సు! తంబుర గొంచు-బిచ్చమెత్తనె యంచుఁ ♦ బ్రేలు నొకఁడు
చాలు! నిఁడస్ట్రీసు ♦ సాధించి చిల్లర- కూలి చేయనె! యంచు ♦ గొణఁగు నొకఁడు
సాము మా కేటికి? ♦ సర్కసులోఁ జేరి - బ్రతుకఁ బోవనె యంచు ♦ వదరు నొకఁడు
చదువుఁ జదువు చున్న ♦ స్యాలరీ యేమిత్తు - రంచు జీతము మాట ♦ నడుగు నొకఁడు

గీ. తనకుఁ దాను, దనసంఘ ♦ మునకుఁ దాను
బనికివచ్చుటకే విద్య ♦ లని యెఱుఁగక
అక్కటా! కూలియే త్రమ ♦ యైడియల్‌గ
టంచుఁ జూతురు నేఁటి వి ♦ ద్యార్థు లహహ!



## 18. అవధానములు.

శ్రీమ దఖిలభువననిర్మాత యగు పరమేశ్వరునిచే సృజింపఁబడిన సమస్త చరాచర ప్రపంచమునందును యుక్తాయుక్తవిచారజ్ఞానసంపన్నతచే మానవుఁ డుత్తము డగుచున్నాఁడు. కార్యమువలనఁ గారణమును గ్రహించునట్లు సృష్టివలన స్రష్టయొక్క యభిప్రాయములను సాధ్యమగునంతవఱకు గ్రహించి త దభిప్రాయానుకూలముగ లోక వృత్తముల నిర్వహించుటయందుఁ దాను దన ప్రజ్ఞ నంతను వినియోగించుచున్నాఁడు. మఱియు నితర చరాచరముల నన్నిటిని దనకు సహాయముగఁ గొనుచు వానిని స్వేచ్ఛగఁ బ్రయోగించుచున్నాఁడు. ఇతరజంతుజాలము నంతను దన ప్రజ్ఞచేత స్వాధీనము చేసికొని యాయా జంతువులు వానివాని విధులఁ గ్రమంబుగ నిర్వర్తించున ట్లొనరించు చున్నాఁడు. ఈ కార్యములం దెల్లను మనుజునకుఁ బ్రజ్ఞ మహావశ్యకము.

ప్రజ్ఞ.

ఉ. కార్యముఁ బట్టి కారణము ♦ కావున సృష్టినిబట్టి స్రష్ట తా
త్పర్య మెఱింగి తద్గతుఁ ♦ దాఁ జరియించు టెకాక పైని యా
శ్చర్యముమీఱ నట్టులె యు ♦ జస్రము జీవులనెల్లఁ ద్రిప్పు స
త్కార్యముఁ బూనియుండిన క ♦ తంబున మానిసి ప్రజ్ఞఁ గోరెడున్.

అట్టి ప్రజ్ఞ రెండు విధములు; సహజప్రజ్ఞ, సంపాదితప్రజ్ఞ. సహజప్రజ్ఞయం దీతని ప్రయత్న మేమియు లేదు. అది మనుజునకును ద దితరములకును గూడ వానివానికిఁ దగునట్లు లభించుచుండును. సంపాదితప్రజ్ఞయందే మనుజాధిక్య మంతయుఁ గలదు. ఈశ్వరుఁ డొసంగిన దేహమనశ్శక్తుల రెంటిని సాధ్యమగునంతవఱ కభివృద్ధి నొనరించుటయే యీతని సంపాదితప్రజ్ఞ. ఇట్టి ప్రజ్ఞనుగూర్చి ప్రతిమనుజుఁడును సాధ్యమగు ప్రయత్నముల నన్నిటిని జేయుచున్నాఁడు. ఈ ప్రయత్నములు త్రివిధములు:—ప్రజ్ఞా సంపాదకములు, ప్రజ్ఞాద్యోతకములు, ప్రజ్ఞాప్రయోజకములు. వివిధవిద్యలందు విద్యార్థు లొనరించు ప్రయత్నము లన్నియుఁ బ్రజ్ఞాసంపాదకములు. పాఠశాలలందలి సంవత్సర పరీక్షలు, గానసభలయందలి పల్లవిపాటలు, వ్యాయామవిద్యాసభలందలి బరువుల నెత్తుట మోయుట యినుపగొలుసులను ద్రెంచుట వనమృగములతోఁ గలియఁబడి పోరాడుట మొదలగుకార్యములు, కవిత్వసభలందలి యవధానములు- లోనగున వన్నియుఁ బ్రజ్ఞాద్యోతకములు. వివిధవృత్తులం దుద్యోగములను సంపాదించి తన శక్తిని దేశసేవార్థ ముపయోగించుట, ఏ సాధారణమైనపాటనైనను వన్నెలువెట్టి బహుజన

రంజకముగఁ బాడి యందలి భావమును శ్రోతలహృదయములందు నాటుకొనునట్లొనర్చుట, ఆపత్కాలములందును ఆవశ్యకసమయములందును బలహీనులులోనగు బరువుల నెత్తికొనిపోవుట, స్వపరబంధములం ద్రెంచుట, శత్రువులతో సమముగఁ బోరుట, దారసుతప్రసంగ గృహచ్ఛిద్రాది వివిధవిషయములు బహుభంగులఁ జిత్తము నాకర్షించుచుండినను దాను వాని నన్నిటిని సమర్థించుకొనుచు సంఘోపకారకరము లగు గ్రంథములను వ్రాయుట— మొదలగునవి ప్రజ్ఞాప్రయోజకములు.

మానవోత్కర్షమునకు సోపానత్రయ మనఁదగిన యీ త్రివిధప్రయత్నములను స్వల్పకార్యములందుఁ బ్రతిమనుజుఁడు నొనరించుచునేయుండును. ఘనకార్యములందు మాత్ర మట్లు కాదు. కొందఱు ప్రథమసోపానమందే నిలిచిపోదురు. అనఁగా విద్యాభ్యాసన మొనరించువారిలోఁ గొందఱుమాత్రమే ప్రజ్ఞావంతు లగుదురు; మిగిలినవా రచటనే నిలిచిపోవుదురు. ప్రథమసోపానాధిష్ఠాతలలోఁ గొందఱు ద్వితీయసోపానమందు నిలిచిపోదురు. అనఁగాఁ బ్రజ్ఞావంతులలోఁ బెక్కండ్రు తమ ప్రజ్ఞను సంఘోపయోగార్థ ముపయోగింపఁ జాలకయుందురు. విద్యలం దసమానప్రజ్ఞాధురంధరులయ్యుఁ దమ ప్రజ్ఞచేత నూతన గ్రంథముల రచియించుటకుఁగాని, బోధించి మఱికొందఱను దమ బోంట్లగా నొనరించుటకుఁగాని సమర్థతలేనివా రెందఱో సంఘమందుఁ గనవచ్చుచుందురు. ఇఁక ద్వితీయసోపానమందలివారిలోఁ గొందఱు తృతీయసోపానమునుగూడ నెక్కి తమ ప్రజ్ఞను బలువిధముల సంఘోపయోగార్థ ముపయోగింతురు.

ఇందుఁ బ్రథమసోపానమందలివా రాయావిద్యలం దించుక పరిచితిని మాత్రము సంపాదించుకొని దానిని స్వోపయోగార్థ ముపయోగించుకొనుచుందురు. కాని ద్వితీయ తృతీయసోపానారోహకులవలన సంఘమున కెప్పుడును మహోపకారము కలుగుచునేయుండును. ఎట్లనఁగా:—ద్వితీయసోపానమందలి వివిధప్రజ్ఞాధికులు తమ ప్రజ్ఞలను సభాముఖంబునఁ బ్రదర్శించునపుడు సభ్యు లా ప్రజ్ఞల కద్భుతాశ్చర్యముల నొందుచుందురు. ఆ సభ్యులలోఁ బెక్కం డ్రిట్టి ప్రజ్ఞాసంపాదనమునకై ప్రయత్నించుచుందురు. వారినుండి వెలువడెడి ప్రజ్ఞాధికులలోఁ గొందఱు తృతీయసోపానాధిష్ఠాతలును నగుదురు. దీనికిఁ గారణము ద్వితీయసోపానారోహకుల ప్రజ్ఞాప్రకటనకార్యమే. తృతీయసోపానారోహకులు ప్రయోజనము నెల్లప్పుడుఁ జేయుచునేయుందురు. వీరిలోఁ గ్రింది సోపానమందలివారిని పైసోపానమునకుఁ బొమ్మనుట న్యాయమేకాని పోవుటకు వారికి శక్తి చాలదు. అందఱును ఎం. యే. పరీక్షవఱకును జదువఁగలుగుట లేదు.

ఈశ్వరప్రేరితమైన సంకల్పబల మెంతవఱ కుండునో అంతవఱకు మాత్రమే పోవుదురు. పైకిఁ బోవకుండుటచేత వారు నిరసనార్హులుమాత్రము కారు. వారి ప్రజ్ఞ వ్యర్థము ను గాదు. వా రంతవఱకుఁ బూజనీయు లే.

ఇట్టి త్రివిధప్రయత్నములలోఁ గవు లొనరించు నవధానములు రెండవమెట్టుపై నుండువారి కార్యములు. ఇవి సంఘమునకు మహోపకారము నొనరించును. మనుజుఁడు తన సర్వప్రయత్నములందును బుద్ధిబలముచేతనే కార్యసిద్ధి నందుచున్నాఁడు. కొండంత యేనుఁగును గోరంతలో స్వాధీనము చేసికొనుచున్నాఁడు. పదిమంది కూలిజనులలో బుద్ధిబలముకలవాఁడు మేస్త్రీ యగుచున్నాఁడు. వేయిమంది సైనికులలో బుద్ధిబలము కలవాఁడు సేనాధిపతి యగుచున్నాఁడు. పదివేలమందిలో నొక్క బుద్ధిశాలి మంత్రి యగుచున్నాఁడు. ఇంతయేల? ప్రపంచమును బాలించునది మనుజుని బుద్ధిబలమేకాని మఱొక్కటి కాదు. ఇట్టి బుద్ధిబలము నభివృద్ధిచేయునవి 'అవధానములు.' ఇందు అవధానము, ధారణము, ఆశుకవిత్వము నను మూఁడు భాగములు కలవు. అవధాన మనఁగా నెచ్చరిక, జాకరూకత; ధారణ మనఁగా వివిధవిషయముల బుద్ధియందు ధరించి నిలుపుట; ఆశుకవిత్వ మనఁగా నప్పటికప్పుడే పద్యములఁ గూర్చుట. ఇచట నవధాయకుఁ డేకకాలమందు వివిధవిషయములందుఁ దన బుద్ధిని నిలిపి వానిని జాగరూకతతో ధారణచేసి సమగ్రముగ నెఱవేర్చును నాశువుగఁ బద్యము లల్లుచుండును.

మన యాంధ్రదేశంబునఁ బ్రకృతకాలమం దవధాయకులు మిక్కిలిగ నేకవిద్యా పరిచితిఁగల గీర్వాణాంధ్రపండితులలో మాత్రమే కన్పట్టుచున్నారు. ఈ యభ్యాసమే వివిధ విద్యాభ్యసనమొనర్చెడి యాంగ్లేయవిద్యాభ్యాసకులలో వ్యాపించునెడ నెంత యుపయోగకరముగ నుండును. గంటసేపు చదువఁదగిన పాఠమును బావుగంటలోనే సాధింతురు. పది దినములు చదువఁదగిన గ్రంథమును రెండు దినములలోనే చదివి ధారణచేయుదురు. వివిధపాఠముల నభ్యసించునపుడు కలవరమందక చిత్తస్థైర్యమును గలిగియుందురు. ఈ విద్యార్థు లెల్లరును అష్టశతావధానముఁ జేయఁజాలకపోవచ్చును. కాని పదనుకొలఁది కొక కొయ్యకత్తిని, ఒక యినుపకత్తిని, ఒక యుక్కుకత్తిని సమముగా నూఱినయెడ నొకదానియంత పద నింకొకదానికి రాకపోయినను బ్రతిదానికిని గొంత పదను వచ్చి కార్యకారిణియైనట్లు ఈ ప్రయత్నముచేత నవధానధారణాభ్యాసములు రెండును వీరల కలవడి, యమితోపకారమును జేయక మానవు. సాధారణముగా నీ యవధానములందుఁ బ్రధానభాగముగఁ బరిణమించుచుండు కవిత్వమందుఁ బ్రజ్ఞ

యభివృద్ధియగునెడ సంఘోపయోగకరము లగు నూతనగ్రంథముల వ్రాయనగును. ఇట్టి యవధానధారణాశుకవిత్వాభ్యాసముల నభివృద్ధిపఱుచుటయే యీ యవధానముల పరమావధి. ఇట్టి యవధానములం దఱముగాం జేయించి విద్యార్థులకుం జూపుచుండుటకు సంఘకర్ణధారు లగు మహనీయు లెల్లప్పుడును బ్రయత్నించుచుందురుగాక.

అవధానప్రయోజనము.

సీ. అవధానమును ధార • ణాశుకల్పనలును - దినదినం బరసి వ • ర్ధిలఁగ జేయు
నెందఱెన్నివిధాల • నిటు నటు లాగినఁ - జంచలింపని మన • స్థైర్య మిచ్చు
ధర సర్వసిద్ధిప్ర • దముగు మేధాశక్తిఁ - గఱకు ఖడ్గము రీతి • మెఱయఁ జేయు
గ్రంథబాహుళ్యభా • రముఁ దోఁపనీయక - సుంతలో గ్రహియించు • సూటిఁ దెల్పు

గీ. గంట పదివేడి చదువరు • గంట లోనె
యలవడఁగఁ జేయుచుండు వి • ద్యార్థులకును
మనుజబుద్ధుల నెపు డస • మాన గతుల
సానపట్టెడు పని యవ • ధాన మహహ.

## 19. వ్యాయామము; చర్చ.

రామరావు, వేంకటపతి, సోమనాధశర్మ, డంబాచారి, తీవ్రబుద్ధి, చపలమూర్తి, భీమరాజు, నిరభిమాని, మితభాషి అను విద్యార్థులును మఱికొందఱు పెద్ద మనుష్యులును ఇంకఁ గొందఱు విద్యార్థులును బ్రవేశించుచున్నారు.

రాము — (లేచి నిలిచి) ప్రసంగకౌశలాభివృద్ధిసంఘసామాజికులారా! ఈ సంఘకార్యదర్శిగా నేఁడు నేను తమ కందఱకును బంపిన ప్రకటనపత్రికవలన మన సంఘమం దిపుడు చర్చింపవలసిన విషయము వ్యాయామ మని తమ కెల్లరకును దెలిసియే యున్నది. మన మందఱమును జేరి యీ విషయమందు మనకు మార్గదర్శులుగ నుండఁదగిన యొకరిని ముందు సభాధ్యక్షులుగ నెన్నుకొనవలసియున్నది. మన భాగ్యవశమున నేఁ డీ సభకు సామాజికేతరవిద్యాధికు లెందఱో దయచేసి యున్నారు. మనకుఁ బ్రసంగకౌశలాభివృద్ధి నొనఁగూర్చు సంకల్పంబున సాదరులగుచు దయచేసిన యీ మహనీయులయెడ మన మెంతయుఁ గృతజ్ఞులమై యుండవలసియున్నారము. వీరిలో శ్రీ. హనుమంతరావు పంతులుగారిని నేఁ డీ సభ కగ్రాసనాధిపతిగ నుండుదురుగాక యని మన సమాజపక్షమున

ప్రార్థించుచున్నాఁడను. ఈ పంతులుగారు హూణాంధ్ర భాషానిపుణులు; ప్రఖ్యాతోపన్యాసకులు; వ్యాయామవిద్యాపరీక్షయందుఁ గృతార్థతఁ జెందిన వారు; ఈయోగ్యతలకన్నిటికిని వన్నె వెట్టునట్లు దేశోపకారదీక్షాతత్పరులు. కావున వీరు మనప్రార్థనము నవ్యథాకరింపరు. తమ రందఱు నేమఱుపాటులేక వారివలని ప్రయోజనమును జెంద సంసిద్ధులరై యున్నవార లని నమ్మెచు మన యీ సభ కగ్రాసనాధిపత్యమును వహింతురుగాక యని సంఘపక్షమున శ్రీ హనుమంతరావు పంతులుగారిని పునఃప్రార్థనంబు నొనర్చుచున్నాఁడను. (అని కూర్చున్నాఁడు.)

హను — (లేచి యున్నతస్థానమును సమీపించి నిలిచి) విద్యార్థులారా! మీ రెల్లరు నన్ను సభాధ్యక్షుఁడుగ నుండుమని కోరుటచే గౌరవించినందులకు మీ సంఘమువారియెడ నే నెంతయుఁ గృతజ్ఞుఁడనైయున్నాఁడను. విద్యలందును, లోకానుభవమందును, మఱి యనేకవిశేషములందును నాకంటె సమర్థులగువారెందఱో యీ సభయం దుండఁగా మీరు నాయందలి యోగ్యతాలేశములఁ జేకొని, గోరంతలఁ గొండంతలుగ గణించి, నాకు గౌరవంబు గడించితిరి. కాని యీ పదవికి నేను నుంతయు నర్హుఁడఁ గానని యే నెఱుఁగుదును. అయినను నే నిపు డీపదవి నంగీపరింపనియెడఁ దమ యాజ్ఞ నుల్లంఘించినవాఁడ నగుదునను వెఱపున నంగీకరించుచున్నాఁడను. (అని యున్నతాసనముపైఁగూర్చున్నారు. సభ్యులెల్లరుఁ గరతాళధ్వనులతోఁ దమ యామోదమును దెలుపుచున్నారు.)

రామ — ( విషయసూచికను అగ్రాసనాధిపతిగారి యెదుటఁ బెట్టుచున్నాఁడు.)

అగ్రా — (ఈ దిగువ విషయసూచికను దమలోఁ జదువుకొనుచున్నారు.)

విషయసూచిక.

"1 కార్యదర్శి సామాజికుల హాజరుపట్టీని వ్రాయుట.
2 వేంకటపతిగారు ప్రారంభోపన్యాసమును జదువుట.
3 సామాజికుల చర్చ.
4 సాంఘికేతరవిద్యార్థికుల యభిప్రాయములు.
5 అగ్రాసనాధిపతిగారి యభిప్రాయములు."

(లేచి ప్రకాశముగా) నేఁ డిచట జరుగవలసియున్న కార్యములలో సంఘకార్యదర్శిగారు హాజరయిన సాంఘికుల సంఖ్యను హాజరుపట్టీయందు సూచించుట ప్రథమ

కార్యముగా నున్నది. కావునఁ గార్యదర్శియగు రామరావుగార లెక్కింపఁ గోరుచున్నాఁడను.

రామ—(అట్లు సూచించి హాజరుపట్టీని అగ్రాసనాధిపతిగారియెదుట నుంచుచున్నాఁడు)

అగ్రా—(హాజరుపట్టీని విమర్శించి చూచి) కార్యదర్శిగారూ! మీ సామాజికుల మొత్తము సంఖ్య 45. అందు నేఁడు హాజరయినవారి సంఖ్య 22 ను గదా.

రామ—చిత్తము. అవునండి.

అగ్రా— (లేచి) ఇఁక నిపుడు జరుగవలసిన ద్వితీయవిషయము వ్యాయామవిషయిక ప్రారంభోపన్యాసము. దానిఁ జదువుటకు వేంకటపతిగారిని గోరుచున్నాఁడను. (అని కూర్చున్నారు.)

వేంక— (అగ్రాసనాధిపతిగారి యెడమపార్శ్వమందు నిలిచి) అగ్రాసనాధిపా! అయ్యలారా! విద్యార్థులారా! వ్యాయామవిద్యాప్రయోజనముం దెలుపుమ నొక వ్యాసమును సంగ్రహముగ వ్రాయుటకు నేను గార్యదర్శిగారిచే నాజ్ఞాపింపఁబడుటచేతను, ఆ విద్యయందు నాకుఁ గల గౌరవోత్సాహములచేతను నా యసమర్థతను గణింపక యీ వ్యాసలేఖనకార్యంబునకు బూనుకొంటిని. కావునఁ దమ రందఱును సాదరులగుచు నిందలి నా దోషముల మన్నింప వేఁడుచున్నాఁడను. వ్యాయామప్రయోజనమును గూర్చి యొక్క గ్రంథము వ్రాయఁదగియున్నది. దానిని సంగ్రహముగు వ్యాసమున నిముడ్చుట దుర్ఘటము. అయినఁ బ్రయత్నింతును.

ఈ ప్రపంచమందు మనుజుఁ డొనరించు సర్వప్రయత్నములును ఆయురారోగ్యైశ్వర్యము లను ప్రయోజనత్రయముకొఱకే. వీనిలో మొదటిరెండును మిక్కిలి ముఖ్యములు. వాని నిచ్చునది వ్యాయామము. మూఁడవదియగు నైశ్వర్యమునకు విద్యాబుద్ధులు రెండును గారణములు. ఒకవేళ జన్మప్రయోజనము మోక్షమే యందురేమో. దానికిని సాధనములగు యోగముద్రాసనము లన్నియు వ్యాయామ భాగము లే. దీనిచే దేహస్వాస్థ్యమునుగూర్చిన కార్య మంతయు వ్యాయామాధీన మయినట్లు కన్పట్టుచున్నది. మనుజునకు దేహస్వాస్థ్యసంపాదన ప్రయత్నము ప్రథమకర్తవ్యము. శరీరమాద్యం ఖలు ధర్మసాధనం అను నార్యోక్తి యీ యభిప్రాయమునే స్థిరీకరించుచున్నది. అట్టి దేహస్వాస్థ్యమునకు వ్యాయామమే ప్రధానసాధనము,

గీ. అఖిల మనుజాలి సర్వప్ర ♦ యత్నములును
నాయు రారోగ్య సంపద ♦ లబ్బు కొఱకె;
ఆయు రారోగ్యదంబు వ్యా ♦ యామ మొకటి;
అల సిరులు కల్గు బుద్ధివి ♦ ద్యలవలనన.

వ్యాయామముకొఱకుఁ జేయఁబడు సాధకములు రెండు విధములు, దేహబల సాధకములు, వినోదసాధకములు. ఇందు దేహబల సాధకములు ప్రతి మనుజునకును ఆవశ్యకములు; ప్రతిమనుజునకును సులభసాధ్యములు. వినోదసాధకములు దేహబలసంపాదనానంతరము స్వప్రయోజకత్వప్రకటనార్థముగను వినోదార్థముగను జేయఁబడఁదగినవి. ఇవి మొదటివానికంటె నెక్కువ కఠినములు. వీనిని మల్లులే చేయఁదగియుందురు. కొందఱు వ్యాయామ మనఁగా నీ వినోదసాధకములే యనుకొని, యివి తమ కసాధ్యములని వెఱఁగుపడి, వ్యాయామప్రయత్నమునే వదలుకొనుచున్నారు. మఱి కొందఱు దేహబలార్థము ప్రారంభించి వినోదసాధకములఁ జేయఁగడఁగుదురు ! వానియం దేమాత్రమైనఁ బ్రమాదము కలుగును. దానిచే నివ్వెఱపడి, వ్యాయామము ప్రమాదజనకమని తమ మనస్సున స్థిరపఱుచుకొని, తమచెంత కరిగెడివారి కందఱకును ఈసిద్ధాంతమునే బోధించుచుందురు. ఈ వ్యాయామమున విద్యార్థులొనరించు దోషములు లెక్కకు మించియున్నవి. వానిం గూర్చి ప్రత్యేకముగ నొక గ్రంథమును వ్రాయఁదగియున్నది. ఆ యా దోషములచేత నేదో నష్టము కలుగునపుడు దాని కారణమును వ్యాయామముపై నారోపించి వ్యాయామము మా కచ్చిరా దనుచుందురు. ఇది యొక గొప్ప పొరపాటు. ఈ పొరపాటు వ్యాయామవిద్యకు మహానర్థదాయకము.

## విపరీతము.

చ. సకలకలానురక్తు లగు ♦ సభ్యులమ్రోల యథార్థవాదినై
యొక విపరీతకార్య మిపు ♦ డున్నది యున్నటు లే వచించెదన్;
చకచక సాము సామనుచుఁ ♦ జయ్యనఁ బోయి, బలంబొసంగు సా
ధకములతోడ స్వావయవ ♦ దార్ఢ్యముఁ గాంచకముందె, మల్లు లె
న్నక కడు నిర్భయంబుగఁ బె ♦ నంగుచుఁ జేసెడి యా వినోద సా
ధకములఁ ద్రోవఁ బట్టి, పెడి ♦ దంబగుచేష్టలు చేసి, కొద్దినా
ళ్ళకె తన కాలుసేతులకు ♦ లావు శ్రమంబులఁగూర్చి, యాసుప
త్రికిఁ జని, కొన్నిమాసములు ♦ తీపులుతీసి, 'బళారె! చాలు సా

కిఁక గరిడీలు! సాము తల • కెక్కెను! చాలు!' నటంచు రోసి, యా
పెకలులు భీతిఁ జెంది, పది • వేల నమస్కృతు లాచరించి, పై
నిఁకఁ దమ చెంత కేగడి మ • ఱెవ్వరికైనను సాము చెంతఁ బో
వకుఁడని బుద్ధిచెప్పుదురు • బాపురె యీ విపరీత మెప్పుడే?

వ్యాయామవిద్య ప్రతిమనుజునకును మహావశ్యకము. మనుజుని వయస్కాలములలో విద్యాభ్యాసమున కనుకూలకాలము బాల్యము. కావున బాలురగు విద్యార్థు లెల్లరును దీని ప్రాముఖ్యమును గ్రహించి తగురీతి నభ్యసింతురుగాక. బాల్యమం దభ్యసించు దానిని యావజ్జీవితకాలము నాచరణయం దుంచఁదగును. కాని యౌవనమందే దీని బ్రారంభించు నెడ నెక్కువ శ్రమకరముగ నుండును. కావున మా సాంఘికు లెల్లరును దీని నేమఱక యభ్యసింతురుగాక యని కోరుచు నీవ్యాసమును ముగించుచున్నాఁడను.
(తనచోటికిఁ బోవుచున్నాఁడు).

సభ్యు—(సంతోషముతోఁ జప్పటలు కొట్టుచున్నారు.)
(ఇచటఁ జర్చ సేయువా రందఱును ప్రథమోపన్యాసకునివలెనే స్వస్థానమునుండి లేచి, యగ్రాసనాధిపతిగారి చెంత కేగి, నిలిచి, తమ యభిప్రాయములను సభ్యులకు విన్నవించి, పిమ్మట స్వస్థానమున కేగి, కూర్చుండుదురు.)

అగ్రా—(లేచి) ఇపుడు వేంకటపతిగారు చదివిన వ్యాసమునందలి గుణదోషములఁ జర్చింపఁ దలఁచిన సామాజికులు చర్చింతురుగాక యని కోరుచున్నాఁడ. (అని కూరుచున్నారు.)

సోమ— పూజ్యుఁడవగు నగ్రాసనాధిపా! సరసులరగు సభ్యులారా! నా మిత్రులగు వేంకటపతిగారు చదివిన వ్యాస మంతయు మిక్కిలి సమంజసముగనున్నది. 'వ్యాయామము ప్రతిమనుజునకును మహావశ్యకము' అని వారు చెప్పిన మాటలు సువర్ణాక్షరములతో వ్రాయఁదగియున్నవి. వ్యాయామముచే దేహావయవములకు ధారాళచలనసామర్థ్యము కలుగును. అట్టి చలనముచే బలసమృద్ధి కలుగును. ఈ రెండుశక్తులును ఆపత్కాలమందుఁ స్వపరప్రాణరక్షణం బొనర్చును మఱియు సర్వసౌఖ్యదమయిన దేహారోగ్యము నిచ్చును. ఇట్టి ప్రాణత్రాణనసమర్థంబును మహోపకారకంబును నగు వ్యాయామము నుపేక్షించువారు తత్ఫలము ననుభవింపక తీరదు. కొదవవిషయముల నన్నిటిని నామిత్రులగు వేంకటపతిగారే సెలవిచ్చియున్నారు. కావున నే నింతటితో విరమించుచున్నాఁడ.

గీ. అరయ వ్యాయామన దేహావ ♦ యవము లెల్ల
మలసి 1 ధారాళచలనసా ♦ మర్థ్య మొందు;
తచ్చలనమున 2 బలవృద్ధి ♦ తారసిల్లు;
వానిచే స్వప్రావన ♦ భాగ్య మమరు.

సభ్యు—(కరతాళధ్వనులతో సంతోషమును దెలుపుచున్నారు.)

డంబా— అగ్రాసనాధిపా! ఆర్యులారా! మిత్రులారా! నా మిత్రులగు వేంకటపతి గారును, సోమనాథశర్మగారును సెలవిచ్చిన విశేషాంశముల నామూలాగ్రముగఁ దమరెల్లరును గర్ణరసాయనంబుగ నాలకించియే యున్నారు. నేను గొన్ని విషయముల విన్నవింప నెన్నుచున్నవాఁడఁ గాని దాన నేమిదోషంబు వాటిల్లునో యను శంక నింకఁ గొంకుచున్నవాఁడ. అకారణకరుణాకటాక్ష భరితాంతరంగులును, సకలవిద్యాపారంగతులును, సరసాగ్రగణ్యులును నగు నీ సభాసదులెల్లరు నన్నెమ్ము పున్నెమెఱుంగని యీ చిన్నిబాలుని పల్కుల మిన్నగ నెన్ని మన్నింతురని విన్నవించుచున్నవాఁడ. నా సంగాతకాండ్రిరుగురును వచించిన వాక్కులు మిక్కిలి నిక్కువములే కాని యేను మాత్ర మొక్కింత వారితోడఁ గూడ భిన్నాభిప్రాయుఁడ నగుచుంటి నని తమ చెంతఁ దెల్పుట కెంతయుఁ జింతాభరితాంతరంగుఁడ నగుచున్నవాఁడ. వ్యాయామము ప్రతి మనుజునకు నావశ్యకమనిరి· ఇది భ్రమప్రమాదజనకము. ఇది కూలిచేయువారికిని మూటలు బస్తాలు మోయువారికిని మాత్రమే యావశ్యకము. ఉద్యోగముచేసికొనువారి కీ తంటా యుంట కలుగించు నని ఘంటాపథంబుగఁ జెప్పనగు. వారివారికి వలయు వివిధావయవపటుత్వమును సర్వజగన్నాయకుఁడగు సుమసాయకజనకుఁడే యొసంగి యున్నవాఁడు. ఆతని తప్పుల సవరింప నీ మా యప్పలుప్పతిల్లిరో యన దానిఁ నభివృద్ధి యొనరింతురఁట! ఇది మిగుల సాహసము. పెద్దపులి యేమి వ్యాయామముం జేయుచున్నయది. ఎద్దులు గుఱ్ఱములు నేమి వ్యాయామముం జేయుచున్నయవి. వాని బలంబున కేమికొఱంత వాటిల్లినది? కావున నుద్యోగస్థులకు వ్యాయామం బనావశ్యక మని గట్టిగ మనవిచేయుచు నేఁ జేపట్టినట్టి యీచిట్టి యుపన్యాసము నింతవట్టుతోఁ దుదముట్టించుచున్నట్టివాఁడను.

సభ్యు— (పటపటఁ జప్పటలు కొట్టుచున్నారు.)

అగ్రా—(లేచి) విద్యార్థులారా! మీలో నింకఁ బ్రసంగింపఁ దలఁచినవారు పలువు

రుండవచ్చును. ఒక్కొక్కరు చాలసేపు వచింపఁ జొచ్చినయెడఁ గాలహరణమగును. మీలోఁ బ్రతివక్తయు నుపోద్ఘాతమును జెప్పుట యనావశ్యకము. కాన నింకఁ బ్రసంగింపఁబోవువారు దానిం దొలఁగించి ప్రధానవిషయమును సంగ్రహముగఁ దెలుపవలయు నని కోరుచున్నాఁడ. (అని కూరుచున్నారు).

తీవ్ర—అగ్రాసనాధిప విద్యాధిక మిత్రవరులారా! వ్యాయామప్రాముఖ్యమునుగూర్చి నామిత్రులగు డంబాచారిగారు వాక్రుచ్చిన యభిప్రాయముతోడ నే నేకీభవించుచున్నాఁడను. మనుజుఁడు తన శక్తియుక్తుల నెల్ల నైహికాముష్మికసుఖదాయకమును, సర్వకార్యనిర్వహణ సమర్థమును, మీఁదుమిక్కిలి పరమేశ్వర లీలాస్వరూపమును, నిర్మలమును నైన జ్ఞానము నభివృద్ధి నొందించుటయందుపయోగింపఁదగుఁగాని మలమూత్రాది దుర్గంధపదార్థభరితమును, జడస్వరూపమును నైన యీదేహమును బలపఱుచుటయందును, దీనికి ధారాళచలనాది సామర్థ్యాతిశయములఁ గలిగించుట యందును, మఱియు దీనికి వివిధాలంకారములఁ గూర్చుటయందును వినియోగించుట యాశక్తియుక్తుల వ్యర్థపుచ్చుటయే యగును గాని సార్థకము కానేరదు. దేహబలం బాయా జంతువులకును నాయా మనుజులకును బరమేశ్వరాభిప్రాయానుకూలముగ వలయు వఱకు సహజముగుచు లభించుచుండ నద్దానిని మానవప్రయత్నముచేత నసామాన్యగతుల నభివృద్ధి నొందింతుమనుటఁ జూడ వీరలు నూతనసృష్టిని గూడఁ జేయ నుద్యమించుచుండిరా యనునట్టు లద్భుతజనకంబుగను హాస్యాస్పదంబుగను గూడఁ గన్పట్టి యీ వ్యాయామవిద్యయం దాదరోత్సాహముల గలిగించుటకుఁ బ్రత్యామ్నాయముగ నసూయానిరసనములఁ గలిగించుచుండు నని నే నభిప్రాయపడుచున్నాఁడ. నా మిత్రు లింక నిట్టి విపరీతాభిప్రాయములఁ దొలంగి వర్తింతురుగాక యని కోరుచు నా యుపన్యాసము నింతటితో ముగించుచున్నవాఁడ.

చప—మహనీయుఁడవగు నగ్రాసనాధిపా! పూజనీయులగు సభాసదులారా! వ్యాయామము మనుష్యునకు మిగుల ముఖ్యము. దీనిచేత బలము కలుగును. బలముచేత బరువుల నెత్తవచ్చును. కాలువలోని పడవమీఁదనున్న బరువుల నెత్తి యొడ్డున నుంచుట కొక యంత్రము కలదు. రైలుబండి పట్టాలమీఁదనుండి తొలఁగి పడిపోవునపుడు దాని నెత్తుటకు జాకీ లను మఱియొకవిధమైన సాధనములు కలవు. కాని రైలుబండి పడిపోవునపుడు ప్రజలకును, బ్రజల ధనప్రాణము

లకును, జాల నష్టము సంభవించును. ప్రాణమువంటి విలువగల పదార్థము మన కింకొకటి యేదియు లేదు. దీని నిచ్చుటకుఁ బరమేశ్వరుఁ డొక్కఁడే సమర్థుఁడు. అతని మహిమ యపారమైనది. మఱియు నాతని—

అగ్రా—(ప్రాసంగికు నుద్దేశించి) మీ రిపుడు ప్రసంగింపవలసిన విషయము వ్యాయామము కావున దానిగూర్చియే యుపన్యసింపుడు.

చప—చిత్తముచిత్తము. దానిఁగూర్చియే ముఖ్యముగ మనవిచేయుచున్నాఁడఁ జిత్తగింపుఁడు.

మఱియు నా పరమేశ్వరు కటాక్షముచేత నే మన కీ వ్యాయామవిద్య లభించినది. ఆయన మన కిట్టి యుపకారముల నెన్నిటినో చేసియున్నాఁడు. ఆయన కృప లేకయున్న మన మొక్క క్షణమైన జీవింపలేము. మీ రందఱు —

అగ్రా—(మరల నుపన్యాసకు నుద్దేశించి) మీరు వ్యాయామమునుగూర్చి ప్రసంగింపుఁడు.

చప—చిత్తము. అలాగే మనవిచేయుచున్నాఁడను.

మీ రందఱు నా మనవిని జిత్తగించి యట్టి పరమేశ్వరునిచేత నొసఁగఁబడిన యీ వ్యాయామము నభ్యసింతురుగాక యని కోరుచు నా వ్యాయామవిద్యా విషయికోపన్యాసమును ముగించుచున్నాఁడను.

సభ్యు—(ఆశ్చర్యముతోఁ గరతాళములు వేయుచున్నారు).

భీమ—అగ్రాసనాధిపా! సభ్యులారా! నా మిత్రు లందరూ వ్యాయామం వ్యాయామమంటూ యేమేమో చెపుతూన్నారు. వ్యాయామమంటే సామేనా? ఏదీ యీ ఖబుర్లు చెప్పేవార్ని వచ్చి యీ సాముచేసినవాడి పక్క నుంచోమనండీ. వాఁ డొక్క గుద్దు గుద్దితే డమ్మని చచ్చిపోతారు. వీళ్ల చదువు లన్నీ యెందుకూ? యేడవనా? కూర్చుంటే ల్యావల్యాక మండల్లో గుఱ్ఱాలుతోల్తూ కూర్చోడానిక్యా? యీ చదువు లన్నీ సభల్లో బడి తనకి గిట్టనివాణ్ణి చడామడా నోరెత్తకుండా తిట్టడానికి పనికొస్తై. పేరెత్తితేనా వొక్క గుద్దుతో పడుకోబెడ్తాడు. ఆరమ్సాక్టు (Arms Act) వొచ్చిందని యెవరో మొన్న గునుస్తూంటే నాకు నవ్వొచ్చింది. వొకవ్యాళ్లో ఆయుధాలు పట్టుకోవొద్దనే ఆరమ్సాక్టును గవర్నమెంటువారు తీశేస్తారనుకోండి. ఏపనీ చాతకాక వీళ్ల రొండుచేతులూ కట్టేసుకున్న యీ ఆరమ్సాక్టు నెవరు తీశేస్తారు? (సభ్యులందఱు చప్పట్లు కొట్టుచున్నారు.) తన చేతుల్తో యేం చెయ్యాల్లో యెరగని

వాడ్కి ఆరమ్సెందుకండీ! యీ బతుకు బతకలాకే పోడుముకు చావడాని
కేమో. (అందఱును నవ్వుచున్నారు) పౌరుషంలేని యీ బతుక్కంటే అట్టా
చచ్చినా మంచిదే. పౌరుషములవాడే పురుషుడు. కాళ్లుచేతులూ లేని వారి
కా పౌరుషం చచ్చిపోక యేమౌతుంది? వకనాడా రెణ్ణాళ్లా? కలకాలం కలం
పట్టుకోడం కంటే యేమీ యెరగని చేతు లుంటేయేమి పోతేయేమి?
(సత్యము సత్యము)

అందుకని యిప్పుడు ముసలాళ్ళందరిని కసరతు చెయిమంటె కొంప మును
గుతుందండోయి. కొత్తరోగాలు పుడతాయి. తగినంత వుపంగా చేయించే
గురువు వీళ్లకి దొరకడు. కనక వీళ్ళు మానేస్తేనే నుంచిది. యీ గుంటళ్ళ
కేం రోగాలొచ్చినాయి. దుక్కల్లాగ తిని రోడ్లెంబడి గెంతడానికి మాత్రం
వోపికొస్తుందికాని సాము చెయిలేరూ? క్లాసులో వీళ్లు జంనాస్టిక్కు చేసేది వడ
సారం వారాని కరగంట. దాల్లో 20 మందికి 15 గురు సెలవచీట్లా! ల్యాకుం
టే క్లాసులో నుంచుని రోగాలొచ్చినా యనడమా! యింతకంటే ఆశ్చర్య
ముందిటండీ! వీ ళ్ళిట్లా గోడవనిబడి కొట్టుకోడమే కాని లంగోటీ కట్టుకొని,
గోదాలో దిగి, వొక్క గంట కసరతుచేసి, స్నానంచేసి, కడుపుకు గంజినీళ్లైనా
సరే తాగి, బయటికి వచ్చినవాడి మొఖాన్నివుండే కళా, వాడికి వుండే ఆనం
దం లక్షాధికారికైన వుంటుందిటండీ? (వినండి, వినండి, అని చప్పట్లుకొట్టుచు
న్నారు.) కనక వీళ్ళందరూ కాళ్ళూచేతులూలేనివాళ్లై పాడైపోక, కష్టపడి,
ముందు మనుషుల్లాగ నిలబట్టానికి దోవ చేసుకుంటూ తరవాత యేవిద్య చదువు
కున్నా మంచి దని నాయభిప్రాయము. నేను ఉన్నదున్నట్లు మాట్లాడ్తాను.
వీళ్ళందరూ కసరతు మానేశాగని నాకుండే మంటచాతకూడా మాట్లాడినాను.
నా తప్పు లన్నీ క్షమించండి. యింతే మనవి.

సభ్య—(చప్పట్లు మిక్కిలిగఁ గొట్టుచున్నారు.)

నిర—అగ్రాసనాధిపా, ఆర్యులారా, మిత్రులారా!

నేను కొన్ని సంగతులు మాట్లాడవలె నని చూచుచున్నాఁడ. కాని నేను
తెనుఁగులో చాలా బ్యాక్వర్డు స్టూడెంటు (backward student.) తెలుఁ
గులో మాట్లాడడం నాకు బాగా ప్రాక్టిస్ (practice) లేదు. దానికి
మాత్రం మీరు ఏక్స్కూజ్ (excuse) చేయవలెను.

నా ఫ్రెండు (friend) భీమరాజుగారు జంనాస్టిక్సును గూర్చి చాలా (too much) గా జెప్పినారు. నేను వారితో కంకర్ (concur) కాజా లనందుకు చింతిల్లుచున్నాను. దేహపరిశ్రమకొఱకు ఎక్సర్‌సైజెస్ (excercises) చాలాయున్నవి. కాని వానిలో జింనాస్టిక్సు చాలా డేంజరస్ (dangerous) గా నుంటున్నది. మొన్ననే యొకడు పంజాబీపైల్వానితో టెన్ మినిట్సు (ten minutes) కుస్తీ పోట్లాడి కాలు విరగఁగొట్టుకొనినాడు. మా స్నేహితుఁడు అవ్యక్తావధాని మొన్న ఆదివారమునా డెవరును లేనపుడు ప్యారలల్ బార్సు (parallel bars) మీఁద నేమో చేయఁబోయి చేయి విరగఁగొట్టుకొనినాఁడు. ఇంటికివచ్చుటకును నాతని తిప్ప లెవరికిని దెలియనే తెలియవు. కాఁబట్టి జంనాస్టిక్సును నమ్మగూడదు. ఎక్సర్‌సైజ్ కావలసియుంటే మఱియొక గేమ్ (game) ఏదైనను ఆడవచ్చును. మా పిల్లవాఁడు జింనాస్టిక్సు చేసినప్పటినుండి సన్నగిలి మఱింత వీక్ (weak) కూడా అయినాడు. కాఁబట్టి జింనాస్టిక్సుకంటె నేదైన నొక గేం (game) ఆడుట మంచి దని నా యభిప్రాయము.

మిత— అగ్రాసనాధిపా, విద్యాధికులారా, విద్యార్థులారా, మానవజన్మంబెత్తిన ప్రతివానికిని వ్యాయామము మహావశ్యకము. దేహముతో సంబంధముండునంత వఱకును దేహస్వాస్థ్యమునిచ్చు వ్యాయామ మావశ్యకమే. వ్యాయామ మనఁగా దేహబలసాధకములుమాత్రమే కాని యిచట వినోదసాధకములు కావు. దీని యావశ్యకమునకుఁ గల కారణములను నా మిత్రులగు వేంకటపతి సోమనాథ శర్మ, భీమరాజు గార్లు తృప్తిగఁ దెలవిచ్చియేయున్నారు. నేను మరలఁ జెప్పఁ బూనుచోఁ బునరుక్తియే యగును. కాని డంబాచారి, తీవ్రబుద్ధి, నిరభిమాని గార్లు సూచించిన కొన్ని శంకలకు సమాధానమును మాత్రము మనవిచేయుదును. కూలిచేయువారికిని, బస్తాలుమోయువారికిని వ్యాయామసాధకము లక్కఱయే యుండవు. వారు చేయు కూలి యంతయు శరీరకష్టమే. వారు వినోద సాధకభాగమును జేయఁదగియుందురు. ఒడలు కదలకుండ దినమంతయుఁ గుర్చీలోఁ గూర్చుండువారికే యిది మహావశ్యకము. ఎద్దులు గుఱ్ఱములు లోనగు జంతువు లొనర్చున దంతయుఁ గాయకష్టమే. వానికి మనః పరిశ్రమము లేదు. కావున వ్యాయామము సెలుఁగకపోవుటచే వానికి మిక్కిలి లోపము కలుగదు.

చేయునెడ వానికిని బలారోగ్యాభివృద్ధులు కలుగకపోవుట లేదు. సర్కసులోని జంతువులే దృష్టాంతము. సహజశక్తులకు వికసనావకాశములఁ గలిగించుట నూతనసృష్టి కానేరదు. ప్రయత్నించునెడ వికసింపక పోవుట లేదు. విద్యాధికుని బుద్ధియు, జెట్టియొక్క దేహబలమును నిందుకు దృష్టాంతములు. ఎవరితోనో పోట్లాడి కాలిని విఱుగఁగొట్టుకొనుటయు ఎవరును లేనితఱిఁ బోయి కట్టెలమీఁది కెక్కి పడి చేతిని విఱుగఁగొట్టుకొనుటయు వ్యాయామమును వలదనుటకుఁ గారణములు కాఁజాలవు. వ్యాయామము చేసినప్పటినుండియు విద్యార్థి సన్నగిలి బలహీనుఁ డయ్యెననుటయందు సత్యము కలదు. కొందఱి విషయములో నిట్లు కలుగుచున్నది. దీనికిఁ గారణము లనేకములు కలవు. ఇటఁ దెల్పుట కలవికాదు. (బలకారి యను గ్రంథమునఁ దెలుపఁబడును.) పరిశ్రమచేయు ప్రదేశము, సమయము, సాధనములు, ఉపకరణములు, క్రమము లోనగు పెక్కువిషయములు దీనికిఁ గారణము లగుచున్నవి. ఉపాధ్యాయుఁ డనుభవజ్ఞుఁడుగ నుండునెడ నీ దోషము నివారణ మగును. ఈ నిరర్థకకారణములఁ బురస్కరించుకొని వ్యాయామమును మానుట యుక్తియుక్తము కాదు. వ్యాయామము ఆయురారోగ్యములఁ బెంచును. చదువుఁ జదువకయున్నయెడఁ బ్రాణము పోదు. వ్యాయామము నుపేక్షించునెడ నకాలమరణము కలుగును. కానిచో బలహీనులును వ్యాధిగ్రస్తులును నయి జీవచ్ఛవములవలెఁ బ్రతుకవలసి వచ్చును. కావునఁ బ్రతిమనుజుఁడును వ్యాయామమును జేసి మేలు వడయును గాక యని కోరుచు నా యుపన్యాసమును ముగించుచున్నాఁడను.

గీ॥ చదువు వీడిన మనుజుఁడు ♦ సమయఁ డట్టె
సాము వీడి యకాలపుఁ ♦ జావు నొందు;
కానిచో వ్యాధి కార్శ్యముల్ ♦ క్రమ్ముకొనఁగ
బ్రతికి యుండును జీవచ్ఛ ♦ వమును బోలి.

సభ్యులు—(మహానందముతోఁ జప్పటలు కొట్టుచున్నారు.)

అగ్రా—(కొంతసేపువఱకును బ్రసంగించుటకు విద్యార్థులు ముందుకు రాకయుండుటను జూచి) విద్యార్థు లెవరును ముందుకు వచ్చుట లేదేమి? కాలహరణమగుచున్నది. వెంటనే వచ్చి మీమీ శక్తికొలఁదిని మీమీ యభిప్రాయములఁ దెలుపుఁడు. (విద్యార్థు లింకను రాకుండుటను గాంచి) మీలో నింకఁ బ్రసంగింపఁగలవారే లేరా యేమి! కార్యదర్శియగు రామరావుగారైనను బ్రసంగింపఁజాలరా!

రామ.—(త్వరపడుచు లేచి సభాధ్యక్షుని చెంత నిలిచి) వందనీయుఁడవగు సగ్రాసనాధిపా! వంద్యులగు నార్యులారా! నూతనగ్రహణేచ్ఛాసమృద్ధులగు విద్యార్థులారా! సచ్చరిత్రులగు మిత్రులారా!

నే నింతదనుకఁ బ్రసంగింపకుండుటకుఁ గారణము తఱచుగాఁ బ్రసంగింపని నా మిత్రుల కవకాశమీయఁదలంచుటే కాని వేఱొండు కాదు. అగ్రాసనాధిపతిగారు నన్నుం బేర్కొనుటచే నిపుడు మ దభిప్రాయమును మనవి చేయుచున్నాఁడను. ఏవిషయముయొక్క ప్రాముఖ్యమును గూర్చియైనను జర్చించి సిద్ధాంత రాద్ధాంతముల నొనర్చుట కాధారములగు ప్రమాణము లెనిమిది:— 1 ప్రత్యక్షము, 2 అనుమానము, 3 ఉపమానము, 4 శాబ్దము; 5 అర్థాపత్తి, 6 అనుపలబ్ధి; 7 సంభవము, 8 ఐతిహ్యము. ఇందు మొదటి నాలును తార్కికులమతమునందును, ఆఱు వేదాంతులమతమునందును, ఎనిమిది పౌరాణికులమతమునందును గ్రమముగ నంగీకరింపఁబడినవి. వీనిలో శంకావకాశమే లేకయుండునట్లు, సర్వజనులకును సంపూర్ణతృప్తి నొసఁగునది మొట్టమొదటిదగు ప్రత్యక్షప్రమాణము. వ్యాయామప్రాముఖ్యమును సిద్ధాంతీకరించుట కట్టి ప్రత్యక్షప్రమాణములే వేయునన్ని కలవు. ఎట్లన:— 1 వ్యాయామము నుపేక్షించెడి కేవలవిద్యార్థికు లనారోగ్యవంతులుగను బలహీనశరీరులుగను మాఱుచున్నారు. 2 వ్యాయామము నెఱుఁగకయున్నను దేహపరిశ్రమమును గొంతవఱకుఁ గలిగించు శిల్పాదివృత్తులఁ జేయువా రారోగ్యమును, మితమైన దేహబలమును, గొంతవఱ కవయవచాకచక్యమును గలవా రగుచున్నారు. 3 వ్యాయామప్రథమభాగమును జేయువా రసామాన్యదేహబలమును, ఆరోగ్యావయవచాకచక్యములను గలవా రగుచున్నారు. వీరికి దృష్టాంతము జెట్టీలు. 4 వ్యాయామద్వితీయభాగమును జేయువార లసామాన్యావయవచాకచక్యమును గలవారును, ఆరోగ్యదేహబలవంతులును నగుచున్నారు. వీరికి దృష్టాంతము సర్కస్ చేయువారు. ఇట్టి దృష్టాంతము లెన్నియైనఁ గలవు. ఇవి ప్రత్యక్షములు. వీనియం దనుమానాదుల కవకాశము లేదు. వీనివలన నేమి తెలియుచున్నది? దేహపరిశ్రమము నెంతయెక్కువగఁ జేయుచుండిన నంతయెక్కువగ నారోగ్యదేహబలావయవచాకచక్యములు కలుగునని నూటిగఁ దెలియుచున్నది. ఈ మూఁడు శక్తులును దేహమున కావశ్యకములు. దేహముతోడి సంబంధము విడునంతదనుక వీని

యావశ్యకము విడదు. దేహప్రాముఖ్యమును నిరసించి, జ్ఞానస్వరూపుఁడగు పరమేశ్వరు ధ్యానించుటకు వలయు జ్ఞానాధిక్యమును మాత్రమే కోరెడి యోగులైనను దేహముయొక్క బలచాకచక్యముల నుపేక్షించి యారోగ్యముమాత్ర మావశ్యకమని గ్రహించి, తదర్థమై ఘటశోధనాదివిధులఁ జేకొనియున్నారు. దేహమును విడిచి జ్ఞానము వసించుటలేదు. అట్టి దేహమున కారోగ్య మొక్కటి లేనిచో ఆదేహికి ప్రపంచము నరకమే యగును.

ఆరోగ్యము.

ఉ. భాగ్యము లెస్స కల్గినను, బందుగు లెందఱు తన్నుఁ గొల్చినన్,
భోగ్యము లెన్ని యుండినఁ బ్రభుత్వముఁ దాల్చినఁ గాని యొక్క యా
రోగ్యము లేనిచో. సుఖవిరోధము నొందుచు, జీవితేచ్ఛయే
మృగ్యము కాఁగ, మానవుఁడు మృత్యుముఖాంతరవాసి యయ్యెడున్.

కావునఁ బై శక్తిత్రయములో నారోగ్యము మహాముఖ్యము. బలచాకచక్యములను యోగులు వదలుకొనిరి. వారిని సర్వదా సర్వథా రక్షించుచుండుట కప్పటి దేశాధిపతులు వారికి దాసానుదాసులై పడియున్నారు. విశ్వామిత్రుఁడు కోరినపుడు దశరథునంతటివాఁడు తన ముద్దుకొమరులైన రామలక్ష్మణులఁ బంపక తీరినదికాదు. మన మట్లు నిరసించునెడ మనలఁ గాపాడువారెవరు? బలచాకచక్యముల నుపేక్షించి మన మారోగ్యమును గాపాడుకొనుట యెట్లు? మనమును ఘటశోధనఁ జేయఁజాలుదుమా? కావున నారోగ్యబలచాకచక్యములు మూఁడును మన కావశ్యకము లయియుండినవి.

ఇట్టి శక్తిత్రయముతోఁ జేరునపుడే మన జ్ఞానము ప్రకాశించును. వీని నెడఁబాసెడి జ్ఞానము దేహమనెడి రథమునకు గుఱ్ఱములులేని సారథి యగును. మన దేశమం దిపుడు జ్ఞానబలము విద్యాధికులందును దేహబలము తదితరులందున్న గనవచ్చుచున్నవి. ఇట్లు కాలకర్మవశమున వేఱుపడిన యీ రెంటికి నన్యోన్య సమావేశముఁ గలిగించుట మహావశ్యకము. అందుకు మార్గము విద్యార్థులు వ్యాయామము నభ్యసించుటే. కావున నీదేశమందలి విద్యార్థులెల్లరును వ్యాయామ ప్రాముఖ్యమును గ్రహించి దాని నభ్యసించి దేశమునకు మేలొనఁగూర్తురుగాక యని కోరుచు నాయుపన్యాసమును ముగించుచున్నాఁడను.

సభ్యు—(కరతాళములను సంతోషముతో వేయుచున్నారు.)

అగ్రా—కాలాతీత మగుచున్నది. ఇంకఁ బ్రసంగింపఁదలఁచిన విద్యార్థులు వెంటనే

టనే వచ్చి యుపన్యసింపుఁడు. (కొంతసేపు వఱకు నెవరును రాలేదు.)

రాము—(అగ్రాసనాధిపతిగారి చెవిలో రహస్యముగా) అయ్యా యీ విద్యార్థులలో నిఁక నెవరును సాధారణముగఁ బ్రసంగింపరు. వారికై కాచుకొనియుండుట యనావశ్యకము. ఇతరులగు పెద్దమనుష్యులు కొందఱిచటఁ గలరు. వారే మైనఁ బ్రసంగింతురేమో తెలిసికొనుఁడు.

అగ్రా—ఇంక సామాజికు లెవరును బ్రసంగించునట్లగపడుటలేదు. ఇచటఁగల సాంఘికేతరులగు విద్యాధికు లేమైన వచింపఁ దలఁచునెడ సెలవీయవలయు నని ప్రార్థించుచున్నాఁడ. (అని పలుక వారిలో నొకరగు గోపాలరావుగారు లేచి)

గోపా—ఈ వ్యాయామవిద్యాప్రాముఖ్యమును గూర్చి యెందఱు చెప్పినను నెంతగఁ జెప్పినను జెప్పఁదగియున్నది. కాని కాలాతీతమయినది. దీనిఁ గూర్చి చెప్పుటకు సర్వవిధములచేతను సమర్థులగువా రగ్రాసనాధిపతిగారు. కావున మా అందఱివంతును గూడ వారికే వదలుచున్నాము. అయిన నొక్క సంగతిని మాత్రము మనవిచేయుచున్నాఁడను. మా బాల్యమందు మేము వ్యాయామమును పేక్షించి యిపుడు దాని నష్టము ననుభవించుచుఁ బశ్చాత్తాపపడుచున్నాము. ముప్పదియేండ్లకే ముసలితనము ప్రారంభమగుచున్నది. వ్యాయామాభ్యాసముగల మామిత్రులు డెబ్బదియేండ్లవయస్సునఁ గూడఁ బరుగులెత్తఁ గలుగుచున్నారు. నలుబదిమైళ్ళదూరము నెక్కుపట్టున నాల్గు గంటలలో గుఱ్ఱపుసవారి చేయఁగలుగుచున్నారు. కావున విద్యార్థులు బాల్యమున వ్యాయామము నేమఱక యుందురుగాక యని కోరుచున్నాఁడను.

సభ్యులు—(కరతాళములచేఁ దమ యానందమును దెలుపుచున్నారు)

అగ్రా—సాంఘికులును సాంఘికేతరులును గూడ వారివారి యభిప్రాయములఁ దెల్పుట పూర్తియైనది. ప్రారంభోపన్యాసకులగు వేంకటపతిగారు స్వపక్షమును సమర్థించుకొనుట కేమైనఁ జెప్పవలసియున్నయెడఁ జెప్పుదురుగాక యని కోరుచున్నాఁడను.

వేంక—అగ్రాసనాధిపా! ఆర్యులారా! విద్యార్థులారా! మిత్రులారా!

తొలుత నేఁ జదివిన యుపన్యాసమందలి కొన్ని విషయములను నా మిత్రులు కొందఱు పూర్వపక్షమొనర్చినను వానికి సమాధానములను మఱికొందఱు చెప్పి నా యభిప్రాయములను సిద్ధాంతపఱిచియున్నారు. కావున వానిని సమర్థించుకొనుటకు నేను మనవిచేయవలసిన దేమియు లేదు.

మఱొక్క మనవి కలదు. వ్యాయామాపేక్ష దేహికి సహజము. అట్టి యపేక్ష విపరీతనాగరకతాద్యాచారములచేఁ గొంత సమయింపఁ బడుచున్నది. మిగిలినది వ్యాయామదినములలో వీరి లొనరించు దోషములచేఁ గలిగెడి, యవాంతరప్రతిబంధకములచే రూపుమాపి వేయఁబడుచున్నది. ఆ దోషములలోఁ గొన్నిటిని మనవిచేయుదును, చిత్తగింపుఁడు. కొందఱు మిక్కిలి త్వరగా బలశాలులు కాఁగోరి యెక్కువబరువుగల ముద్గరాద్యుపకరణముల నుపయోగింతురు ఎక్కువకఠినములగు సాధకములఁ జేయుదురు. దీనిచేఁ గొన్ని నరములు తొలఁగును; కీళ్లలో నొప్పులు కలుగును; కండరములు సన్నగిలును. 2 బలసంపాదనమునకుఁ బ్రత్యేకాహార మావశ్యకమని భ్రమఁజెంది యసామాన్యమధురాహారాదుల మిక్కిలిగ భుజింతురు. అజీర్ణవ్యాధి కలుగుటయే దీని పర్యవసాన మగును. ఆ వ్యాధి కుదురుటకుఁ గొన్ని మాసములు పట్టును. 3 వ్యాయామసమయమున నెక్కువగాలిని పీల్తురు కావున నది పరిశుద్ధవాయువుగ నుండవలయునని చెప్పుటచే బోసుగాలియందును, చలిగాలియందును, వడగాలియందును సాముచేయుదురు. కానిచో గాలిచొరని చీఁకటిగదియందు గరిడిచేయుదురు. వీనిచేఁ గలుగు దోషములు జ్వరము, తాపము, వాంతులు లోనగున వెన్నియో కలవు. 4 మఱికొందఱు గరిడీచేయు సమయములో మధ్యమధ్యను నీళ్లుత్రాగుట, సాముచేసిన వెంటనే గాలిలో నొడలి రుద్దుకొనుచుఁ గొంతసేపు స్నానము చేయుట, గరిడి చేసినవెంటనే భోజనముచేసి కుర్చీలోఁ గూర్చుండుట లోనగు దోషముల నెన్నిటినో చేయుదురు. వీనివలన ప్రేగు లుబ్బుట, కీళ్లవాతము, గర్భశూల మొదలగు వ్యాధులు కలుగును—ఈదోషములచేత నేవ్యాధి కలిగినను వ్యాయామముచేతనే కలిగినదని వ్యాయామమును మొదలంట మానివేయుదురు. పలువురు వ్యాయామమును మానుట కిదియే ముఖ్యకారణము. ఇట్టి యవరోధకుడ్యములఁ దొలగించుకొని విద్యార్థులు వ్యాయామప్రయోజనమును బడయుదురుగాక యని కోరుచు నా సమాధానము నింతటితో ముగించుచున్నాఁడను.

సభ్యులు—(కరతాళధ్వనులఁ జేయుచున్నారు.)

అగ్రా—ఆర్యులారా! విద్యార్థులారా!

తమ రెల్లరు నేఁటిదినంబున నన్నీ సభకుఁ బెద్దగఁజేసి నావలన నేమో వినఁగోరినందుకు నేను తమ కుతూహలము నెట్లు తీర్పఁజాలుదునో యెఱుఁగ

ఘున్నాఁడను. మఱియుఁ నేఁటి వ్యాయామచర్చయందు నా తీర్పును మనవి చేయుటకు బూర్వ మీసామాజికుల గుణదోషములను గూర్చి యొకింత మనవిచేయవలసియున్నది. ఇందుఁ గొందఱయభ్యాసములకును నభిప్రాయములకును నా వచనంబులు ప్రతికూలములుగ నుండవచ్చును. దానికి మన్నింతురుగాక యని వేఁడుచున్నాఁడను.

రామ—(దిగ్గనలేచి) అయ్యా యీ వేఁడుట యనావశ్యకము. మా దోషములఁ జూపునపుడు మేము లేఁపయెడఁ గృతజ్ఞులమై యుండెదము. దోషనివారణ మేవిద్యయందుఁ గాని యభివృద్ధికిఁ బ్రథమసోపానము. అభివృద్ధి ప్రయత్నము లనంతర కరణీయములు. కావున మాదోషములఁ జూపుట మమ్ముఁ గృతార్థులఁజేయుటే యగును గావున సెలవీయఁ బ్రార్థించుచున్నాఁడను.

అగ్రా—ఈ కార్యదర్శిగారి మాటలవలన 'దోషనిరూపణము దూష్యముకాదు' అను సూత్రము ని సామాజికు లెఱింగియున్నట్లు కన్పట్టుచున్నది. దీనికి సంతసింపఁ దగియున్నది. వీరిని గూర్చి నేను మనవిచేయఁదలఁచిన విషయములను వరుసగా సంగ్రహముగా విన్నవింతును. సావధానచిత్తులరగుచు నాలకింతురుగాక.

1. ఈ సంఘమందుఁ గల సాంఘికుల సంఖ్య 45. అందు నేఁడు సభకు హాజరయినవా రిరువది యిద్దఱు. సగముకంటెఁ దక్కువమందియే వచ్చిరి. ఇది తృప్తిగ లేదు.

2. వచ్చినవారిలోఁ బ్రసంగించినవారు తొమ్మండ్రు. ప్రసంగింపనివారు పదముగ్గురు. ఇదియుఁ దృప్తిగ లేదు. (వినండి. వినండి.) విద్యార్థులకుఁ బ్రసంగ కౌశలమును గలిగించుటే యీ సంఘముయొక్క ముఖ్యోద్దేశము. ఎవరు ప్రసంగించుచుందురో వారికే తత్కౌశలము కలుగుచుండును. కావునఁ బ్రతి విద్యార్థియుఁ బ్రసంగింపఁ బ్రయత్నించుచుండవలయు.

3. ప్రథమోపన్యాసకుని యభిప్రాయములన్నియు సమంజసము లైయున్నవి. కాని వారొక్క దోష మొనర్చిరి. వారు తొలుదొల్త వాక్రుచ్చిన దానిని సమర్థించుకొనుటకు ద్వితీయావకాశ మీయఁబడినప్పుడు దానికి బదులు విద్యార్థి దోషజనితములగు వ్యాధులఁ బేర్కొనిరి. ఇవి యపూర్వములగుటచే వీని యాథార్థ్యమును విమర్శించు నవకాశము తదితరవక్తలకుఁ గలుగలేదు. కావున నిది సరికాదు. వచించు విషయము మాత్రము సమంజసముగ నుండుటచేత నేను వెంటనే వారింపనైతిని.

4. ద్వితీయోపన్యాసకునిగూర్చి నేనువచింపఁదగినదేమియు లేదు. తృతీయోపన్యాసకు లగు డంబాచారిగారినిగూర్చి యించుక మనవిచేయవలసియున్నాఁడ 1 వీరి వాక్కులందే స్వప్రయోజకత్వప్రకటనాపేక్ష కనవచ్చినది. ఇది హస్తాభరణములఁ జూపుటకుఁ బలుమారు కరము లెత్తి ప్రసంగించుటవలెనే యుండును. 2 యనుకమునకై ప్రయత్నించుటయందు వ్యర్థపదములును దొరలినవి. యనుక మయినను స్వభావము (Nature) ననుసరించునప్పుడే యొప్పిద మగును. ఈ రెండుదోషములను వీరు సవరించుకొందురుగాక,

5. చతుర్థోపన్యాసకులగు తీవ్రబుద్ధిగారి భాషాకౌశలమును వక్తృత్వసామర్థ్యమును గొనియాడఁదగినవే. కాని వీరి యుపన్యాసమందు దీర్ఘసమాసములును దీర్ఘవాక్యములును, అతిత్వరయుఁ గన్పట్టుచున్నవి. ఉపన్యాసప్రయోజనము ప్రజాహృదయమందు నూతనాభిప్రాయముల నాటుటే. దీనికిఁ బైమూఁడు యోగ్యతలును బ్రతిబంధకము లగుచుండును. కావున వానిని మార్చుకొనుట యుచిత మని మనవిచేయుచున్నాఁడ.

6. పంచమోపన్యాసకులగు చపలమూర్తిగారు వివాదవిషయమునే విడిచి ప్రసంగింపఁ జొచ్చిరి. దీనివిడిచి మఱియొకదానినైనఁ జెప్పిరా? అదియు లేదు. ఒకవాక్యమును బలికి, దానినుండి యేదోయొక పదముం జేకొని, యాపదముం గూర్చి యనంతరవాక్యమును బలుకఁజొచ్చిరి. తాను గొన్ని యభిప్రాయములఁ గలిగి వాని నితరులకుఁ దెలుపఁబూనుట యనెడి యుపన్యాసకలక్షణము వీరియందు లేదు. కావున దానికై చపలమూర్తిగారు యత్నింతురుగాక.

7. పిమ్మట భీమరాజుగారి ప్రసంగము వ్యాయామప్రయోజనమును మిక్కిలిగ వెల్లడించుచున్నది. కాని విద్యాభిమానపరవశులగుచు నించుక కఠినముగఁ బ్రసంగించిరి. ఇది క్షంతవ్య మని నే నభిప్రాయపడుచున్నాఁడను.

కాని వీరు నియమరహితమైన గ్రామ్యభాష నుపయోగించిరి. ఇది యసభ్యము గర్హ్యము. లోకమున నియమరహితమైన కార్య మేదియు గణనీయము కానేరదు. ఈ భాష నియమసహిత మగువఱకును వీరు దీనిని సభలందుఁ బ్రయోగింపకుందురుగాక.

8. సప్తమోపన్యాసకు లగు నిరభిమానిగా రాంగ్లేయభాషాపదముల మిక్కిలిగఁ జేర్చుచుఁ బ్రసంగించిరి. దీనిచేత నాంధ్రభాషాకౌశల మెన్నటికిని గలుగదు; ఆంగ్లేయభాషయు నిల్లేయుండును. ఉభయభ్రష్టత్వము కలుగును.

సంకరభాషయే ప్రాప్తమగును. కావున నీ యేకభాషాప్రసంగ మభ్యసింత్రుగాక.

9. అష్టమోపన్యాసకు లగు మిత్రభాషిగారి ప్రసంగము సర్వవిధముల గణనీయమైయున్నది. తదితరులయందలి దోషములలో నొక్కటియు నిందు లేదు. అభిప్రాయములు సహేతుకముగఁ జెప్పఁబడినవి. బహుసంశయములకు సమాధానము లీయఁబడినవి, ఈ సామాజికు లెల్లరును వీరి ప్రసంగపద్ధతుల నవలంబింపఁదగు నని సంతోషముతో సలహా యిచ్చుచున్నాఁడను.

10. నవమోపన్యాసకులగు కార్యదర్శిగారు చక్కఁగఁ బ్రసంగించిరి.

మొత్తముమీఁద నీ విద్యార్థుల సమర్థత శ్లాఘనీయమై యున్నది. విషయమును విపులముగ విమర్శించిరి. వివాదాంశములలో నొక్కటినైన ఖండింపక విడువరైరి. ఇంతమంది చర్చించిన విషయమునందు నేను నూతనముగ వచింపఁదగిన దేమియుఁ గన్పట్టుట లేదు. ఏమి చెప్పినను బునరుక్తమగున ట్లున్నది. అయిన నొక్కింత ప్రయత్నింతును.

సుఖాపేక్ష సర్వజీవసామాన్య ధర్మము. మనుజునకుఁ దదితర జీవులకంటె జ్ఞాన మొక్కటి మాత్ర మధికముగ నుండుటచేత దానిచే నధికసుఖములఁ గల్పించుకొని యనుభవించును. ఆ సుఖము లైహికములు నాముష్మికములు నని రెండు విధములు. ఈ ద్వివిధసౌఖ్యములకును దేహమనఃపరిశ్రమములు రెండు నావశ్యకములు. ఈ ద్వివిధపరిశ్రమముల యావశ్యకమును గ్రహించుటచేతనే. హిందూమతాధిపతులు వీనికి వలయు విధుల నన్నిటిని మతములోనే చేర్చియున్నారు. ఉషఃకాలస్నానము, ప్రాణాయామము, సూర్యనమస్కారములు, జపకాలమందు వేయు వివిధాసనములు లోనగున వన్నియు దేహబలదములు. విద్యాభ్యాసము, సంధ్యాజపతపస్స్వాధ్యాయాదులు ను మనోబలదములు. వీనివలననే యాముష్మికఫలములును గలుగును. ఇట్లైహికాముష్మికసుఖముల జోడించి సాధించుటే మన మతధర్మము.

అట్టి మతధర్మములను కేవల విశ్వాసబుద్ధితో నాచరించుటే మన హిందూ మత ప్రముఖాభిప్రాయము. ఇంతదనుక నవి యట్లులే యాచరింపఁబడినవి. ఇపుడు పాశ్చాత్యసమావేశమువలనఁ బ్రజలం దట్టి మతవిశ్వాసము క్షీణించి హేతువాదాభ్యాసము ప్రబలినది. ప్రత్యక్షప్రమాణ మొక్కటిమాత్రమే వీరికి రుచించుచున్నది. శబ్దప్రమాణమునం దాదరము లేదనియే చెప్పవచ్చును. దీనిచే హిందూసంఘాచారము లుపేక్షింపఁబడినవి; పాశ్చాత్యాచారము లవలం

బింపఁ బడినవి. కాని యివి పూర్తిగ వదలలేదు; అవి పూర్తిగ లభింపలేదు. కావున వీరి కుభయభ్రష్టత్వము ప్రాప్తించుచున్నది. ప్రస్తుతవిషయమైన వ్యాయామమందు కొంతకిఁ గలిగిన యుభయభ్రష్టత్వమును జిజ్ఞాసింపుదుము. పాశ్చాత్యులు వారి విద్యను సంగీత సాహిత్య శిల్ప వ్యాయామము లను నాలుగు భాగములుగ నొనరించుకొనిరి. మనకు మన యాంధ్రపండి తాచారానుసరణముగ సాహిత్యము మాత్రమే ప్రధానమై నిల్చినది. దేహపరిశ్రమము నీయఁదగిన సంగీత శిల్ప వ్యాయామములు మూఁడును మనకు లేకయే పోయినవి. ఇందు సంగీతభాగమైన నృత్యమును వారు జాతీయ వినోదము (National game) గాఁ బెట్టుకొనిరి. నృత్యమందుఁ గలుగునంత దేహపరిశ్రమము కేవల వ్యాయామమందు ను గలుగదనియే చెప్పవచ్చును. ఇట్టి నృత్యము నెఱుఁగనివా రాంగ్లేయులలోఁ గనఁబట్టరు. మనవారికి సంగీతమే రాదు. నృత్య మెట్లువచ్చును? మన గానము గాయకులందే కలదు. గాని జనసామాన్యమందు లేదు. ఆ గాయకులందును నృత్య ముపేక్షింపఁబడినది. దీనిచే మన యార్యులకు నృత్యప్రాముఖ్యము తెలియ దని మాత్రము తలఁపఁజనదు. గానశాస్త్రమందలి యీ దిగువశ్లోకములఁ జిజ్ఞాసింపుదుము.

శ్లో. గీత వాద్య నృత్యానాం - త్రయం సంగీత ముచ్యతే.

శ్లో. అగ్నిహోత్రం యథా కార్యం - గానం కార్యం తథైవ హి
వేదోక్తత్వాత్ స్మృతిప్రోక్త - కర్తవ్యత్వా న్మనీషిణా.

శ్లో. దేవశ్చ మానవో గానం - వాద్యం నృత్య మతంద్రితః
కుర్యా ద్విష్ణోః ప్రసాదార్థ - మితి శాస్త్రప్రకీర్తితం.

నృత్యము సంగీతభాగ మనియు, నిత్యాగ్నిహోత్రవిధివలెనే నిత్యగానము ను విధిగా నొనర్పఁబడఁదగినదనియు, గానవాద్యనృత్యములు మఱిఁ కును పరమేశ్వరానుగ్రహసంపాదనార్థ ముపయోగింపఁబడఁదగినవనియుఁ బైశ్లోకములు తెలుపుచున్నవి. మన వారి కిదియు లేదు; అదియు లేదు. దీనిపేరే యుభయభ్రష్టత్వము. ప్రతిపాశ్చాత్యుని గృహమందును సాధారణముగా నొక యులి, బాడిస, బరమా, తిరుగుడుకొక్కు (screw turner) లోనగు నుపకరణములు రెండో మూఁడో యుండును. వారు వానితోఁ గొంతవఱకుఁ బని చేయఁజాలియుందురు. మనవారికి శిల్పములు నీచకార్యములు. కావున వీరి కరచరణంబులకుఁ గలమును బట్టుకొనుటకంటె మఱేమియుఁ జేతకాదు. వారు

వార్ధకమందును బంతులాడుదురు. గుఱ్ఱపుసవారి చేయుదురు; తుపాకి వేయుదురు; ఈఁదులాడుదురు; పడవలను తెడ్లతో నడపుదురు. ఇట్టి దేహపరిశ్రమానుకూలకార్యముల నెన్నిటినో చేయుదురు. మనవారి కివి యౌవనమందే గిట్టవు; వార్ధకమందుఁ జేయుదురా? ఇవి గౌరవార్హములు కావని యీ వీరిలోఁ గొందఱి యభిప్రాయము. కావున వీరికి హిందూమతాచారములవలనఁ గాని, పాశ్చాత్యసంఘాచారములవలనఁ గాని కలుగఁదగిన ఆరోగ్యదేహబలములు రెండును గలుగకపోయినవి. ఇట్టిస్థితినే యుభయభ్రష్టత్వ మని చెప్పవలసివచ్చినది.

ఈస్థితినుండి ప్రజల నుద్ధరించుటకుఁ గాలానుగుణమగు మార్గ మొక్కటియే. ప్రజాభిప్రాయములను దేశోద్ధారకచతుష్టసాహాయ్యంబున మార్చుట; ప్రజల బిడ్డలకు నూతనపద్ధతుల నలవఱుచుట. ఇంతకన్న మార్గాంతరము లేదు. దీనికిఁ బ్రారంభము పాఠశాలయందే జరుగవలయు. జాతీయసంస్కరణమునకు మూలస్థానము పాఠశాలయే. బాలుర విద్య సంగీత సాహిత్య శిల్ప వ్యాయామము లను నాల్గు సమభాగములుగ విభజించి నేర్పఁబడవలయు. ప్రారంభమం దించుక ప్రయత్నముతో నేర్పఁబడిన యీ నూతనపద్ధతు లచిరకాలములోనే యభ్యాసములుగ మాఱును. ప్రజలకు సంపూర్ణమానవధర్మము లభించును. దాన సర్వమును జక్కఁబడును. ఇది యుత్తమపద్ధతి. 2 విద్యాపద్ధతుల మార్చుట కవకాశము తోడనే లభింపదు. కొంతకాలము పట్టును. అంతవఱకును వ్యాయామమును బ్రత్యేక నిరతవిధిగాఁ గొని యొనరించుచుండు టవశ్యకర్తవ్యము. ఇది మధ్యమపద్ధతి. 3 ఇదియుఁ జేయఁజాలనియెడఁ బ్రతిమనుజుఁడును మితమైన వేగముతో దినదినము నొక్క పావుగంటసేపు పరుగెత్తుట కభ్యసింపవలయును. దీనివలనఁ బ్రయోజనము లనేకములు కలవు. ఇది వ్యాయామవిద్యలో నర్ధభాగ మని చెప్పవచ్చును. కొందఱు దీనివలన కాళ్ళకుమాత్రమే బలమువచ్చు నని తలఁతురు. అది పొరపాటు. దీనియందు సర్వావయవములకును బరిశ్రమ కలుగును. దీని కుపకరణము లక్కఱలేదు. గుఱువు నక్కఱలేదు. విశేషప్రయత్న మక్కఱలేదు. ప్రమాదభయము లేశము నక్కఱలేదు. ఇది సర్వమనుజులకును, సర్వమనుజేతరజీవులకును గూడ మహావశ్యసాధకము. కావున నింతమాత్రమైనఁ జేసి తృప్తిఁ జెందుట తృతీయపద్ధతి. ఈ త్రివిధపద్ధతుల నుపేక్షించునెడ

నెవరికిఁ గాని తద్దోషఫలము ననుభవింపక తీరదు. ఈ దోషమునకు శిక్షకులు వేఱుగ నుండరు. ఇందు శిక్షాదోషములకు అవినాభావసంబంధము కలదు. శిక్ష దోషము నాశ్రయించియే యుండును. కావున విద్యార్థులు వ్యాయామ విద్యాప్రాముఖ్యమును, త దాచరణ పద్ధతిత్రయమును గ్రహించి యిందుఁ దమ కనుకూల మగు పద్ధతిని దేశకాలపాత్రానుగుణముగ ననుసరించి దేహ మనోబల సంపాదనముచే సంపూర్ణమానవత్వము నొంది నిరంతరసుఖప్రాప్తిఁ గందు రని కోరుచు, నట్టి కర్తవ్యతాబుద్ధిని బ్రజలకును వారి బిడ్డలగు విద్యార్థులకును ననుగ్రహించును గాక యని పరమేశ్వరుఁ బ్రార్థించుచు నా యుపన్యాసమును ముగించుచున్నాఁడను.

దేహపరిశ్రమ.

సీ. అతివేగ బలశాలి ♦ నయ్యెదనంచును – శక్తికి మించిన ♦ సాము చేసి
తయ్యారి తినకున్నఁ ♦ దగుశక్తి రాదంచు – మితిమీఱి పలుమాఱు మెక్కి మెక్కి
వాతావరణశక్తి ♦ వాయుప్రచారంబుఁ – గనక యేమేమొ మా ♦ ర్గములఁ బట్టి
స్నానపానాదుల ♦ సమయంబు తెలియఁగక – యక్రమపద్ధతు ♦ లందు వడిచి

గీ. హాయిఁ గనలేక సాము మా ♦ కచ్చిరాదు
వలదు పొమ్మంద్రు నెచ్చి య ♦ వ్యక్తముగను;
తనదు స్థితిగతుల నరసి ♦ తగిన రీతి
నాచరించిన సౌఖ్యంబు ♦ నందఁ దగును.

సభ్యులు—(కరతాళధ్వనులఁ జేయుచున్నారు.)

రాము—మహాజనులారా! శ్రీ హనుమంతరావుపంతులుగారు మాప్రార్థన నంగీకరించి యీసభ కగ్రాసనాధిపత్యమును వహించి మా విద్యార్థుల ప్రసంగదోషములను భాషాదోషములను బ్రత్యేకప్రత్యేకముగ సవరించి, వ్యాయామప్రాముఖ్యమును సూచించి మాకు మే లొనరించుటయ గాక వ్యాయామోద్ధరణోత్సాహంబునఁ ద దాచరణపద్ధతులఁ గూడఁ దెలిపిరి. ఇట్టి దేశోపకారతత్పరులగు మహనీయులు మాకు లభియించుట మా భాగ్య మని తలంచుచు మా సంఘపక్షమున శ్రీ హనుమంతరావు పంతులుగారికిఁ గృతజ్ఞతాపూర్వకవందనశతంబు లర్పించుచున్నాఁడను.

సభ్యులు—(కరతాళధ్వనులఁ బ్రతిధ్వనించున ట్లొనర్చిరి. సభ ముగిసినది.)



## 20. వ్యాసలేఖనము.

ఏదైన నొక విషయమును గూర్చి విరివిగా వ్రాయుట వ్యాసలేఖనము అనఁబడుచున్నది. భావప్రకటనార్థము మానవజాతికిఁ బరమేశ్వరునిచేత నొసఁగఁబడిన మార్గత్రయమం దిది రెండవది. మొదటి దగు వాగ్రూపమార్గము సర్వజనులకును సహజముగనే లభించుచున్నది. దానియం దధికప్రజ్ఞను సంపాదించి దేశము నుద్ధరించువార లుపన్యాసకులును, హరికథకులును. ఈ ద్వితీయమార్గమున దేశము నుద్ధరించువారు కవులును, పత్రికాధిపతులును. తృతీయమార్గమున దేశోపకార మొనర్చువారు చిత్రలేఖకులు. వీర లీ త్రివిధమార్గములలో నొక్కొక్క దానియం దధికప్రజ్ఞావంతులగుచు దేశోద్ధరణ మొనరించుచుండినను ఈ మార్గత్రయమందును ప్రతిమానవునకును ప్రజ్ఞ కొద్దిగనో గొప్పగనో యుండుట యావశ్యక మని చెప్పకతీరదు. ఈ మార్గత్రయప్రాముఖ్యము వీని క్రమము ననుసరించియుండును. తృతీయమార్గము నెఱుఁగకయున్నచో భావప్రకటనకార్యం బసంపూర్ణమై యసమర్థమై యుండును. పీతయన నెట్లుండునో యెఱుఁగనివారికి అడ్డముగనుంపఁబడిన కోడిగ్రుడ్డువలె నొక సున్నను వ్రాసి, దాని రెండుకొనలయందును మూఁడేసి కాళ్లను మధ్యగా నొక ప్రక్కను రెండు కన్నులను వ్రాసి చూపునపుడు తెలియునంత తృప్తిఁ గొదవ మార్గద్వయముచేతను దెలియనేరదు. ద్వితీయమార్గము నెఱుఁగనియెడ నిశానీదారులుగ నుండి నిరక్షరకుక్షు లనఁబడుదురు. మొదటిదగు వాగ్రూపమార్గము నెఱుఁగకున్నచో వారియందు మనుజలక్షణమే కొఱవడును. కానిచో వారు మూఁగవారైన నైయుందురు. తన కార్యములఁ దాను సమర్థముగ నెఱవేర్చుకొనఁదలఁచు ప్రతిమనుజుఁడును స్వాభిప్రాయప్రకటనార్థ మీ మార్గత్రయమందును గొంతకొంత ప్రజ్ఞను సంపాదించుట యావశ్యకము.

చదువరుల కిట నొక సంశయము కలుగఁదగియున్నది. అదేదియన భావప్రకటనప్రథమసాధన మగు వాగ్రూపమార్గము సర్వజనులకును సహజమగు చుండఁగా దానియందును సంపాదితప్రజ్ఞ యుండునా యని. తప్పక యుండును. మనుజుఁడు ద్విస్వభావుఁడు. ఈస్వభావద్వయమున మొదటిది సహజము; రెండవది సంపాదితము. ఈ సంపాదిత మభ్యాసవశంబున లభించును. అభ్యాసములే కొంతకాలమునకు స్వభావముగా మాఱును. ఎట్లనఁగాఁ బొగచుట్టఁ గాల్చినయాతని నోటి దుర్వాసన చెంతనుండువారి కందఱకును బాధకరముగ నుండఁగా నాతఁ డా బాధను సుంతయుఁ బొందుట లేదు. మద్యపానమత్తుని బుద్ధిహీనస్థితి యెల్లరకు

నసహ్యకరముగ నుండఁగా నాతఁడు దాని కానందించుచున్నాఁడు. సర్వజంతు విశ్రాంతినిమిత్తము పరమేశ్వరుఁ డొసంగిన చల్లని రాత్రికాలమును బనిపాటల కుపయోగించుచు వెచ్చని పగటికాలమును. గొందఱు విశ్రాంతికొఱ కుపయోగించు కొనుచున్నారు. అట్టి స్వభావవిరుద్ధకార్యములు వారి కేల బాధకరములుగ నుండలేదు? అభ్యాసవశమున నవి వారియెడ స్వభావములుగా మాఱుటచేత నే. ఈధర్మమే విషక్రిమిన్యాయ మని చెప్పఁబడుచున్నది. ఇట్లు ద్విస్వభావుఁడైన మనుజుఁ డభ్యాస కారణంబునఁ గొన్నికార్యముల కలవడుచున్నాఁడు; దానిచే సహజశక్తులఁ గొన్నిటి నభివృద్ధిచేసికొనుచున్నాఁడు. మఱికొన్నిటిఁ గోల్పోవుచున్నాఁడు. ఇదేవిధముగా వక్తృత్వలేఖనకార్యముల రెండింటి నెఱిఁగిన పండితులలోనే కొందఱు తాము లేఖనమూలమున బోధించు ధర్మముల నుపన్యసింపఁజాలకయు, మఱికొందఱు తా ముపన్యసించు ధర్మముల లిఖియింపఁజాలకయు నున్నారు. ఈ యసమర్థతలకుఁ గారణము లభ్యాసములే. ఎట్లనఁ గొందఱు విద్యార్థులు బాల్యమునుండియుఁ దమ పాఠములను స్ఫుటముగఁ జదువక లోలోనఁ గొణఁగుచునో, లేక నోరిని గట్టిగ మూసికొని కనులతోనో చదివి యావిషయముల మనస్సునఁ బట్టించుకొని విద్యావంతు లగుదురు. దానిచేత వారి పెదవులు, నాలుక, దౌడలు, కంఠము, ఊపిరితిత్తులు లోనగున వన్నియు వానివానికి సహజములగు నుచ్చారణశక్తులను నానాఁటఁ గోల్పోవును. దానిచేత నట్టి పండితు లొకానొకప్పు డుత్సాహకారణంబున నేదేని విషయమును సభాముఖంబున నుపన్యసింప నుద్యుక్తులగుచోఁ బెదవులు వడఁకును; నాలుక తడఁబడును; దౌడలు నొప్పిపట్టును; కంఠధ్వని కీఁచుపోవును; ఊపిరితిత్తులు శుష్కించియుండుటంజేసి చాలివచ్చును. వీనిని సవరించుకొనఁ బ్రయత్నించునంతలోఁ జెప్పఁదలఁచిన యభిప్రాయములు జ్ఞప్తినుండి తొలఁగును. ఏమో చెప్పఁబోయి మఱియేమో చెప్పుదురు. తుదకు 'టెంకాయ పిచ్చికొండ' యనునట్లు లర్థవిహీనముగఁ బ్రసంగింతురు. ఇట్లొకటిరెండు పర్యాయము లనుభవమునకు రాఁగానే తమ యసమర్థతం దెలిసికొని తమ కుపన్యాససామర్థ్యము లేదని యనంతరము వారే చెప్పుకొనుచుందురు. దీనికిఁ గారణము బాల్యమునుండియు వీరు స్ఫుటోచ్చారణము నుపేక్షించి గొణఁగుచుఁ జదువుట కభ్యాసపడుటయే.

### ఉచ్చారణశక్తి

చ. పెదవిఁ గదల్చకే విడిచి • పిన్నటినుండియు నేత్రదృష్టిచేఁ
జదివి గ్రహించుఁగాక; స్వర • శక్తిని గోల్పడి పండితుండమం

బడబడి యాత్మభావము ప • భక్తి వచియింపఁగఁబోవుచో బళీ
పెదవిఁ గదల్చునంతటనె • పెప్పెపె మెమ్మెమె కాకయుండునే?

ఇఁక నుపన్యాసకు లగువారు కొందఱు తమ యభిప్రాయములను లేఖన మూలమునఁ దెలుపఁ జాలకయుండుటకుఁ గారణములఁ జిత్తగింపుఁడు. వీరిలోఁ బలువురియందు గ్రాంథిక భాషాపరిచయలోపదోషము మిక్కుటముగ నుండును. ఉపన్యసించునప్పుడు గ్రామ్యభాషను ధారాళముగ నుపయోగింతురు. దానినే వ్రాయఁదలఁచి కాగితముపైని కలము పెట్టుటతోడనే అంతయు సంశయమే. అతఁడువచ్చి యనుటకు ఆఁడొచ్చి, అతడు వొచ్చి, అత ద్వచ్చి యనెడి యాభాసరూపములు చేతుల క్రిందను వచ్చును. వీనిలో నేరూపమును వ్రాయఁదగునో తెలిసికొనుటకు వీరికి భాషాపరిచయము చాలదు. దీని కొఱకుఁ గ్రిందు మీఁదులు చూచునప్పటికి హృదయములోని కల్పన యంతరించిపోవును. ఈ లోపమును గప్పిపుచ్చుటకుఁ గొందఱు గ్రామ్యభాష శరణ మగు ననుకొనుచున్నారు. ఇది గొప్ప పొరపాటు. ముంటి నూడఁబెఱికి కొఱ్ఱును దిగవేసికొనునట్లేయగును. ఆ గ్రామ్యభాషకే యించుక యవకాశము చిక్కెడ శీఘ్రకాలములో నిట్టి పద్యములు వెలువడును.

గ్రామ్యము.

క. నే చెప్పే మాటిన్రా
మీ చిన్నాడు చెట్టు • మీఁదికి యెక్కీ
కాచినన్ని చింతాక్యాయలు
కోచీ దిగలాక మీదె • కూసున్నాడ్రా.

సంవాదము.

1. మాట + వినరా = మాటిన్రా యెట్లయినది? గ్రామ్యముచేత.

2. ఎక్కి యనుటకు ఎక్కీ యను దీర్ఘమెట్లు వచ్చినది? గ్రామ్యముచేత.

3. కాచినన్ని అనగా నర్థమేమి? కాసిని అనగా కొంచెము. దాని రూపాంతరమే కాచిని. అన్ని యనునది గడ్డి గాదర, పుల్ల పుడక అనుచోట్ల గాదర పుడక అను శబ్దములవలెనే యొక ఉపపదము. తట్టెడన్ని బుట్టెడన్ని యుదాహరణములు. మొత్తమున 'కాచినన్ని' అను మాటల కర్థము కొంచెము. దీని కాధారమేమి? గ్రామ్యమే.

4. చింతాక్యాయలు అనియు రూపము కలదా? గ్రామ్యమందు కలదు.

5. కోచీ అనఁగా నర్థమేమి? కోసి దీనికి దీర్ఘమెందుకు వచ్చెను? ఛందస్సు కొఱకు. అట్లు వచ్చుట కాధారమేమి? గ్రామ్యము. గ్రామ్యముచేత శబ్దములు రబ్బరు

వలె వలయమంత పొడుగు సాగుచుండునా యేమి! అవును. రబ్బరువలెను జలగల వలెను సాగుటయేకాక తాఁబేటి చరణంబులవలె సంకుచితములగును; ముడుఁగుపడును. బీరకాయప్పీఁచువలె నొండొంటిం బెనఁగొని యభేదముగ నల్లుకొని పోవును. పొగవలె నొకప్పుడు తునకలు తునకలుగా నగును; మరలఁ జేరి యేకీభవించును. ఇంతయేల? మా గ్రామ్యంబున కవాచ్యప్రజ్ఞ లన్నియుఁ గలవు. ఓహో! అలాగా.

6. కూపమన్నాద్రా అను రూపమెట్లు సిద్ధించెను? మా కీలాటి శంకలన్నీ పనికి రావు. మా కెట్లాపడితే నట్లాగే సిద్ధించును. మాది గ్రామ్యమన్ని చెప్పుచుండలేదా?

చదువరులారా! చిత్తగింపుఁడు. ఈపద్యమందు రెండుమాటలు తెలియనియెడ వీరి కేమి దిక్కు కలదు? ఏ నిఘంటువుం బరిశీలింతురు? ఏ చాకలి పుల్లయ్యగారిని యే మాదిగ పిచ్చయ్యగారిని నాశ్రయింతురు? ఆ మహనీయులకు మాత్ర మీ శబ్దరూపములు తెలియుననుట కేమి యాధారము కలదు? వారి గ్రామ్యమం దీశబ్దము లెట్టిరూపముల నొందినవో యెవ్వరెఱుఁగుదురు? త్రాడు తెగిన గాలిపట మెచ్చటఁబడునో యెవ్వరు చెప్పఁగలరు? నియమసూత్రము నతిక్రమించు నీశబ్దముల గతియు నంతే యగును. ఈ గ్రామ్యభాషాప్రాముఖ్యమును గొందఱు విద్యాధికులే యామోదించు చుండిరికదా యందురేమో. ఆమోదింతురుగాక; వారు విద్యాధికులే యగుదురుగాక; వారి యాదర్శములు నిర్దుష్టములే యగుంగాక. కాని యీ విద్యాధికులు భాషా కాసారము యొక్క కట్టలను దెగఁదీయుటకును మాత్రమే యింజనీయరులవలెఁ బనికివత్తురు. వీరు కట్టలను దెగఁదీయుచుండిరే కాని వానిని ముందువెక్కులకు జరపి కట్టుట లేదు. కావున వీరు తీసెడి యాగం డ్లనంతరమం దగాధములై వీరలకును వశముతప్పి కడగండ్లగునను టకు సంశయము లేదు. అట్టి స్థితియందుఁ బైనిసూచింపఁబడిన వారివంటి మహనీయులే మనకు భాషాచార్యులు కావలసివత్తురు. అది గర్హ్యము. కావునఁ బై గ్రాంథిక భాషాలోపదోషమును గప్పిపుచ్చుటకు గ్రామ్య మెన్నఁడును శరణము కానేరదు. గ్రామ్యభాషనే యాశ్రయించునెడఁ ద్రాడుతెగిన గాలిపటమువలెను, కాపరి నెడఁబాసిన గొఱ్ఱెవలెను భాష వినాశముఁ జెందును.

నియమములు.

చ. నియమవిహీనకార్య మవ ♦ నిఁ గణనీయము కాదు; నిల్వ దెం
తయు క్షయమౌచునుండు; నిది ♦ తప్పదు; కావున గ్రామ్యభాషయుఁ
నియమవిహీనమౌకతన ♦ నిల్వదు, నిల్వదు, రూఢి; దీనికిఁ
నియమము వచ్చుచో నిదియు ♦ నేర్వక లభ్యముకాదు; నేర్చుచో

నయనిభపండితోత్తమప ♦ థాంచితశాస్త్రనిరుక్తపద్ధతిన్
నియమములుండి, భాషను వి ♦ నిశ్చలరీతిని గాచుచుండ నం
తయుఁ జెడఁదీసి లేశమును ♦ దారియుఁ డొంకయులేని గ్రామ్యభా
షయె ఘనమంచు నూతనపు ♦ శాస్త్రవిధుల్ సృజియింపనేల? యా
నియమము లభ్యసింపుఁడని ♦ నెత్తిని బెట్టఁగనేల? వారె! యీ
చెయువులె కల్గనీ యెడమ ♦ చేతిని దీయుము, నాదు పుట్టచే
యి యచటఁ బెట్టువాఁడ నిహీ ♦ హీ' యనురీతినె యుండు; గాన నీ
నియమవిహీనమై, మఱియు ♦ నీరసమై, గుణహీనమార్గమై,
నయరహితంబునై, మఱి య ♦ నర్థకమై, వెగటైన గ్రామ్యభా
షయనెడి దారి వీడి, బహు ♦ శాస్త్రసమన్వితమౌచుఁ బండిత
ప్రియమయి, యెల్లదేశముల ♦ వీలుగ నొక్కటియై, యనాదియై,
ప్రయత సుమార్గమై యెసఁగు ♦ గ్రాంథికభాషనె కొల్చి యెల్లరున్
రయమున శుద్ధమార్గగను ♦ సంబునఁ గీర్తిని గాంత్రు కావుతన్.

ఈ యుపన్యాసకులలో మఱికొందఱు గ్రాంథికభాషాపరిచయము గలిగి యుండియుఁ దమ యభిప్రాయములను లేఖనరూపమునఁ దెలుపఁజాలకయుందురు. దీనికిఁ గారణము స్వాభిప్రాయవిశ్వాసలోపదోషము. వినువారి స్థితిగతుల ననుసరించి యప్పటప్పటి కనుకూలమగు విషయములఁ జేర్చి చెప్పుదురు. కాని కాకితమును గలమును దీసికొని వ్రాంతకు మొదలిడఁగనే యన్నియు సంశయములే. పఙ్క్తి నడవదు. వారు తమలోఁ దా మిట్లు వితర్కింతురు. "వీరి కేమియుఁ దెలియదు గనుక నేవో నాలుగు ముక్కలు చెప్పితిఁగాని యీ యభిప్రాయములను గ్రంథస్థము చేయునెడ నితరవిద్యాధికులు వీనిని మన్నింతురా? ఆయాగ్రంథములనుండి కొన్ని విషయములను దీసి వీరికిఁ జెప్పితిఁగాని యిందు నాశక్తి యేమికలదు? నాకుఁ గల ప్రసంగకౌశలముచేత సభ్యుల రంజించితిఁగాని యీ వాక్యములనే వ్రాయునెడ నివి లోకము నింతగ రంజింపఁగలవా?'' అని యిట్లు బహుసంశయగ్రస్తులగుచుఁ దుదకు వారు లేఖనప్రయత్నము మానుకొందురు. వీని నన్నిటిని మించిన మహాదోష మభ్యాసలోపము. ఉపన్యసించునపుడు నూతనాభిప్రాయములు వెంటవెంటనే బుద్ధికి స్ఫురించుచుండుటయు వానిని నప్పుడప్పుడే వాఙ్మాలమునఁ ద్వరితగతిం బ్రకటించుటయు వారి కభ్యాసము. వానినే వ్రాయఁబూనునపు డొకవాక్యమును నెమ్మదిగ వ్రాయునప్పటి కనంతరాభిప్రాయముల నన్నిటిని మఱచిపోవుదురు. చదువరుల కిది

యతిశయోక్తిగఁ దోఁపవచ్చును. దీని కొక దృష్టాంతముం జూడుఁడు. పొరుగూరిలో నుండిన బంధువులకు జాబు లేమని వ్రాయవలయు నని యడుగువారుండ్ర నడుఁగుఁడు. పూసగ్రుచ్చిన ట్లన్నిటిని పఠింపఁగా పడపడపడ యని చెప్పుదురు. ఒక్క వాక్యమును వ్రాసి యావల నేమి వ్రాయుదుమందు రని యడుగుఁడు. తప్పక కలవరపడుదురు. దీనికిఁ గారణ మభ్యాసలోపదోషమే. లేఖనాభ్యాసముగలవారి కీ యభిప్రాయములు ఊటబావి యందలి జలమువలె వారి హృదయకాసారమున వ్రాయుటకుఁదగిన వేగముతో నెడతెగక యూరి వచ్చుచుండును. కావున వక్తృత్వలేఖనప్రజ్ఞలు రెండును సర్వజనులకును అభ్యాససాధ్యము లని యింతవఱకు సిద్ధాంతీకరింపవచ్చును. కాని యీ ప్రజ్ఞాద్వయము దేశోద్ధరణకార్యధురంధరులగు నుపన్యాసకులు కవులు లోనగు మహనీయుల కావశ్యక మగును గాని తదితరులకుఁ గాదని యెవ్వరైన భ్రమఁ బడవచ్చును. అది సరికాదు. మన దినచర్యయందు మన మెన్నియో సందర్భములలో మన హృద్గతాభిప్రాయములను వాఙ్మూలముననో లేఖనమూలముననో ధారాళముగఁ దెలుపవలసివచ్చును. అవియే క్రమంబుగ నుపన్యాసములు, వ్యాసములు నగును. కావున నీ ప్రజ్ఞాద్వయసంపాదనమునకై ప్రతిమానవుఁడును బ్రయత్నింపవలసియున్నది.

"ప్రస్తుతవిషయము వ్యాసలేఖనముకదా. ఇచట నుపన్యాసవిషయ మేల ముచ్చటింపఁబడవలయు" నని యెవ్వరైన సంశయింపవచ్చును. కాని యట్టి సంశయ మనావశ్యకము. ఏలయన నుపన్యాసములును వ్యాసములును హృద్గతాభిప్రాయప్రకటన సాధనములే; రెండును భాషామూలములే. ఉపన్యాసమునందలి భాష ధ్వన్యాత్మకవర్ణ ప్రధానమైనది; వ్యాసమునందలి భాష ధ్వనిరహితవర్ణరూపప్రధానమైనది. ఇందు రెండవది మొదటిదాని రూపపటమే (Photograph). (27 వ పుటఁ జూడుఁడు.) ఇందు మొదటిదగు భాష ధ్వన్యాత్మకమగుటచేత నెప్పటిదప్పుడే గాలిలోఁ నంతరించి పోవుచుండును. తత్కారణమున నందు గుణదోషవిమర్శనమున కవకాశము మిక్కిలి తక్కువగ నుండును. కావుననే పాఠశాలయందు విద్యార్థికిఁ బ్రారంభమునుండియు భాషావిశేషము లన్నియు లేఖనసాహాయ్యంబుననే బోధింపఁబడుచున్నవి. కావుననే యిచటను వక్తృలేఖకసామాన్యమైన భాషయొక్క గుణదోషముల విమర్శించుతలంపున వ్యాసలేఖనమనునదే శీర్షికగాఁ గొనుటయినది.

ఈ వ్యాసలేఖనము నభ్యసించుకొనుటకు విద్యార్థి యొనర్పఁదగు ప్రయత్నములు రెండువిధములు. దోషనివారకములు, గుణసంపాదకములు. ఇందు దోషనివారక ప్రయత్నములు ప్రథమకర్తవ్యములు. కాన విద్యార్థులు వ్యాసలేఖనకార్యమందుఁ

దఱచుగ నొనరించు దోషసామాన్యముం గూర్చి యిట వివరింతును. ఈ దోషములు త్రివిధములు:— శబ్దదోషములు, వాక్యదోషములు, అర్థదోషములు.

శబ్దదోషములు.

"సీ. 1 అప్రయుక్తం, 2 బహు ♦ స్పష్టార్థంబు, 3 నేయార్థ,
4 మసమర్థకంబు, 5 ని ♦ రర్థకంబు
6 గ్రామ్యంబు, 7 విగతసం ♦ స్కారంబు, 8 గూఢార్థ,
9 మన్యార్థ, 10 మశ్లీల ♦ 11 మప్రతీత,
12 మప్రయోజనము, 13 క్లి ♦ ష్టార్థబంధంబు, 14 సం
దిగ్ధంబు, 15 విపరీత ♦ ధీప్రదాయి
16 యవిమృష్టతరవిధే ♦ యాంశంబు, 17 పరుషంబు
ననఁగఁ గావ్యంబులం ♦ దరసిచూడఁ
గీ. బదగతంబులు వెలయు స ♦ ప్తదశసంఖ్యఁ
గడలుకొన వీని లక్ష్యల ♦ క్షణము లెల్ల
విస్తరించెదఁ గవితాప్ర ♦ వీణసుకవి
నివహ నిరతోపకార ని ♦ క్షిద్రఫణితి." కావ్యాలంకారసంగ్రహము.

ఈ సప్తదశదోషవిచారణము ప్రబంధరచనయందు మహావశ్యకం బగును. ప్రకృతవిషయముగు వ్యాసలేఖనమందు విద్యార్థి యిందలి క్లిష్టగూఢార్థాదిదోషంబుల నొనరింప నసమర్థుఁడు. కావున వీనిలో విద్యార్థులఱచుగ నొనరించెడి నాల్గువిధముల దోషములనుగూర్చి మాత్ర మిట వివరింతును. ఇట్లే వాక్యదోషార్థదోషములయందును బ్రకృతమున విద్యార్థికి వ్యాసలేఖనకార్యమందు సులభముగఁ దెలియఁదగువానిఁ గొన్నిటినే వివరింతును.

5 నిరర్థకము:— పాదపూరణార్థము బ్రయోగింపఁబడెడి 'ధరలో', ఇలలో, నిక్కము, లలిన్, ఒగిన్, స్థిరముగన్ లోనగు పదములు నిరర్థకములు. ఉదా. పిల్లి యొగిఁ బట్టె నెలుకను ♦ బ్రీతి మెఱయ. ఇందు పిల్లి పట్టె నెలుకను అను మూఁడు పదములు గాక కొదవపదము లన్నియు నిరర్థకములే.

6 గ్రామ్యము:— శబ్దశాస్త్రనియమముల నతిక్రమించునట్టియుఁ, బామరులు మాత్రమే వచించునట్టియు పదము లన్నియు గ్రామ్యములు. ఉదా. వస్తాఁడు, పోతాఁడు, పిట్టులు, గజ్జులు మొదలగునవి.

10 అశ్లీలము:— ప్రకృతార్థము నిచ్చుచు, సిగ్గునుగాని రోఁతనుగాని అమంగళమునుగాని సూచించుచు మఱియొక యపార్థమునుగూడ స్ఫురింపఁజేయునది అశ్లీలము. ఇది శబ్దార్థధ్వనిశ్లేషలచేఁ ద్రివిధము. ఉదా. 1 నాకు నీకంటె మఱియేముండగలదు? 'ఏమి + ఉండఁగ౯ + కలదు' ఇది ప్రకృతము. 'ఏ + ముండ + కలదు' ఇది యశ్లీలము. ఇది శబ్దశ్లేషచేఁ గలిగినది. 2 ఈతని వాక్కులు పుణ్యాజనవాక్కులు. పుణ్యాజను లనఁగా ధార్మికులును, రాక్షసులును, గనుక రాక్షసవాక్కు లని స్ఫురించుట యశ్లీలము. ఇది యర్థశ్లేషచేఁ గలిగినది. ఇట్లే వలరాజు హలధరుఁడు నను పదములు మన్మథుఁడు, బలరాముఁడు నను నర్థముల నిచ్చుచుఁ బల్లెవాఁడు, మోటువాఁడు నను నర్థములఁ గూడ నిచ్చును. 3 నీ వింతటి మహానుభావుఁడవా! ఇంతటి దుష్టుఁడవా యను నర్థము దీనియందు స్ఫురించుచున్నది. ఇది యశ్లీలము. ఇది ధ్వనిచేఁ గలుగుచున్నది. ఈ త్రివిధాశ్లీలములందును వ్రీడ జుగుప్సామంగళములు కలుగుచుండును. 'వారు చీరను గజ్జలంటఁ గట్టిరి.' అనుట వ్రీడాకరము; 'గోమూత్రము పానకమగునా?' అనుట జుగుప్సాకరము; 'ఈతఁడు మహాజ్ఞాననిధి' అనుట యమంగళకరము.

12 అప్రయోజనము:— విశేషమును దెలుపక వ్యర్థముగఁ బ్రయోగింపఁబడెడి పదము అప్రయోజనము. ఉదా. ఇది పండిన దొండపండువలె నున్నది.

## వాక్యదోషములు.

"సీ. 1 అక్రమంబు, 2 విసంధి • 3 ప్రక్రమభంగంబు
4 పునరుక్తియుత, 5 హాసం • పూర్ణతరము
6 వాక్యసంకీర్ణంబు • 7 వ్యాకీర్ణ, 8 వ్యధికప
దంబు, 9 వాచ్యవివర్జి • తం, 10 ఖరీతి
11 న్యూనోపమం, 12 అధి • కోపమంబు, 13 సమాప్త
పునరాత్త, 14 మస్థాన • ఘనసమాస
15 మనియతచ్ఛందంబు, • 16 యతిభంగము, 17 పతత్ప్ర
కర్షంబు, 18 భిన్నలిం • గంబు, 19 భిన్న
గీ. వచన, 20 మక్రియ, 21 సంబంధ • వర్జితములు
22 వాక్యగర్భితమును నన • వాక్యదోష
వితతు లిరువదిరెండయి • వినుతిఁ గాంచు
వీని లక్షణ లక్ష్యముల్ • విస్తరింతు." కావ్యాలంకారసంగ్రహము.

1 అక్రమము :— క్రమమును విడుచుటే యక్రమము. ఉదా. ఈతని ముఖము ను గన్నులును కలువరేకులను చంద్రుని బోలుచున్నవి. చంద్రుని కలువరేకులను అని చెప్పవలయు.

2 విసంధి :— సంధిని జెఱచుట విసంధి యగును. ఉదా. అతఁడు యుక్తి మూఁడు. ఈతని యెఱుఁగుదును. వచ్చి నడిగెను.

4 పునరుక్తము :— శబ్దములనుగాని, అర్థములనుగాని చెప్పినవానినే మరలఁ జెప్పుట పునరుక్తము. ఉదా. మిక్కిలి శాంతుఁడును, మిక్కిలి చల్లనివాఁడును, మిక్కిలి ప్రకాశవంతుఁడు నైన చంద్రుఁడు. అక్షరజ్ఞానమే లేని నిరక్షరకుక్షి. కాని 'బిడ్డాబిడ్డా యిటురమ్మ' అనుచోఁ బునరుక్తి కాదు. ఆదరముచే ద్విరుక్తి.

11 న్యూనోపమము :— గుణహీన మగు నుపమ న్యూనోపమ. ఉదా. కాంచన చేలుఁ డగు విష్ణుండు నీలమేఘు మట్లు ప్రకాశించుచున్నాఁడు. అనలప్రభాయుతమగు నీ బాణవర్షముచే శత్రుసైన్యంబులు చీమలగుంపులవలె నలిచివేయఁబడినవి.

12 అధికోపమము —: గుణముచేత నధికమగు నుపమ అధికోపమం బగును. ఉదా. ఈ నేరేడుపండ్లు బంగరుగుండ్లవలె మెఱయుచున్నవి. మర్కటము వృక్షము నెక్కి ప్రభువువలె నున్నతాసనమునఁ గూర్చున్నది.

13 సమాప్తపునరాత్తము :— చెప్పి ముగించినదానిని మరల మొదలిడుట సమాప్తపునరాత్తము. ఉదా. రాముని రణభీముని గుణధాముని సంస్తుతింతు ముఖజిత సోముని.

18 భిన్నలింగము :— స్త్రీని బురుషునితోఁగాని, పురుషుని స్త్రీతోఁగాని పోల్చుట భిన్నలింగదోష మనఁబడును. ఉదా. ఆ యువతి మన్మథునివలె నున్నది. ఈతఁడు గంగాదేవిం బోలుచున్నాఁడు.

19 భిన్నవచనము :—వచనభేదముఁ గల యుపమ భిన్నవచన మనఁబడును. ఉదా. ఆ జనులు నిశ్చేష్టితులై స్తంభమువలె నిలిచిరి. అతఁ డిచటినుండి యచటికిఁ బక్షులవలె! నెగిరెను.

అర్థదోషములు.

క. క్రమమున నిఁక నర్థదో
షముల నెఱింగింతు సుకవి జనులకు 1 హీనో
పమ, 2 మధికోపమ, 3 మసమో
పమ, 4 మఖ్యాతోపమంబు, 5 పరుషమును మఱియున్,

గీ. 6 వ్యర్థ, 7 మేకార్థము, 8 ససంశయం, 9 బపక్ర
మము, 10 విరుద్ధంబు, 11 విర 12 సాతి మాత్ర, 13 హేతు
రహిత, 14 నిరలంకృ, 15 తాశ్లీల 16 సహచరచ్యు
తములు, 17 భిన్నంబు నన వీని క్రమమొనర్తు.

1 హీనోపమము — అధికు నల్పునితోఁ బోల్చుట హీనోపమము. ఉదా. ఈతఁడు గాడిదవలె మిక్కిలి యోపికతోఁ బనిచేయును. అతఁడు విశ్వాసమందు కుక్కవంటివాఁడే.

2 అధికోపమము — నీచమగుదాని నధికమగుదానితోఁ బోల్చుట అధికోపమము. ఉదా. ఈయెలుక హనుమంతునివలె నెగురుచున్నది. ఈ పులివగ్గుహము పతివ్రతవలెఁ బరాస్పృష్టం బై యున్నది.

5 పరుసము — కఠినవాక్యములఁ బలుకుట పరుస మనంబడును. ఉదా. ఈతఁడు పండిపోయిన మన్మథునివలె నున్నాఁడు.

10 విరుద్ధము — స్వభావప్రతికూలంబుగ వర్ణించుట విరుద్ధ మగును. ఉదా. తుమ్మచెట్టుపైని కోకిలలు కలరవంబులఁ జేయుచున్నవి. ఎలుఁగుబంటు లగ్నికణములతో నాటలాడుచున్నవి.

14 నిరలంకృతి — అలంకారరహిత మగు వర్ణనము నిరలంకృతి. ఉదా. ఈ ధన్యుఁడు రెండుచెవులను ఒక ముక్కును గలవాఁడు.

ఇట్టి దోషత్రయలక్షణంబులఁ జక్కఁగ గుర్తెఱిఁగి వ్యాసములందు వీనిం జేరనీయకుండుటకు విద్యార్థి సర్వదా సర్వథా ప్రయత్నింపవలసి యున్నది.

గుణసంపాదన ప్రయత్నము.

పలువురు పైతరగతుల విద్యార్థులును, వారికంటెఁ దక్కువకాని యాంధ్రభాషాజ్ఞానముఁగల యితరులును వ్యాసలేఖనాభ్యాసనోత్సాహులగుచుఁ దదర్థమై నూతన శబ్దజాల సంపాదనం బావశ్యకం బని తలఁచి మనువసుచరిత్రాదులఁ జదువుటకుఁ బ్రారంభించుచున్నారు. ఇది యొకపొరపాటు. ఏలయన మనువసుచరిత్రాదులు భాషాభివృద్ధికై చదువఁదగిన గ్రంథములు. వీరు కోరునది భాషాభివృద్ధి కాదు; వ్యాస లేఖనాభ్యాసము. వీ రింతవఱకు వ్యాసమును సక్రమంబుగ వ్రాయఁజాలకుండుటకు భాషాలోపము కారణము కాదు; వ్యాసలేఖనాభ్యాసలోపమే కారణము. మఱియు వ్యాసలేఖనక్రమానభిజ్ఞతయుఁ గారణము. వీరికి వచ్చిన భాషతోడ నొక గ్రంథమునే వ్రాయవచ్చును. ఈ దృష్టాంతములఁ జూడుఁడు.

ఉ. ఓయి దయావిహీనహృతి! ♦ యూరక యీ పసిబిడ్డఁ గొట్టఁగాఁ
జేయెటులాడెనీకు? నిది ♦ చేసినదేమి? వృథా శపింతురే?
బోయవె? యాఁడుతోడునను ♦ బుట్టవె? శాపనిమిత్తమే తపం?
బీయెడనున్న శాంతిపరు ♦ లేమనువారిఁక నీ చరిత్రకున్! మనుచరిత్రము.

చ. పకపకనవ్వె యో వసుక్ష్మా ♦ పాలక! బాలిక చూచెదేల? సా
రెకుఁ బరతంత్రలింతులు; వ ♦ రింతురె కాంతులఁ దమ్ముఁదాము? క
న్యకలకు నేరమా యిది? య ♦ నన్యగతిన్ సుదతిన్ మనోజ్ఞబా
రికి నెనచేసి, లోఁ గనిక ♦ రింపనివారివిగాక నేరముల్. వసుచరిత్రము.

చ. అతనికిఁ బట్టికోసినను ♦ నచ్చర మొక్కటిలేదు; కాగడన్
వెతకినఁ బెల్విలేదు; దయ ♦ వీసమునుం గలనైన లేదు; ప్రా
జ్ఞత నయవిద్యలేదు; పదు ♦ నాల్గుపుటంబులు పెట్టి కాల్చినన్
జతురత వాఁతపెట్టినను ♦ సత్యము జిహ్వకు రాదొకప్పుడున్.

అభాగ్యోపాఖ్యానము.

“చిత్రగ్రీవుఁడు— చెలికాఁడా! (హిరణ్యకా!) నీవు చెప్పిన నీతి కాదనను. అయినను నావారి దుఃఖము చూచి సహింపఁజాలను. కాఁబట్టి యింత నొక్కి చెప్పితిని. ప్రాజ్ఞుండు ధనజీవితములయిన మానుకొని మంచివారికి వచ్చిన కీడు తొలఁగింపవలెనని నీతికోవిదులు చెప్పుదురు. అది యటుండనిమ్ము. నావంటివారు వీరు. వీరివంటివాఁడను నేను. ఇప్పటి కొదవని నాప్రభుత్వమువలన వీరికి రాఁగల ఫల మేమి? చెలికాఁడా! హేయమై వినశ్వరమైన యీ కళేబరము దాస్థ మాని నాకు యశము సంపాదింపుము. నావలన జీతమా బత్తెమా? ఏదియు లేదు. అయినను వీరు సర్వకాలము నన్ను విడువక కొలుచుచున్నారు. నేను వీరి ఋణ మెప్పుడు తీర్చుకోఁగలనో యెఱుఁగను. నా బ్రదుకు ముఖ్యముగాఁ జూడను. వీరి ప్రాణములు రక్షించితేఁ జాలును. అనిత్యమై మలినమైన కాయముచేత నిత్యమై నిర్మలమైన యశము లభించెనా దానికంటె లాభముగలదా? శరీరమునకు గుణములకు మిక్కిలి యంతరము. శరీరము క్షణభంగురము. గుణములు కల్పాంతస్థాయులు. ఇట్టి శరీరము నపేక్షించి కీర్తి పోఁగొట్టుకొనవచ్చునా?” నీతిచంద్రిక, మిత్రలాభము.

ఈపద్యములందుఁగాని వచనమునందుఁగాని యీవిద్యార్థులకుఁ దెలియని పదము లుండవు. ఈపద్యగద్యములు గ్రంథములందు సర్వవిధముల వాసిఁగాంచినవేకాని ప్రకృతవాదానుకూలముగ నుండుటకై యేరి పెట్టఁబడిన కొఱమాలినవి కావు. కాని యిట్టి

పద్యమునుగాని వచనమునుగాని వీరు వ్రాయఁ గలుగుదురా? వ్రాయఁజాలరు. కారణ మేమి? లేఖనవిధానానభిజ్ఞతయు, నభ్యాసలోపమునే. కావున నిట్టి విద్యార్థుల యుపయోగార్థము వ్యాసలేఖనమార్గములఁ గొంతకఱకు సంగ్రహముగ నిట వివరించుచున్నాఁడ.

1 కల్పన:— లేఖకునకు వలయు శక్తులలో మొట్టమొదటిది కల్పనాశక్తి. ఈ శక్తి కథాకల్పనయందును, కథానుకూలము లగు వివిధవిషయములఁ గల్పించుటయందును, శబ్దముల కూర్పునందును మిక్కిలిగ నుపయోగించును. విద్యార్థి యీ శక్తిని క్రమముగా సంపాదించుకొనుటకు మార్గ మొకటి కలదు. అ దేదియనఁగా నే లేఖకుఁడుగాని సంఘమునకుఁ గొన్ని నూతనధర్మములనో, భక్తిజ్ఞానవైరాగ్యములనో, నీతులనో బోధించుతలంపున లేఖనీపత్రంబులఁ బూనవలయుఁ గాని తాను వ్రాయఁగలనని చూపుటకు మాత్రము కాదు. అట్టి బోధకుఁ దాను జేకొనెడి కథనో విషయమునో ఒకసాధనముగ మాత్రము చేసికొనుచు ననువగు ప్రదేశంబులలో నెల్లఁ దా నుద్దేశించెడి బోధను జేర్చుచుండవలయును. "హరిశ్చంద్రుఁడు కాశీపురంబును బ్రవేశించి విశ్వామిత్రుని ఋణమును దీర్చుటకై నక్షత్రకుని ప్రేరణంబున దన భార్యను విక్రయించెను." అని యిట్లు ఉన్నదున్నట్లు వ్రాయుటలో నీ లేఖకుని కల్పన లేదు. దీనినే నాలుగు పుటలు నిండునంతగ వ్రాయవచ్చును. కాని యే బోధయు లేని విపరీతవర్ణనములతోడఁ జెట్లను గట్లను వర్ణించుచు కేవల కవిప్రజ్ఞను బ్రకటించుటచేత మాత్రము కాదు. మఱియెట్లనఁ 'గాశికాపురంబును బ్రవేశించెను' అని యాపురప్రాశస్త్యమును గూర్చి తన యభిప్రాయమును గొంత వ్రాయవచ్చును. 'విశ్వామిత్రుని ఋణమునుదీర్ప నెంచెను.' అనుచు లోకమున ఋణమువలని కష్టసుఖములను ప్రస్తుత ఋణముయొక్క స్వభావమును వ్రాయఁదగును. 'నక్షత్రకుఁడు ప్రేరేపించెను అనుచు నీ కథయందాతని ప్రయత్నముయొక్క మూలమాత్రము నించుక వివరింపఁదగును. మఱియు విశ్వామిత్రుని యాజ్ఞానుసరణంబుగ నీతం డిట్లొనర్చుచుండెఁ గాన, బరాధీనజీవనుల కిట్టి నిర్బంధములు కలుగుచుండు ననుటను జక్కఁగ వివరింపఁదగును. "తన భార్యను విక్రయించెను" అను సందర్భమున భార్యాభర్తల యన్యోన్యసంబంధములు, ప్రేమలు వివాహధర్మములు లోనగు విషయములఁ దెలుపఁదగును. ఇట్లు వ్రాయునెడ విద్యార్థి తన వ్యాసము నెంత విపులముగనైన వ్రాయవచ్చును. తనకుఁగల ప్రపంచానుభవము నంతను వెల్లడింపవచ్చును. ఇట్లు వ్రాయునదే వ్రాఁతయగును గాని యూరక వట్టికథను వ్రాయుటచేఁ బ్రయోజనము లేదు. దానిచే విద్యార్థికిఁ గల్పనాశక్తి యభివృద్ధి కానేరదు; ప్రజలకుఁ

ప్రయోజనము కలుగదు. ఒక్క దృష్టాంతముఁ జూడుఁడు. పరవస్తు చిన్నయసూరిగారు నీతిచంద్రిక 55 వ పుటలో నిట్లు వ్రాసిరి. "సదసద్వివేకసంపన్నుఁడయిన ప్రభువునకు మాబోఁటి క్షుద్రులవలన నరయందగిన యర్థం బొకటి గలదే యని విచారింపఁ బనిలేదు చక్షుష్మంతునకే దీపంబుగాని యంధునకుం గొఱయగునె? ఒక్కటి విన్నవించెద నవధరింపుఁడు. బహుదేశాటనంబును బహుశ్రుతులతోడ నిరంతరసాంగత్యంబును గావ్యశాస్త్రవిచారంబును రాజాస్థానంబుల బహుకాలసేవనంబును బురుషున కెట్టివాని కేని వివేకంబు పుట్టింప సమర్థంబు లయియుండు. ఈ నాలుగింట నొక్కండే నెవ్వానికి లేకుండు వాఁడు కూపస్థమండూకంబుం బోలెం దన యున్కునకుం జక్కని మీఁదిదే యాకాశంబు తన గొందియ లోకం బని యెంచి స్వజీవనమాత్రంబునకుం దుష్టివొంది లోకవృత్తాంతంబున మూఢుండయి నశించును." ఇట్టి లేఖనమార్గము నే విద్యార్థు లవలంబింపవలసియున్నది.

2 శైలి:— దీని విషయములోఁ బలువురు విద్యాధికులు భిన్నాభిప్రాయు లగుదురు. కొందఱు గీర్వాణపదభూయిష్ఠముగ నుండినఁగాని ప్రౌఢముగ నుండదందురు. మఱికొందఱు మిక్కిలి యమకముతో నిండియుండవలయు నందురు. ఇంకఁగొంద ఱర్థాలంకారభరితమై యుండవలయు నందురు. ఈ నియమము లన్నియు వారివారి ప్రత్యేకోత్సాహాధీనములు. కాని సర్వజనసమ్మతములు కాఁజాలవు. సమస్తశాస్త్రములకును బ్రథమసూత్రముల నొసఁగునది స్వభావము (Nature). కావున నీ వ్యాసమును స్వభావశైలి (Natural style) లో వ్రాయవలయును. పైఁజెప్పఁబడిన గీర్వాణపదప్రయోగము, శబ్దార్థాలంకారములు లోనగున వన్నియు స్వభావముం డెంతవఱకుఁ గనఁబట్టునో అంతవఱకు వ్యాసములందు వానిని బ్రయోగింపవచ్చును. కాని మిరెపకాయలఁ బండించునాతని యింట నెచటఁజూచినను మిరెపకాయలే కన్పడునట్లును, యమకప్రీతిగల కవి గ్రంథముం దెచ్చటఁజూచినను యమక మొక్కటియే కన్పడునట్లును, అతివృష్టి యనావృష్టి దోషములకు మాత్రము లోనుగాఁగూడదు. సంపన్నగృహస్థుని యింటివలెనే తన వ్యాసము బహువిధపదార్థభూయిష్ఠమై యుండునట్లొనర్పఁ బ్రయత్నింపవలయును.

3 స్పష్టత:— లేఖకుఁడు తన యభిప్రాయమును శబ్దార్థాలంకారాదివిశేషములచేతఁగాని సందిగ్ధవాక్యాదిదోషములచేతఁగాని మఱుఁగుపఱుపఁగూడదు. తన వ్యాసమందు స్పష్టత (Clearnses of expression) ను సర్వత్ర నిలుపవలయును. ఉత్కృష్టయోగ్యతాసమన్వితుండయి యనుటకంటె మంచిప్రవర్తనకలవాఁడయి యనుటచే లోప మేమియుఁ గలుగ దని యెఱుఁగవలయు.

4 సౌష్ఠవము:— నిర్దుష్టభాషను వ్రాయుట యావశ్యకము. విస్సప్ప చెప్పినదే వేద మనునట్లు తాను చెప్పినదే సిద్ధాంత మనుచుఁ జేతికివచ్చినట్లెల్ల వ్రాసి తప్పొప్పులు కల చోట్ల నిది గ్రామ్య మని వాదించుట తగవుకాదు. స్వభావశైలి యనుటచే గ్రామ్య మని యన్వయింపఁ గూడదు. చిత్రలేఖకుఁడు స్వభావమును వ్రాయనెంచి యొక వృక్షమును వ్రాయునెడ నందలి యెండిన కొమ్మలను, వాడిన పుష్పములను, పుచ్చిన కాయలను వ్రాయుట లేదు. అందలి నిర్దుష్టభాగములనే వ్రాయును. అట్లే యీ వ్యాసలేఖకుఁడును నిర్దుష్టభాషనే వ్రాయవలయు. ఇది యొకనాఁట లభించునది కాదు. గ్రంథపఠనకాలమం దెల్లను భాషాసౌష్ఠవమందు దృష్టి నిలిపి శబ్దములయొక్క శుద్ధరూపముల శ్రద్ధతో గమనించుచుండునెడ నది నానాఁటఁ బట్టువడును.

5 ప్రసన్నత:— శబ్దార్థములు రెండును ఆహ్లాదజనకము లగుచు వానివాని భావములను దృష్టిగ వెలువరించునవిగ నుండవలయు. ఒకని యందమును దెలుప నెంచునపుడు 'మండిపోయిన మన్మథుని వలె నుండె' ననుటకంటె 'మనోహరుఁడగు సుమసాయకుని వలె' నుండె నని చెప్పఁదగును.

6 సందర్భశుద్ధి.— వివిధాంశముల వివరించునపుడు వానిలో నొండొంటికిఁ గల యన్యోన్యసంబంధమును విశదీకరించుచుండుటే సందర్భశుద్ధి యగును. దృష్టాంతము- 'గోపాలుఁడు చెన్నపురి కేగెను. అతని జేబులోని రూపాయల నొకఁడు తస్కరించెను.' అనెడి రెండువాక్యముల మధ్యను 'పుస్తకములను గొనుటకై పదిరూపాయలను జేబులో వేసికొని బజారునకుఁ బోయెను' అనెడి, వాక్యమును గూడఁ జేర్చి యెట్లుండునో చదివి చూడుఁడు. ఇట్టిదే సందర్భశుద్ధి. మధ్యమధ్య నిట్టి వాక్యములను విడిచివేసి 'చదువరు లామాత్రమైన నూహించుకొనలేరా' యనుట యుక్తముకాదు.

7 ఉపమానము.— తాను దెల్పెడి యభిప్రాయములను స్థిరీకరించుటకుఁ దగిన యుపమానముల నచ్చటచ్చట నిచ్చుచుండవలయు. దృష్టాంతము— 'కార్యసిద్ధి కల్గువఱకును నెట్టికార్యమునైనను స్వల్ప మని తృణీకరింపరాదు; రాముఁ డల్పుఁడంచు రావణుఁ డెంచి యేమయ్యెను?'— కొన్నియెడల లోకోక్తులే యుపమానములుగఁ బనికివచ్చును. దృష్టాంతము— 'చిన్నపామునైనను బెద్దకఱ్ఱతోనే కొట్టవలయు.'.

8 రసము.— ఏరసమును బ్రధానముగఁ జేసికొని తా నుద్దేశించెడి విషయమును బోధింపనెంచునో యా రసమును గార్యసిద్ధి యగువఱకును బోషించుచునే పోవలయు.

ఇది కఠినమగు విషయము. కావున, దీనిని దృష్టాంతమూలముననే తెలిపెదను.—
ప్రకృతకాలమునఁ బ్రపంచమందలి మనుజులలో నెల్ల నసమానబలవంతుఁ డని పేరొందిన సాండో యనునాతఁడు తన దేహబలాధిక్యమును అద్భుతరసప్రధానమైన యొక వృత్తాంతమువలనఁ దెలిపెను. ఆతనిమాటలనే యిట వ్రాసెదఁ జిత్తగింపుఁడు. "నేను లండనుపట్టణమందు మొదటిప్రదర్శనమును జరిపిన యనంతర మొక సెలవు దినమందు జర్మనీదేశమును జూడఁబోయితిని. ఒకనాఁడు స్టేషనునందు గుఱ్ఱపుబండి యెక్కి పోవుచు నొక ప్రత్యక్షరాక్షసుని జూచితిని. ఆతఁ డొక రాళ్లపనివాఁడు. బండ్లమీఁద రాళ్లు నెక్కించుట యాతని పని. ఆతని యాకారమును జూడఁగానే నా గుఱ్ఱము నిశ్చయముగా బెదరెను.

ఈ భయంకరాకారుఁ డెట్లుండెనో, చేతనగునెడ, నీవే యోచించుకొనుము. వాని తల పూతనాకారముగఁ జేయబడెడి బుట్టబొమ్మయొక్క తలయంత యుండెను. ముక్కు సాధారణపు పిడికెఁ డుండెను. ఆతని పిడికిలి నాపిడికిలికి మూడురెట్లకు మించియుండెను. ఆతని యంగుష్ఠముక్రింద నొక చీనాదేశపురూపాయను బెట్టునెడ నది మనకుఁ గన్పింపదు. ఆతనియొక్క కాలిబూటులో నా రెండుకాళ్లను బట్టుటయే గాక దానిలో నేను గుండ్రముగాఁ దిరుగఁగలను. దీని కంతటికిఁ బైఁగా నీతని యెత్తును సామాన్యముగా లేదు. ఆఱడుగులకు మించియున్నది. ఆఱడుగుల రెండున్నర యంగుళములున్నది. ఆతని ఱొమ్ము చుట్టుకొలత 80 అంగుళములును, బరువు 400 పౌనులును ఉండెను. ఆతఁడు నీటిశరీరము కలవాఁడు కాఁడు. మంచి నరపుబలమును, ఎముకబలమును గలవాఁడు.

ఆతని జూడఁగానే యాతని నాప్రదర్శనములలోఁ జేర్చుకొనవలయు నని తోఁచి,యాతనిఁ బిలిచి, 'నీవు దినమున నెంత సంపాదించుచుంటి' వనియడిగితి. తక్కిన కూలీలకంటె రెట్టింపు (రెండురూపాయలు) అనియుఁ, దక్కినకూలీలకంటెఁ బెద్ద బరువుల నెత్తుచు బండ్లను త్వరతో నింపుదుననియుఁ జెప్పెను. 'నాయొద్ద నుండునెడ నీవు పని చేసినను జేయకున్నను దినమున నైదురూపాయ లిచ్చెద' నని చెప్పితిని. ఆతఁ డంగీకరించెను. బసలోనికిఁ దీసికొనిపోయి యాతని బరీక్షించితి. బరువులెత్తుట తప్ప నింకేమియుఁ దెలియదు. ఎట్లయినను బేరము కుదుర్చుకొని యాతని నింగ్లండునకు దీసికొని వచ్చితిని. ఈతని జూచుటకుఁ బ్రజలు గుంపులుకూడసాగిరి. రైలునుండి యీతని నింటికిఁ దీసికొనివచ్చుట కేపెట్టెబండియు పట్టదయ్యెను. నడిపించుకొని రావలసివచ్చెను. వేలకొలఁది జను లీతనిఁ జూచుటకు మూఁగసాగిరి. ఈతఁడు

తెల్లయేనుఁగువలెఁ గన్పట్టుచుండెను. వీథులు జనులతోఁ గ్రిక్కిరిసిపోయెను. ఎట్టులో యిల్లుచేరితిమి. ఈతని మరల బయటికి రానీయక యింటిలోనే యుంచితిని. ఏడెనిమిది వారములవఱకును ఈతని కేమైన నేర్పఁజూచితిఁ గాని యీతఁడు వ్యర్థుఁడుగ నుండెను.

వెంటనే నే నొక ప్రదర్శనము గావింపవలసివచ్చెను. అందు రంగస్థలమం దీతఁడు నన్ను తరిమి పట్టుకొనున ట్లేర్పఱుచుకొంటిమి. కొంతసేపటికి మే మిద్దఱమును గలిసి కుస్తీ పెనఁగితిమి. అంతట నన్ను గాల్చుటకు 400 పౌనులు బరువుగల యొక పిరంగిని భుజములపైఁ బెట్టుకొని యాతఁడు తరుముకొని వచ్చెను. అంత నొక నిమిషములో నే నొక గద తీసికొని తిరుగఁబడితిని. ఆతఁడు బెదరు నభినయించుచుఁ బరుగెత్తవలసిన వంతు వచ్చెను. ఆతఁ డట్లు పరుగెత్తి తన పిరంగితోఁగూడ నొక బోనులో దూఱెను. తోడనే నే నా బోనుపైభాగమున కేగి యాబోనును, పిరంగిని, రాక్షసుని గూడ నొక్క వ్రేలితోఁ గొన్ని యంగుళములదూరము పైకెత్తితిని.''

ఈ వృత్తాంతమందు గుఱ్ఱము బెదరె ననుటనుండియుఁ దుదవఱకును అద్భుతరసము పూర్తిగఁ బోషింపఁబడెను. ఒక్కవ్రేలితో నాతని బైకెత్తితిననుటతో ముగింపఁబడెను. దీనియం దాతని విద్య, గుణములు, యోగ్యత మొదలగువానిని ముచ్చటించినచో నది వ్యర్థప్రశంస యగును. ప్రస్తుతరసమునకు సంబంధింపదు. కాన నట్టిది వదలివేయఁబడినది. ఆతని విపరీతాకారము, దేహబలము, బరువు అనెడి మూడు విషయములు మాత్రమే చక్కఁగ నభివర్ణింపఁ బడినవి. దానిచేత నద్భుతరసము పోషింపఁబడినది. ఇదేవిధముగ వ్యాసలేఖకుఁడు తా నేరసముతోడ బోధింప నెంచునో యారసమును ఆవిషయాంతమువఱకును జక్కఁగఁ బోషించుచునే పోవలయును. విద్యార్థి లేఖనక్రమము నింతవఱకు గ్రహించిన యనంతరము విషయ విభజనక్రమము నెఱుంగవలసి యున్నది. అది యిటఁ దెలుపఁబడును.

### విషయవిభజనము.

వ్యాసలేఖనమునకు విద్యార్థి చేకొనెడి విషయము లన్నియు మూడు విధములు: కథాప్రధానములు, వర్ణనప్రధానములు, గుణప్రధానములు. అర్జునుఁడు, హరిశ్చంద్రుఁడు, లోనగు మహాపురుషుల చరిత్రలు కథాప్రధానములు. పశుపక్ష్యాది చేతనములు, లోహారామనదీపర్వతా ద్యచేతనములు, ఉత్సవాది వినోదములు వర్ణనప్రధానములు. సత్యసంధత, మాతృపితృభక్తి, యోగ్యత, విద్య, ధైర్యము లోనగువిషయములు గుణప్రధానములు. వీని కాఠిన్యము వీనిక్రమము ననుసరించియే యుండును. అనఁగా మొదటి

తరగతికంటె రెండవతరగతియు, దానికంటె మూడవతరగతియు నెక్కువకఠినంబుగ నుండును. ఎట్లనఁగా, కథాప్రధానవిషయముల వ్రాయుటయందు విద్యార్థియొక్క ప్రయత్న మంతయు నిర్దుష్టభాషను వ్రాయుటయే. వర్ణనప్రధానవిషయముల వ్రాయుటయందు విద్యార్థి నిర్దుష్టభాషాప్రయత్నమునకుఁ దోడుగ వర్ణనీయాంశసంగ్రహణ ప్రయత్నమును గూడఁ జేయవలసియున్నాఁడు. గుణప్రధానవిషయలేఖనమందు విద్యార్థి తాను జూచినట్టియు విని గ్రహించినట్టియు, ప్రపంచము నంతను దన కన్నులయెదుటఁ గల్పించుకొని, యందు గుణదోషవిమర్శన మొనరించి, గుణమునకు వన్నెఁ గల్పించుచు, దోషమును నిరసించుచు వ్రాయవలసియున్నాఁడు. కావున నిది మిక్కిలి కఠినము. ఈ గుణదోషవిమర్శనము పై త్రివిధవిషయములందును నుండును. మొదటితరగతియందు మిక్కిలి కొంచెముగను, రెండవతరగతియందు దానికంటె నెక్కుడుగను, మూడవతరగతియందు మిక్కుటముగను ఉండును. ఇది లేని వ్రాఁత వ్రాఁతయే కాదు. ఎవ్వఁడు తన వ్రాఁతయందు గుణదోషవిమర్శనమున కవకాశమును గల్పించుకొని స్వాభిప్రాయమును బ్రకటించుట కభ్యాసపడఁడో అతని విద్యాజ్ఞాన మంధునిచేతి దివ్వెవంటి దని చెప్పఁదగును. కావున విద్యార్థి యీ గుణదోషవిమర్శనాభ్యాసము నేమఱక యుండవలయు.

### విషయాంతర్విభజనము.

పై త్రివిధవిషయముల వ్రాయుటలో విద్యార్థి యొక్కొక్క విషయమునం దంతర్విభాగము చేయవలసియున్నది. ఇది తరగతి కొక విధముగ నుండును. ఒక్క తరగతియందే వేఱువేఱుగఁగూడ నుండును. అయినను విద్యార్థుల యుపయోగము నిమిత్తము మార్గదర్శకముగ నుండుటకై కొన్ని విషయముల యంతర్భాగముల నిచట విభజించి చూపెదను.

### కథాప్రధానములు.

1 ఉపోద్ఘాతము:—ఒకచేత శాస్త్రమును వేఱొకచేత శస్త్రమును బూనిన మహాప్రజ్ఞాధురంధరుఁడగు నర్జునుని గూర్చి వచింతుననియు, సత్యవ్రతరక్షణమునకై తన సర్వస్వము నర్పించిన హరిశ్చంద్రునిగూర్చి లిఖింతుననియు, ఆజన్మభక్తుండగు ప్రహ్లాదునిగూర్చి చర్చింతుననియు నిట్టి వాక్యములను ప్రధానముగాఁగల కొన్ని పంక్తులను ప్రప్రథమమున వ్రాయవలయు. ఇది మిక్కిలి సంగ్రహముగ మొత్తములోఁ బదియవవంతును మించక యుండవలయు. దానియందా కథానాయకునియొక్కగాని కథానాయికయొక్కగాని యుత్కృష్టధర్మము సూచింపఁబడవలయు. ఇది యుపోద్ఘాత మనఁబడును,

2 కథ:—తా నుద్దేశించెడి యా చరిత్రను నిరుపమమును గుణసహితమును నగు భాషలోఁ దెలుపవలయు. తన భాషాధిక్యమును జూపుకొనుతలంపునఁగాని, పాఠకులకు నవీనశబ్దజాలమును బోధింపుతలంపునఁగాని, యపూర్వశబ్దప్రయోగమును జేయఁదలంచు నెడ నద్దానిని కేవలకవిప్రజ్ఞను దెల్పు వర్ణనాభాగమందుఁ జేయవలయుఁ గాని కథాభాగమందుఁ జేయఁగూడదు. అనఁగా హరిశ్చంద్రుని కథయందు అరణ్యమును గాని, పర్వతమును గాని, కాశీపురమును గాని, ధర్మమును గాని తాను వర్ణించుచో నట్టి శబ్దజాలమును బ్రయోగింపవచ్చును. కాని వారివారి యన్యోన్యప్రసంగములందును ప్రధానకథను వివరించునపుడును మాత్రము ప్రయోగింపరాదు. ఒకవేళఁ బ్రయోగించుచో నట్టి శబ్దముల యర్థము సన్నిహితపదసముదాయసహాయంబున స్ఫురించునట్లు గాని, ఆయర్థము స్ఫురింపకున్నను దదితరశబ్దసాహాయ్యంబున వాక్యార్థము సులభముగ స్ఫురించునట్లు గాని వ్రాయవలయు. కవిప్రజ్ఞ విషయగ్రహణమునకుఁ బ్రతిబంధకము కాఁగూడ దనుటయే యీ నియమముయొక్క మూలసూత్రము.

3 ధర్మములు:—సత్యవాక్యనిరతి యుత్తమపురుషధర్మము, ప్రజల ప్రార్థనల విని హరిశ్చంద్రుఁడు వేఁటకు వెడలుట ప్రభుధర్మము, వీరబాహువాజ్ఞానుసరణంబుగ భార్యను ఖండింప నంగీకరించుట సేవకధర్మము, జనకవాక్యనిర్వహణార్థము రాముఁ డరణ్యంబునకేగుట పుత్రధర్మము. ఇట్టి ధర్మముల వివరింపునట్టులందు లేఖకుఁడు విజృంభించి తనకుఁ గల యుక్తాయుక్తవివేచనజ్ఞానంబును, గుణదోషవిమర్శన సామర్థ్యంబును, ప్రపంచానుభవంబును జక్కఁగ వెల్లడింపవలయు.

4 నీతులు:—ఇవి ధర్మములవంటివి కావు. ధర్మము లన్ని సంఘములందు నొకటిగనే యుండును. నీతు లాయాసంఘాచారముల ననుసరించి యుండును. వీనిని వివరించునపుడు కొన్ని లోకోక్తులను గాని, ప్రామాణికుల వాక్యములను గాని యుపబలముగా గొనవలయు. మాతంగకన్యలు వరింపుఁడనినపుడు హరిశ్చంద్రుఁడు తా నేకపత్నీవ్రతస్థుఁడ ననుట క్షత్రియనీతి. ఇది కొన్నిసంఘములందుఁ బాటింపఁబడుట లేదు.

5 ఉపసంహారము:—ఉపోద్ఘాతమందు సూచింపఁబడిన ధర్మ మిట్లు పూర్ణముగ ననుసరింపఁబడిన దని కథాంతమందు వరలఁ దెలుపుట యుపసంహారమగును.

ఈ యైదు భాగములును దన వ్యాసమం దుండునట్లు లేఖకుఁడు వ్రాయఁ బ్రయత్నింపవలయు. ఈ యైదును గథాక్రమమునందు వరుసగ రావు. అచ్చటచ్చట నచ్చును. ఉపోద్ఘాతోపసంహారములు మాత్ర మాద్యంతములందే తప్పక వచ్చును.

వర్ణనప్రధానములు; చేతనములు.

1 ఆకారము:— ఆవులకుఁ గొమ్ములు, గుఱ్ఱములకు కుచ్చువంటి తోఁక, ఏనుఁగునకు తొండము, ఒంటెకు మూఁపురము లోనగు ప్రత్యేకావయవములు కలవనుటను సూచింపుచు వాని యెత్తు, పొడుగు, లావు, రంగులను దెలుపుట మొట్టమొదటి కార్యము. దీనిచేత నా జంతువు స్ఫురణకు రావలయును.

2 నివాసము:— పులులు, తోడేళ్లు లోనగు మృగము లరణ్యములందును, గ్రద్దలు ఉన్నతప్రదేశములందును, కొంగ లుదకప్రదేశములందును, పీతలు కలుగులయందును, చిలుకలు ఫలవృక్షములందును వసించుననుచు నిట్లే యితరజంతువుల వాసస్థలములనను జెప్పవలయు. ఆయాజంతువుల కాయా వాసస్థలములతోఁ గల సంబంధమును గూడఁ దెలుపవలయు.

3 ఆహారము:— ఆవు తవిటిని, గుఱ్ఱముగడ్డిని, పులి కేవల మాంసాహారమును, నక్క శాకమాంసాహారముల రెండింటిని, సింహము హస్తిమస్తిష్కమును, చిలుక పండ్లను కోకిల చిగుళ్ళను దినుననుచు వానివాని ప్రత్యేకాహారములఁ దెలుపుచు సామాన్యాహారములఁ గూడఁ దెలుపవలయు.

4 అభ్యాసములు:— ఆవు పొలములో మేసి, యింటియొద్దకు వచ్చి, తన కట్టుఁగంబమునొద్దఁ బరుండును. కుక్క యజమాని వెంటఁ దిరుగుచుండును. పులి నీళ్లను గలఁచి త్రాగును. ఎలుఁగుబంటి తలక్రిందుగఁ జెట్టెక్కును. పావురములు నివాసగృహము నెడఁబాయకుండును. ఇట్టివి వాని యభ్యాసములు. అడవిమృగములఁ బట్టుకొనువా రాయాజంతువుల యభ్యాసములనే యాధారముగఁ గొని యుక్తులఁ బన్నుదురు. లేఖకుఁడు వీనిని మిక్కిలి జాగరూకతతో గమనించి వివరింపవలయు.

5 చేష్టలు:— ఆ జంతువులు క్రోధోత్సాహాదిసమయములందుఁ జేయుపనులు చేష్ట లనఁబడును. కుక్క కఱచును. గుఱ్ఱము తన్నును. పావురము పల్లటీలుకొట్టును. కోడిపుంజులు పోరాడును. కోఁతులు చెట్లమీఁదనే దుముకులాడును. ఎలుఁగుబంటి మాంసభక్షకజంతువుకాకపోయినను మనుజుని జంపి, చీల్చి, వాని ప్రేగులతో నాడుకొనుచుండును. పులి తన కెరయగు జంతువుపైకిఁ బోవునపుడు తన మేనివాసన దానికిఁ దెలియకుండుటకుఁ దాను గాలి దిగువభాగమునకుఁ బోయి, యచటనుండి గాలి కెదురుగ వచ్చి, యాజంతువుపైఁ బడును. ఇట్టివి వాని చేష్టలు.

6 పెంచెడిపద్ధతులు:— పులులను బోనులందును, గొఱ్ఱెలను దొడ్లయందును, చిలుకలను పంజరములందును, పాములను పేళ్లపెట్టెలయందును, కుక్కలను

పిల్లలను ఇండ్లయందును, గుఱ్ఱములను లాయములందును బెట్టి పెంచెదరు. ఇట్లే వివరించి వ్రాయవలయు.

7 శత్రుత్వమిత్రత్వములు:— ఆవులు, గేదెలు, మేకలు, గుఱ్ఱములు, గాడిదలు లోనగు జంతువు లన్యోన్యమిత్రములు. ఇవి మందలుగఁ గూడి సంచరించును. పులి సింహము లోనగునవి యొంటరిగనే తిరుగును గాని మందలుగ నుండవు. కుక్కకు పిల్లికి సహజవైరము. ఇత్యాదులు.

8 ప్రయోజనములు:— ఏనుఁగులు పిరంగిబండ్లను లాగుటకును, ఒంటెలు ఎడారులను దాఁటుటకును, ఆవులు పాలిచ్చుటకును, కుక్క యింటిని గాచుటకును, చిలుకలు మధురధ్వనులచే మనుజుల నానందపఱచుటకును బనికివచ్చును. ఇట్టివే ప్రయోజనములు. దుష్టజంతువులవలని నష్టములనుగూడ దీనియందే చెప్పవచ్చును.

ఈ యెనిమిదివిధంబులు నిచట దృష్టాంతమాత్రముగ వివరింపఁబడినవి. విద్యార్థి జంతువులనుగూర్చి వ్రాయ నెంచునపుడు వాని నీ యెనిమిదిభాగములుగ విభజించుకొని వ్రాయు నెడ నెంత విరివిగనైన వ్రాయవచ్చును.

అచేతనములు; నదులు.

1 పుట్టెడి తావు:—
2 ప్రవహించు దేశములు:—
3 తీరమందలి ముఖ్యపట్టణములు:—

(ఇవి స్పష్టములగుటచే నిచట వివరింపఁబడలేదు.)

4 నీటి గుణము:— తేలికగనుండుట, బరువుగనుండుట, జిడ్డు తేలుట, ఏదైన రంగును గలిగియుండుట, పైత్యమును శైత్యమును జేయుట ఇత్యాదులు.

5 ప్రయోజనములు:—స్నానపానంబులు, ఓడల రాకపోకలు, పంటలు లోనగువానికి బనికివచ్చుట.

వృక్షములు.

1 ఆకారము:— గరక, దుబ్బు, తీఁగ, మొక్క, మ్రాను మొదలగు వివరములను దెలుపవలయు. మఱ్ఱిచెట్టునకు ఊడ లుండును. సరవుచెట్టు పొడుగుగఁ బెరుగును. ఇత్యాదులు వాని యాకారమును దెలుపును.

2 పెరుగు తావులు:— చెఱుకుచెట్లు బురదనేలలందును, కొబ్బరిచెట్లు ఇసుకనేలలయందును, మామిడిచెట్లు రేగడనేలలయందును బెరుగును.

3 పెంచు విధములు:— ఎరువులను వేయుటయందును, ఏతము మొదలగుజల యంత్రములతో నీరుకట్టుటయందును, దోహదములను జేయుటయందును అవలంబింపఁదగు బహువిధపద్ధతులఁ దెలియుచువలెను వివరింపవలయు.

4 ప్రయోజనములు:— శాకపుష్ప ఫల పత్రంబులకును, మూలములు, వాసములు, బల్లలు, వంటచెఱకు లోనగువానికిని బనికివచ్చు విధమును దెలుపవలయును.

చేతనాచేతనములఁగూర్చి వ్రాయఁదలఁచునపుడు లేఖకుఁ డివ్విధంబున నాయా విషయంబులను దన యిచ్చవచ్చినన్ని విధములుగఁ దోఁచిన విభజించుకొని వ్రాయఁదలఁచెడి మొత్తము పుటలసంఖ్య ననుసరించి యొక్కొక్క భాగమును వలయువఱకు వివరించుచు వ్రాయవలయును.

గుణప్రధానములు.

ఈ గుణప్రధానవిషయములను గూర్చి సర్వసామాన్యముగ విషయాంతర్విభజనము చేయుట దుష్కరము. వారివారి రేయేవిశేషాంశములఁ జెప్ప నెంతురో వానికిఁ దగునట్లు విషయవిభజనము నొనర్చుకొనవలయును. ఒకనిక్రమమును బోలి మఱియొకనిక్రమ ముండుట కలుగదు. ఈవిషయమును వ్రాయనెంచునపుడు మూఁడుదినములు ముందునుండియు లేఖకుఁడు ప్రత్యేకదృష్టితో బ్రపంచమును బరిశీలించుటకు మొదలిడవలయును. తనకుఁ గావలసిన విషయ మంతయు నచటనే లభించును. దానిని తన కనుకూలమగు విధముగ విభజించుకొనవలయును. అయినను మార్గదర్శకముగ నుంటకై యొక్క విషయము నిచట విభజించి చూపెదను.

అనృతనిరసనము.

1 ఉపోద్ఘాతము:— మనుజులు నీతిబాహ్యవర్తనులగుచు దుష్కార్యముల నాచరించి యాదుష్టత్వమును గప్పుకొనుటకును, స్వలాభాపేక్షచేతను గల్లలాడుచుందురు ఈ యభ్యాసము తొలుత లాభకరముగఁ గన్పట్టును గాని యనంతరమం దిహపరలోక సుఖములఁ జెఱచును.

2 కారణములు. 1 మిత్రులలో నన్యోన్యవిశ్వాసము చెడును. 2 దీనికై అభూత కల్పనాశక్తి, జ్ఞాపకశక్తి, జాకరూకతయు వలయును; అవి దుర్లభములు. 3 తాను నిజము చెప్పినను ఇతరులు నమ్మరు. 4 తన యనృతము వెల్లడియగునేమో యను [illegible]మే తనపాలిటికి శిక్ష యగును. ఇత్యాదులు.

3 దృష్టాంతములు:— గొల్లబాలకాపరి వినోదమునకు పులిపులియని యఱచి వినాశముఁ జెందెను. ఇత్యాదులును, చరిత్రాంశములును.

4 ప్రమాణములు:— సత్యమువలనన ములు నూపు గౌరవంబునఁ బేర్మికి ఇత్యాదులు.

5 సారాంశము:— కల్లలాడుట పనికిరాదు.

ఈ గుణప్రధాన విషయములెంతగ వివిధంబులుగ నుండినను వానిలో నీ యైదు భాగములు మాత్రము సర్వసామాన్యముగ నుండఁ దగును. విద్యార్థులీ పద్ధతుల నవలంబించునెడ వారలకుఁ జక్కని వ్యాసలేఖన సామర్థ్యము కలుగును. అనంతరమం దది సమయోచితంబుగఁ బద్యగద్యగీతరూపంబుల నొంది పలువిధంబులఁ బ్రకాశించును. కావున విద్యార్థు లిట్లు దోషనివారకంబులును గుణసంపాదకంబులును నగు మార్గముల నవలంబించి వ్యాసలేఖనము నభ్యసించి మేలువడయుదురుగాక.

## గ్రంథకరణోద్దేశము.

సీ. శ్రీలకు నాలవాలమయి • చెన్నువహించిన యాంధ్రదేశమా
దేంకా కొన్ని కాలమున • నేర సుధీజను లాంధ్రభాష ను
న్యాలముచేయు కార్యములఁ • బూనుచునుండిరి; యిక్కఁ గొంద ఱే
కొంటెమె వీరి సంఘమున • స్వోదరపూరణమాత్రవృత్తిచేఁ
గాలము పుచ్చుచుండిరి; జ • గంబున మర్త్యులకెల్ల భాషయే
మూలము భావబోధనకు; • భూమిని గల్గు సమస్తవిద్య లే
వేళను భాషచేతనె ప్ర • వృత్తిని, వృద్ధిని గాంచుచుండుఁ; దా
క్కాల? సమస్తకార్యపరి • వృద్ధికి భాషయె కారణమండ్రు ని
*ఆలము సేయు చింతయు న • వశ్యమె కావున నీని భాషఁగ
మేలుగ గాలకావలికి • మిక్కిలి కష్టము లేక బోధ్యమై,
వేలు ప్రసంగికాలము • లెస్సగఁ గూర్చుచు, వ్యాసలేఖనా
భ్యాలి లభించఁ జేసి, వివ • యోచితధర్మము నేర్పునట్లుగా
§ఏలల లీలఁ బద్యము ల • నేకము గా ప్రకృతార్థసంతతుల్
మేలుగ సంతసంబొసఁగి • పెట్టినయట్టుల వ్యాసమంజరిన్
జాలఁగఁ గూర్చితిన్; గుణ • శాలులు బోధసుధానురక్తు లౌ
బాలకులార! దీనిఁ గొని, • భాషను జక్కఁగ నేర్చి, యెంతయున్
మేలును గాంచి, దేశమున • మీదగు కీర్తిఁ జిరంబు సేయుఁడీ;
పాలితధర్ముఁ డైన భగ • వంతుఁడు మీకును భోగభాగ్యముల్



* ఆలము = యుద్ధము, ఉపేక్ష. § ఏల = బాలక్రీడాగీతము.

## తప్పొప్పుల పట్టిక.

☞ ఈ తప్పులను సిరాతో ముందు సవరించుకొని పిమ్మట గ్రంథమును జదువుట యుచితకార్యము.

| పుట | పంక్తి | తప్పు | | | ఒప్పు |
|---|---|---|---|---|---|
| 21 | 6 | సస్కృరించి | ... | ... | సంస్కృరించి |
| 43 | 3 | తివిధ | ... | ... | త్రివిధ |
| 52 | 1 | ఒక ళ | ... | ... | ఒకవేళ |
| ,, | 5 | నసావధానము | ... | ... | సావధానము. |
| 70 | 9 | సు ృతే | ... | ... | సుకృతే |
| 72 | 18 | జయస్వరము | ... | ... | జంటస్వరము |
| 130 | 9 | జెయఁబడ | ... | ... | జేయఁబడ |
| 135 | 3 | బౌరుషం | ... | ... | పౌరుషము |
| 141 | 10 | కలుగుటచే | ... | ... | కలుగఁజే |
| 144 | 2 | వ్యాస | ... | ... | న్యాస |





**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TLPA104B196 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 26-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 177 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Habeeba |
| పేజీలు విడదీసినది | Navya [illegible] |
| స్కాన్ చేసినది | Prathyusha |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | NO |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |